# అర్కపురి లేఖలు



రచన
భవానీ కుమారి

ప్రచురణ
మాతృశ్రీ పబ్లికేషన్సు
శ్రీ విశ్వజననీపరిషత్
జిల్లెళ్ళమూడి - 522 113, గుంటూరు జిల్లా. (ఆం.ప్ర.)

సర్వస్వామ్య సంకలితము

వెల : **రూ. 60/-**

ప్రథమ ముద్రణ : ఆగష్టు 2010

అమ్మ ఆలయ ప్రవేశ రజతోత్సవ ప్రచురణ

ప్రతులు : 1000

**గ్రంథములు దొరుకుచోటు**

**శ్రీ విశ్వజననీపరిషత్**

**జిల్లెళ్ళమూడి - 522 113, బాపట్ల మండలం,**

**గుంటూరు జిల్లా. (ఆం.ప్ర.) - ఇండియా**

డి.టి.పి. : క్రియేషన్ గ్రాఫిక్స్,
**5/4,** అరండల్‌పేట
గుంటూరు. ఫోన్: 2250885

ముద్రణ : లక్ష్మీగణపతి ఆర్ట్‌ప్రింటర్స్,
2/4, బ్రాడీపేట,
గుంటూరు. ఫోన్: 2235036

# విషయసూచిక

# ప్రకాశకుల మనవి

మాతృశ్రీ మాసపత్రికను ప్రారంభిద్దామనుకున్న రోజులలో శ్రీ కొండముది రామకృష్ణ నాన్నగారితో ఈ విషయం చెప్పగా నాన్నగారు "ఒక వ్యక్తిని గూర్చి ప్రతి నెలా వ్రాయటానికి ఏముంటుందిరా ? అన్నారు. "చూచే కన్ను వ్రాసే పెన్ను ఉండాలి కాని ఎంతైనా వ్రాయవచ్చు నాన్నగారూ!" అన్నాడుట రామకృష్ణ.

నిజమే గత నలభై ఏళ్ళుగా పత్రిక నడుస్తూనే ఉన్నది. ఎన్నో గ్రంధాలు వస్తూనే ఉన్నవి మరి. ఎంత సాహిత్యం వచ్చిందో ! శతాధికంగా గ్రంధాలు ప్రచురింపబడ్డాయి. ఆ సాహిత్యంపై పరిశోధనలూ జరిగాయి.

అమ్మ భౌతికంగా ఉన్న రోజుల్లో అమ్మదినచర్య వ్రాసిన భవానీకుమారి ఎంత సునిశితంగా పరిశీలించిందీ ఈ గ్రంధంలో మనకు ద్యోతకమౌతుంది. డాక్టర్ శ్రీ పాదగోపాలకృష్ణమూర్తిగారు ఈ దినచర్యలోని భాగాలతోనే "అమ్మ - అమ్మ వాక్యాలు" "అమ్మతో సంభాషణలు" వంటి గ్రంథాలను సంకలనం చేయగలిగారు.

భవానీకుమారి 'అర్కపురి లేఖలు" పేరుతో తన మిత్రులకు వ్రాసిన ఉత్తరాల రూపంలో అమ్మదినచర్యను, అర్కపురి విశేషాలను వివరించింది. ఎన్నో అమూల్యమైన విషయాలు అందించింది. ఆ కుమారి ఈ మధ్యనే పరమపదించడంతో ఆమె రచనలన్నీ ఒక చోటికి చేరిస్తే బాగుంటుందనిపించింది. దాని రూపమే ఈ గ్రంధ ప్రచురణ. అమ్మ సందేశ వ్యాప్తికి ఇది ఎంతో దోహదం చేస్తుందని మా నమ్మకం. అమ్మ ఆలయ ప్రవేశ రజతోత్సవాల సందర్భంగా ప్రచురణ కావటం మాకు ఆనందంగా ఉన్నది. దీని కొక రూపాన్ని కల్పించిన శ్రీ విశ్వజనని మాసపత్రిక సంపాదకులు శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్‌కు అమ్మ ఆశీస్సులు సర్వదా ప్రసరించుగాక !

- శ్రీవిశ్వజననీపరిషత్

# భవానీ కుమారి

శ్రీ పి.యస్.ఆర్. ఆంజనేయప్రసాద్

“భవానీకుమారి” అంటే చాలా తక్కువమందికి తెలుసు. కుమారి అంటేనే జిల్లెళ్ళమూడికి 1970లోపు వచ్చిన చాలామందికి తెలుసు. అసలు పేరు జి.సాయీకుమారి.

వరంగల్‌లో ఫోటోగ్రాఫర్‌గా ఉన్నవాళ్ళ నాన్నతో తన చెల్లెలు నిర్మలతో కలసి అమ్మ వద్దకు వచ్చింది అమ్మ దగ్గర ఉండిపోతానన్నది. అమ్మ సరే అన్నది. అలా కుమారి అమ్మదగ్గర అందరింట్లో ఉండటం తటస్థించింది.

ఆరోజులలో అమ్మ ఎన్నో విషయాలు దగ్గర చేరినవారికి చెబుతూ ఉండేది. అంతేకాదు అమ్మ పూజలలో అమ్మకు ఎన్నో ముద్రలు పడుతుండేవి. వాటన్నింటినీ ప్రత్యక్షంగా చూచిన కుమారి అమ్మలోని అతిమానుష శక్తిని గుర్తించి అమ్మను గూర్చి లోకానికి తెలియచేయాలనే తపన పడ్డది. ఆ అమ్మాయి వచ్చేనాటికి మన కే రకమైన పత్రికలు గ్రంథాలు పెద్దగా వెలువడలేదు. 1962 నుండి సంవత్సరాని కొక అమ్మ జన్మదినోత్సవ సంచిక మాతృశ్రీ పేరుతో తీసుకొని రావటం జరిగింది. 1963లో మొదటిసారిగా కుమారి రచన అందులో చోటు చేసుకొన్నది “నివేదన” అన్న పేరుతో. అందులోనే కుమారి రచనా పాటవం స్పష్టంగా గోచరిస్తున్నది.

అమ్మ దర్శనంతో తన శిథిలజీవితానికి సుప్రభాతమైందనీ, ఆ ఉషస్సులో తన భవిష్యజ్జీవితానికి గమ్యం ఏర్పడిందని తెలుసుకొన్నది. తల్లి చిన్నప్పుడే చనిపోయింది. మారుటి తల్లి వద్ద నానా కష్టాలు అనుభవించింది. అమ్మలోని మాతృవాత్సల్యం ఆ హృదయాన్ని కదిలించింది, కరిగించింది. బంధువులు, స్నేహితులు ఇదేమిటి ఈ పిచ్చిది అమ్మంటూ ఇల్లు వదిలి అక్కడే ఉన్నది అని గేలిచేశారు. తండ్రి బలవంతం చేశాడు ఇంటికి రమ్మని. కాని కుమారి దృఢనిశ్చయంతో జిల్లెళ్ళమూడిలో అమ్మ దగ్గరే ఉండిపోయింది. అక్కడి వాళ్ళే అన్నయ్యలు, అక్కయ్యలు, తమ్ముళ్ళు, చెల్లెళ్ళు అయ్యారు. వారితోనే జీవితం ముడివేసుకొని పోయింది. ఈ విశ్వకుటుంబంలో ఒక సభ్యురాలైంది. అమ్మ చల్లని ఒడిలోనే సేదదీర్చుకొన్నది. అంతే ఆ అమ్మాయిలో క్రొత్తరక్తం పట్టింది.

సోదరీసోదరులతో కలసి క్రొత్తగా ఏర్పడే భవన నిర్మాణంలో ఇటుకలు మోసింది. లారీలమీద వెళ్ళి ఇసుకను నింపి తెచ్చేది, బండిమీద బస్తాలతో వరిపొట్టు ఎత్తుకొని వచ్చేది. భవనానికి పునాదులు త్రవ్వేది, పలుగు పారలు పట్టుకొని తలపై గడ్డి చుట్టలు పెట్టుకొని మట్టి తట్టలు మోసేది. అమ్మస్నానానికి, అన్నపూర్ణాలయానికి, పశువులకు కావలసిన నీళ్ళు బుంగలతోనో, బళ్ళ మీద పీపాలతోనో తీసుకొని వచ్చేది. అంట్లు తోమేది. గుడ్డలు ఉతికేది. ఒకటేమికి అన్నిపనులూ చేసేది. మగ ఆడా తేడా లేకుండా కలిసి పనిచేసేది. అంతా అమ్మ ఆరాధనగా చేసేది. అమ్మ పకలరింపు అమ్మ చూపు తనలో క్రొత్త ఉత్తేజాన్ని నింపేది. కష్టాన్ని మరిపింప చేసేది. ఎంతకాలమున్నా అమ్మను విడిచి పెట్టలేని ఆకర్షణ, ఆనందము. ఎప్పుడైనా కొద్దికాలం విడిచిపోవాల్సి వచ్చినా కన్నీరు కార్చేది.

అసలు అమ్మలోని ఈ ఆకర్షణ ఏమిటి ? తనకు తనే ఆలోచించుకున్న కుమారికి ఒక ఊహ తట్టింది. ఆనాడు రాముడు అరణ్యానికి బయలుదేరితే అయోధ్యా ప్రజలంతా ఎందుకు ఆయన వెంటపడ్డారు ? అరణ్యాలకు వెళ్ళితే వానరులు అన్నీ మరచి రఘువల్లభుని వెంట ఎందుకు సంచరించారు ? శ్రీకృష్ణుని వేణునాదం విన్న గోపికలు సర్వం వదిలి ఎందుకు పరుగులు తీశారు ? ఆ ప్రేమతత్వానికే తాను బందీనైనాను అనుకున్నది. అంతే కాదు ఆ ప్రేమ మహాసాగరంలో స్నానం చేయకపోయినా దోసిళ్ళతో జలపానం మాత్రం చేసింది.

కుమారిని జిల్లెళ్ళమూడి ఒక వ్యక్తిగా నిలబెట్టింది అమ్మ డైరీరాయటం. అసలు ఆ సంకల్పం రావటమే గొప్ప విషయం. రమణాశ్రమంలో రమణ మహర్షి దినచర్యను నాగమ్మ అనే సోదరి వ్రాసేది. అవి చదివిన కుమారి మనస్సులో అమ్మ డైరీ వ్రాయాలనే ఆలోచన వచ్చింది. డైరీ వ్రాసే మెలుకువలు తెలుసుకోవటం కోసం తిరుకున్నామలై లోని రమణాశ్రమానికి వెళ్ళి నాగమ్మను కలిసి సంప్రదించింది. అలా పట్టుదలతో ఆ కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది.

విశ్వజనని పత్రిక 1966 జూన్‌లో మాసపత్రికగా మొదలైంది. 1966 కు ముందు అమ్మ జన్మదినోత్సవ సంచికలలో వ్రాసేది. ఆ తర్వాత ప్రతినెల దాదాపు ఐదు సంవత్సరాలు నిరాఘాటంగా "అర్కపురి లేఖలు" శీర్షికతో "అర్కపురి విశేషాలు"

శీర్షికలతో వ్రాసింది. అప్పుడప్పుడు విశేషమైన ఘట్టాలను అత్యంత సమర్థవంతంగా చేయి తిరిగిన రచయిత్రిగా వ్రాసింది. శ్రీపాదవారు అమ్మ సంభాషణలు, అమ్మ – అమ్మవాక్యాలు సంకలనం చేయడానికి కావలసిన ముడిసరుకు వసుంధర, కుమారి వ్రాసిన డైరీల నుండి సేకరించబడిందే. ఆ విషయాన్ని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు తమ ముందుమాటలలో వ్యక్తపరచారు కూడా.

అమ్మ వైకుంఠపాళి ఆడుతున్నది పిల్లలతో కలసి. శేషగిరిరావన్నయ్య పనుమడు ఫణి నీకు ఆటలంటే ఇష్టమా ? అమ్మా ! అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. "అవును నాయనా ! నేను వచ్చిందిఅందుకే. నేను చేస్తున్నదే అది" అన్నది. అమ్మ పందెం వేస్తున్నది. కుమారి అమ్మతో ముందు దేవుడి పందెం వెయ్యాలి అన్నది. అప్పుడమ్మ "దేవుడి పందెం ఏముంది దేవుడే పందెం వేస్తుంటే" అన్నది. అమ్మ తాను దేవుడనని ఒప్పుకొన్న సందర్భాలు తక్కువ. కుమారి దగ్గర ఒప్పుకొన్నది మరి.

నిజమే ఆ దేవతతో, పరాశక్తితో ఆడుకొనే అదృష్టం కల్గిన కుమారి లాంటివారు ధన్యులే. ఒకసారి వసుంధర తల్లి కోన వెంకాయమ్మ గారు చనిపోయినప్పుడు అమ్మే చితికి నిప్పంటించింది. శవం కాలినవాసనే రాలేదే అని అందరూ ఆశ్చర్యపోతుంటే అమ్మ చేతిమీదిగా అగ్నికిఆహుతి ఐతే ఇంకా వాసనలెక్కడుంటాయి అనుకున్నారట అక్కడి వచ్చినపెద్దలు. అమ్మతో ఓంకారనదిలో స్నానానికి వెళ్ళిన కుమారి లాంటి వాళ్ళకు మానసిక తాపం ఎలా ఉన్నా శారీరక తాపం తీరిందట. అమ్మ అందరీమీద నీళ్ళు చల్లుతూ, కేరింతలు కొట్టుతూ, నవ్విస్తూ అల్లరి చేస్తుంటే జలదేవత ప్రత్యక్షమైనట్టే భావించింది కుమారి.

ఒకరోజు హైమ అమ్మవద్దకు వచ్చి లలితా సహస్రనామం చేస్తున్నా, జపం చేస్తున్నా తాను పొందాల్సిన దేదో పొందలేకపోతున్నానని, తన సంగతేమిటో చెప్పమని అడిగింది. అప్పుడు అమ్మ హైమతో "ఏమిటో హైమా ! నీలా ఈ గమ్యాలు చేరటం వీటి గురించి ఆలోచన ఉండదు. నాకు పిల్లలతో ఆడుకోవటం అల్లరి చేయటంలోనే ఆనందంగా, హాయిగా ఉంటుంది" అన్నది. అప్పుడు ప్రక్కనే ఉన్నా కుమారి "అందుకేనమ్మా! నీ దగ్గర మాకింత చనువున్నది. హైమ ఎందుకు

ఆలోచిస్తున్నదో కాని, ఈ సాధనలూ, గమ్యాన్వేషణలూ అంటూ బాధపడేకంటే నీ దగ్గర ఇట్లా ఆడుకుంటూ నీ అల్లరిలో పాలు పంచుకుంటుంటేనే బాగుంటుం దనిపిస్తుంది'' అన్నది. అవును భగవంతుడితో ఆడుకోవటం కంటే కావల్సిందేముంది? శ్రీ కృష్ణుడితో ఆడుకున్న గోపబాలురెంత పుణ్యం చేసుకొన్నారో? భగవంతుడవతార మెత్తితే తనతోపాటే పరివారాన్నీ తెచ్చుకుంటాడట. అలాగే మనమునూ. దర్శన స్పర్శనాదులిచ్చి మనల్ని ఉద్ధరించటమే భగవంతుని లక్ష్యం. కేశవశర్మ అందుకే అన్నాడు. "శ్రీకృష్ణునితో పుట్టి ఆడుకోలేదే - రామకృష్ణ పరమహంస కాలములో ఆయనను చూడలేకపోయానే అనే చింత నాకు లేదు. అమ్మతో ఆడుకోవటం పాడుకోవటం చేశాము అని. గుడిపాటి వెంకటచలం కూడా అమ్మ అతని వద్దకు వెళ్ళి వాత్సల్యంతో దగ్గరకు తీసుకున్నప్పుడు "భగవంతు డెక్కడున్నాడని ఎవరైనా అడిగితే ఇప్పుడు చెపుతాను ఇదిగో ఇక్కడ అమ్మరూపంలో ఉన్నాడని" అన్నాడు. కుమారి కూడా అలా అమ్మతో ఆడుకొని ధన్యురాలైన గోపికలలో ఒకతి అని చెప్పవచ్చు. అయితే అప్పుడప్పుడు అమ్మ మీద అలుగుతుండేది. అందుకే అందరూ "సత్యభామ" అంటుండేవారు. ఆ రోజులో వసుంధరను రుక్మిణి అని కుమారిని సత్యభామ అని అనటం జరుగుతుండేది.

ఒకనాడు అమ్మ చేప్పే మాటను కుమారి డైరీలో త్వరత్వరగా వ్రాస్తున్నది. అమ్మ "ఇప్పుడు నే నన్నమాట వినపడిందా" అన్నది కుమారితో. కుమారి రోషంగా నేనేం నీ కోడలిని (ఒక సోదరిని అమ్మ ముద్దుగా పిలిచే పిలుపు) కాదమ్మా ! వినబడక పోవటానికి" అన్నది. అప్పుడు అమ్మ "నా కోడలివి కాదుకానీ నా కూడలివి" అన్నది. అమ్మ కూడలిలో ఉండటం మాత్రం సామాన్యమైన విషయమా? మనం ఉండటం కాదేమో ! అమ్మ ఉంచుకోవటమే నేమో! అనిపిస్తుంది. లేకపోతే క్షణం కూడా అమ్మ దగ్గర ఉండలేం.

కుమారి మాతృశ్రీ ప్రింటర్స్‌లో పనిచేసేది. అందరింటి నిర్వాహకులు ఏ పనిచెపితే ఆపని చేసేది. అమ్మవద్ద ఉండాలని వచ్చే ఎవరైనా అమ్మతో ఆ ఆవరణలోఉండాలనే కోరుకుంటారు. బాపట్లలో ప్రెస్ ఉండటం వల్ల కొందరు రోజూ అక్కడ పనిచేస్తూ పోయి వచ్చేవారు. కాని కుమారి బాపట్లలోనే ప్రెస్‌లోనే ఉండేది.

జిల్లెళ్ళమూడి వచ్చేనాటికి యస్.యస్.యల్.సి. చదివిన కుమారికి హిందీ పరీక్షలకు చదవాలనే ఆలోచన వచ్చింది. మధ్యమ, రాష్ట్ర భాష, ప్రవేశిక, విశారద ఇలా అన్ని పరీక్షలకు నాచేత పుస్తకాలు తెప్పించుకుని చదివి ఉత్తీర్ణురాలైంది. ఆ తర్వాత ఇంటర్, బి.ఎ., యం.ఏ హిందీ పరీక్షలు కూడా స్వతంత్రంగా చదివి చక్కటి మార్కులు తెచ్చుకొని ఉత్తీర్ణురాలై హిందీ ట్రయినింగ్ చదివి హిందీటీచర్‌గా చేరింది. కారణాలేవైనా పది సంవత్సరాలు అమ్మ సన్నిధిలో గడిపి అక్కడి వారందరి మనస్సులలో ఒక సముచిత స్థానాన్ని సంపాదించుకున్న కుమారి జిల్లెళ్ళమూడిని అమ్మను వదలి ఉద్యోగంలో చేరింది. ఉద్యోగంలో చేరినా ఇక్కడి సోదరీ సోదరులతో ఏర్పడిన అనుబంధాలు ఏలా పోగొట్టుకుంటుంది ? కాత్యాయని అక్కయ్య, రాధాకృష్ణశర్మగారి కుటుంబంతో రామకృష్ణన్నయ్యతో చిరకాలం తన సోదరీ బంధాన్ని కొనసాగిస్తూనే ఉన్నది. అమ్మను తాను భౌతికంగా వదిలినా మానసికంగా అమ్మ వదలదు కదా ! నన్ను వదిలి ఎవరూ లేరు అన్న అమ్మ మాట సార్థకమే. కుమారి కూడా ఆ తానులోని గుడ్డే.

నేను చివరగా రవి కుమార్తె (పింకీ) అనుసూయ పెళ్ళిలో చూచాను. ది.8.12.2009న అమ్మలో ఐక్యమైంది. కాని జిల్లెళ్ళమూడిలో సంచరించిన కుమారి జ్ఞాపకాలు ఎప్పుడూ వెంటాడుతూనే ఉంటాయి. రామాయణంలో శ్రీరామచంద్రుడు చిన్న మేలు చేసిన వారిని కూడా మరచి పోడు అని చెప్పబడింది. అలాగే అమ్మ సేవచేసిన కుమారిని అమ్మ మరచిపోతుందా ? కుమారి చిరంజీవి – ధన్యురాలు.



# మౌనపూజ

అమ్మా !...

నిన్ను దర్శించినరోజే నా శిథిల జీవితానికి ప్రభాతమైనదని ఆ ప్రభాత ఉషస్సే నా భవిష్యత్ జీవనమార్గానికీ గమ్యమని తెలుసుకున్నాను. కాని సరైన నా జీవనగమ్యమును వెదకడంలో నేను నీ దగ్గరికి ఒంటరిగా వచ్చానని నన్ను పరిహసించే వాళ్ళ పరిహాసములు నన్ను బాధించలేదు. వారికి ఏమి తెలుసు నీ తోడుగానే నేను నీ దగ్గరికి కదలి వచ్చానని. వారి పరిహాసములకు నా హృదయము చెదరి నా బాటను తప్పుతానేమో అన్న భయంతో వెనుతిరిగి నిన్ను పిల్చాను. నా భ్రమ, నీవు నా దగ్గరే ఉన్నావు. మాతృదేవిని ప్రేమించి, తిరిగి ప్రేమించబడటము ఎఱగని దౌర్భాగ్యురాలినని నన్ను దూషించే వారికేమి తెలుసు... నీవే నా మాతృదేవత వని ఆరాధించే నా హృదయం అనంతమైన నీ మాతృప్రేమ జలధిలో మునిగి ఉన్నదని. నాలో నీ మధురస్మృతులు సంచలనము లేవదీస్తూ అల్లరి చేస్తూంటే...

నీ అల్లరికి నవ్వుకుంటూ ఆర్ద్రమైన కన్నులతో శూన్యంలో కనుపిస్తున్న నీవంక నిర్నిమేషంగా స్తబ్దంగా చూస్తున్న నన్ను చూచి పిచ్చిదానిననే వారికేమి తెలుసు... యీ హడావుడి ప్రపంచం నుండి కొన్ని క్షణాలు నన్ను విముక్తురాల్ని చేసి ఏవో దివ్యానుభూతులను కలిగింపజేసి నన్ను నీకు మరింత సన్నిహితురాలిని చేసుకుంటున్నావని. నీపట్ల సరిగా భక్తి గౌరవాలు చూపించడము లేదని నన్ను మందలించే వారికేమి తెలుసు. నీ నామధ్య అడ్డుతెరలు లేవని నీకు శుష్కమైన ఆడంబరమైన భక్తిగౌరవాలతో పనిలేదని, నీకు కావలసింది పవిత్రమైన హృదయమనీ, ఆవేదనతో ఆర్తిచెందే నా హృదయమే పూజాపుష్పంగా నాకన్నీరే అభిషేకంగా చేసి నేను చేస్తున్న మౌనపూజను నీవు అందుకుంటున్నావని..

– ఏప్రియల్, 1963

# కొత్తరక్తం పట్టుతుంది

అన్నయ్యా,

నీవు ఆశించినంత, ఊహించినంత వివరంగా ఇక్కడి కబుర్లతో ఈ లేఖ నింపలేనేమో అంటే ఆదిలోనే హంసపాదా అని నిరాశపడతావు. కాని నీవు కోరినట్లే అమ్మసన్నిధిలో నేను గడిపిన ఈ కొద్దికాలంలో కన్న విన్నదాన్లో గ్రహించినంతవరకు అర్కపురి విశేషాలను విపులీకరించడానికే ప్రయత్నిస్తాను.

మరొక విషయం...

నీవెన్నడు కనని అమ్మమూర్తిని – ఆప్రేమతత్వాన్ని గురించి నీ కన్నులకు కట్టినట్లుగా వర్ణించమన్నావు కాని, ఆ వర్ణనకు భాష చాలదు అన్నయ్యా. భాషకే కాదు మన భావనలకు కూడా అతీతము అది. దివ్యమంగళ లీలామానుష స్వరూపిణి అమ్మ.

ఎవరిమనస్సు ఎంత కొలతబద్దో అంతే కొలుస్తుంది. అమ్మ సూక్తి ఇది. అలాగే మన మనస్సుకు అందినంతవరకే అమ్మని అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తా. మనం అర్థం తీసుకున్నంత వరకే అమ్మ పరిమితి కాదుగా.

"అమ్మ అంటే అడ్డులేనిది, అంతులేనిది, ఆధారభూతమైనది".

అందుకే అడ్డులేని – అంతులేని ఆ అమ్మ చల్లనిఒడిలో వయస్సుతో నిమిత్తం లేక పసిపాపల నుండి వృద్ధులవరకు తలదాచుకొని సేదతీర్చుకుంటున్నారు. కేవలం వయస్సుతో నిమిత్తమే కాదు అమ్మ దగ్గర తప్పుఒప్పులపట్టిక లేదు కనుక పతితులు, పావనులిద్దరూ రాగలుగుతున్నారు. దర్శనార్థమే వచ్చేవారిలో అమ్మను భూషిస్తున్నవారు, దూషిస్తున్నవారు ఇద్దరూ ఉన్నారు. మాతృమూర్తి కనుక ఇద్దరిని చేరువకు తీసుకుంటారు. ఏమిటీ అంటే "వాడూ నా బిడ్డడే" అంటారు. అంతేకాక లోపాలు లేనిదెవరికి ? అందరూ తిరస్కరించారని అమ్మ కూడా తిరస్కరిస్తే వారేమౌతారు, ఎక్కడికి వెళ్తారు ?" "దుష్టశిక్షణ అంటే వాడ్ని చంపటం కాదు. వాడిలోని దుష్టగుణాల్లో మార్పు తేవటమే వాడికిశిక్ష" అని అంటారు.

అవధులు – పరిధులు లేని మాతృప్రేమతత్వాన్ని గురించి మాటల్లో చెప్పలేము. ఎవరైనా అనుభవించి ఆనందించాల్సిందే. అనుకుంటాం, మన

కుటుంబాలలో అమ్మ ప్రేమ మన వరకు అవసరమైనంత పరిమితిగా ఉంటేనే ఆ ప్రేమకు అవధులులేవని. ఇక పరిపూర్ణ మాతృత్వం గూర్చి చెప్పాలనుకోవటం, దరిలేని అంబుధిని మధించటానికి పూనుకోవటమే.

ఇక్కడ నిత్యం అమ్మకు ఆరాధనలూ, అర్చనలూ జరుగుతాయి. కొందరు రాజరాజేశ్వరి అనో, లలిత అనో, కొందరు రాముడనో, కృష్ణుడనో, శివుడనో భావించి పూజిస్తారు. కొందరు 'అమ్మ' అని ఆరాధిస్తారు.

అమ్మ పెద్ద పెద్ద వేదాంత విషయాలను చిన్న చిన్న మాటలతో అందరికీ తెలిసేటట్లు చెప్తారు. ఎదురుగా కనుపిస్తున్న విషయాలనే ఉదహరిస్తారు. ఒక్క వేదాంతమేమిటి, అన్నయ్య, అన్ని విషయాల గురించి ఎంతో చక్కగా వివరిస్తారు.

ఎవరు వచ్చి అమ్మను దర్శించినా, "నాన్నా... భోజనం చేశారా ? ముందు భోజనం చేసి రండి. తర్వాత నా దగ్గర కూర్చుందురు గాని" అంటారు. జీవనదిలా నిరతమూ సాగుతున్న అన్నదానం గురించి అడిగితే "మీరు అన్నం లేక రావడం లేదు. అమ్మను చూడటానికి ఎంతో శ్రమపడివస్తే యీ చారు, చింతకాయపచ్చడితో నయినా అన్నం పెట్టుకోవద్దూ ? పిల్లల ఆకలి బాధ తల్లి ఓర్చుకోగలదా ?" అంటారు.

నీ ఉత్తరంలో ఒక చోట 'ఆశ్రమం' అన్నావు. ఇది ఆశ్రమం కాదు, అన్నయ్యా, ఇది విశ్వకుటుంబం. అనేక స్థలాల నుండి, అనేక మనస్తత్వాల వాళ్ళం యిక్కడకు వచ్చి ఒక కుటుంబంగా అమ్మదగ్గర ఉంటున్నాం. ఆమె అమ్మ; మేమంతా పిల్లలం. ఇక్కడ కులమత భేదాలు లేవు. అంతా కలిసి ఉంటాం. కలిసి భోజనం చేస్తాం. అట్లా అని, ఆచారాలను, సంప్రదాయాలను పరిహసిస్తున్నామనుకునేవు ! అవి కలవాళ్ళు వస్తే, వాళ్ళకు కావలసిన ఏర్పాట్లు ప్రత్యేకంగా జరుగుతాయి.

అన్నయ్యా, ఒక్కసారి నువ్వు యిక్కడకు వస్తే మహత్తరమైన మాతృప్రేమతో పాటు, నిర్మలమయిన సోదరవాత్సల్యం కూడా చవిచూస్తావు. ఇక్కడ ఉన్న వాళ్ళందరూ – ఆడవాళ్ళు మొగవాళ్ళను 'అన్నయ్య'లు గాను, మొగవాళ్ళు ఆడవాళ్ళను 'అక్కయ్య'లుగానూ చూసుకుంటారు. పవిత్రమయిన ప్రగాఢమయిన సోదరప్రేమానుబంధాలు యిక్కడ మనలను ఆశ్చర్యచకితులను చేస్తాయి.

రోజూ యిక్కడ మేమేం చేస్తామో, తెలుసా అన్నయ్యా ?

తెల్లవారు ఝామున 4 గంటలకే 'జేగంట' విని లేస్తాము. కాలకృత్యాలు తీర్చుకుని అమ్మ మందిరానికి వెళ్ళి 'సుప్రభాతపఠనం' చేసి అమ్మకు నమస్కారం చేస్తాము. అక్కడ నుండి ఎవరి పనుల మీద వారు వెళ్తారు. రోజూ దాదాపు 200 మందికి భోజనవసతి కలిగించాలి కనుక చాలా పనులుంటాయి. అదీగాక, వర్షాకాలంలో వసతికి యిబ్బందిగా ఉన్నందువల్ల భవన నిర్మాణాలు జరుగుతున్నాయి. ఇది అసలే చిన్నఊరు అయినందువల్ల పాలు, మజ్జిగ కోసం ఆవులు, గేదెలు పెంచబడుతున్నాయి. ఇక పనులకేం కొరత ? అన్నయ్యా, నలుగురు ఉన్న కుటుంబాలలోనే సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకూ నడుములు విరగుగొట్టుకున్నా సరిపోదుగదా ! మరి యిక్కడ 200 మందికి కావలసిన ఏర్పాట్లు ! అయినా, తమాషా, 24 గంటలూ పనిచేసినా ఒక్కోసారి వరుసగా 40, 50 గంటల పని కూడా చేస్తాం - శ్రమ కలుగదు; బాధ అనిపించదు. అమ్మనామం చేస్తూ అవలీలగా ఎంతపని అయినా చేస్తాం. ఇటుకరాయి తయారుచేస్తాం. బట్టీ పేరుస్తాం. యిటుకను బళ్ళమీద యింటికి తోలుతాం. ఎక్కడ నుండి అయినా లారీమీద యిసుక, వరిపొట్టుతో తోలుకువస్తాం. భవన నిర్మాణాలకు పునాదులు తవ్వుతాం, పలుగులు పారలు పట్టుకుని తలపై గడ్డి చుట్టలు పెట్టుకుని మట్టి తట్టలు మోస్తాం. గోడలు కడతాం. అమ్మ స్నానాలకు అన్నశాలలోకి పశువులకు కావలసిన నీళ్ళు బుంగలతోనో, బళ్ళమీదనో తీసుకువస్తాం. మేమే చర్నాకోలు పట్టుకుని బండి తోలుకుంటూ నవ్వుకుంటూ వుంటాం. అన్నం వండుకుంటాం. అంట్లు తోముకుంటాం. గుడ్డలు ఉతుక్కుంటాం. పశువులకు గడ్డి తెచ్చుకుంటాం. వాములు వేసుకుంటాం. కట్టెల కోసం తుమ్మలు కొట్టుకువస్తాం.

ఒకటేమిటి అన్నయ్యా ? అవసరమయిన అన్ని పనులు చేస్తాం. మొగపిల్లలతో పాటు ఆడపిల్లలం కూడా చేస్తాము. ఏపని చేయడానికయినా సిగ్గుపడము. పైగా యిదంతా అమ్మ ఆరాధన గానే భావిస్తాము. అమ్మ మాలో ఉండి మాకు నిరంతరమూ ప్రేరణనూ ఉత్సాహాన్ని కలిగిస్తూ వుంటారు.

పనులన్నీ అయిన తర్వాత సాయంకాలం అమ్మ దగ్గరకు వెళ్తాము. క్షణమాత్రమయిన పాదస్పర్శ ఎన్నిగంటల శ్రమనయినా పోగొట్టి హాయినిస్తుంది.

ఒక్కసారి కన్నెత్తి మావంకచూస్తే మాకు క్రొత్తరక్తం పట్టినట్లు ఉంటుంది. పన్నెత్తి ఒక్కమాట మాట్లాడితే మేము ఉప్పొంగిపోతాము.

అప్పుడు అందరకం కలసి సంధ్యావందన శ్లోకాలు పఠిస్తాం.

పగలల్లా పూజలతో తీర్థప్రసాదాలతో క్షణం విశ్రాంతి నెఱుగని అమ్మ చుట్టూ మేమంతా చేరుతాం. అమ్మ ఎన్నో కబుర్లు చెప్తారు. అవి కబుర్లు అనిపిస్తాయి కాని వానిలో అనుభవసారముంటుంది. సక్రమమయిన జీవితాన్ని ప్రబోధిస్తారు. యదార్థమయిన వేదాంతాన్ని అందిస్తారు. జీవితం వేరూ వేదాంతం వేరూ కాదంటారు. ఆమాటల్లో వేదవేదాంగాలూ, శాస్త్రాలూ, పురాణాలూ, కావ్యాలూ... అనేకం దొర్లిపోతుంటాయి.

"నేనేమీ చదువుకోలేదు" అనే అమ్మ, మరి యివన్నీ ఎట్లా చెప్తారో! నా పిచ్చిగాని అవి అన్నీ తానే అయిన అమ్మ యింకా అవి చదువు కోవడమేమిటి?

ఇంకా యిక్కడి విశేషాలు ఎన్నో ఉన్నాయి, నీకు చెప్పటానికి, ఎన్నని చెప్పేది ? నువ్వు ఒక్కసారి రా. నువ్వే చూద్దువు గాని.

లడ్డును గురించి ఎంత చదివితే యేముంది ? తిందువుగాని రా...

**– ఏప్రియల్, 1964**



# సమ్మోహనశక్తి

అన్నయ్యా,

నీవు కోరినట్లే గతలేఖలో ఇక్కడి విశేషాలు గురించి సంక్షిప్తంగా వివరించినట్టు ఈ లేఖలో నీకు కలిగిన సందేహాలకు సమాధానాలు క్లుప్తంలో విపులీకరించటానికి ప్రయత్నిస్తాను.

అమ్మ సన్నిధిలో నీవు గడిపింది కొన్ని గంటలు కాలమే. కాని ఆ సమయంలో నీకు కలిగిన దివ్యానుభూతి, నీవు అనుభవించిన ఆనందం ఇన్నేళ్ళ నీ జీవితంలో ఎక్కడా పొందలేదనీ, ఏ ఫలాపేక్షలతోనో, బాధలతోనో కాక కేవలం అమ్మను దర్శించాలన్న ఆకాంక్షతో (ఆర్తి కూడా లేదు) వచ్చిన నిన్ను తిరుగు ప్రయాణమైనపుడు అమ్మలోని ఏ ఆకర్షణ కదిలించి కన్నీరు కురిపించిందనీ దీనికి కారణం ఎంత తరచి తరచి ప్రశ్నించుకున్నా తెలియటం లేదని అన్నావు.

జ్ఞాపకముందా అన్నయ్యా ఒక సారి నన్ను ప్రశ్నించావు. సంవత్సరాలు గడచిపోతున్నా ఈ సన్నిధి నుండి నేను రాలేనని ఎందుకంటున్నావని, ఆ విడిచి రాలేని ఆకర్షణ అమ్మలో ఏముందని ? దీనికి సరియైన సమాధానం కొంతవరకైనా ఒక్క అనుభవం మాత్రమే ఇవ్వగలదు అని నా అభిప్రాయం. అందుకే లిఖితపూర్వకంగా ఏ సమాధానం ఇవ్వలేదు ఆనాడు. నీ వన్నది వాస్తవమే మరి.

నీలో ఆ రోజు ఆవిధంగా కట్టలు తెంచుకున్న దుఃఖానికి హేతు వేమిటి ? సంవత్సరాలు జరిగిపోతున్నా ఏ కారణం నన్ను ఇచ్చటనుండి కదలనివ్వకుండా కట్టివేసింది ?

ఏ ఆకర్షణవల్ల అమ్మను ఎన్నిసార్లు దర్శించినా మరొకసారి తిలకించాలనే ఆశ, ఇక్కడ ఉండాలనే భావం కలుగుతూ ఉంటాయి.

ఇట్లా ప్రశ్నించుకుంటూ వెళ్తే ఎన్నెన్నో ఉన్నాయి.

నిత్యం అనేకులు అమ్మను దర్శించి వెళ్తుంటారు. ఇందులో అందరూ ఒకే దృష్టితో రారుగా. వివిధ రకాల అభిప్రాయాలతో వస్తుంటారు. కాని ఏ ఒక్కరూ అమ్మను ఒకసారి చూచినా మరొకసారి చూడకుండా ఉండలేరు. ఈ విధంగా

ఎన్నిమార్లు చూసినా ఎప్పటికప్పుడు మళ్ళీ చూడాలని మనస్సు తపిస్తుంటుంది. ఈ తపన అమ్మయందు శ్రద్ధాభక్తులు కలిగిన వాళ్ళకే కాదు, విముఖత చూపించే వాళ్ళకు కూడా కలుగుతుంది. ఎందుకూ ? ఒక వేళ రాకుండా ఉండాలని ప్రయత్నించినా ఎంతవరకూ ? కొన్ని రోజులూ లేకపోతే వారాలు, నెలలూ కాకపోతే కొన్ని సంవత్సరాల వరకే. కాని మళ్ళీ ఎప్పుడో ఒకప్పుడు రాకమానరు. తప్పించుకోవాలని యత్నించినా తప్పుకోలేని ఈ తలంపునుండి ఎంత దూరం పరిగెత్తగలరు ?

వీళ్ళే కాదు నా అనుభవంలో ....

అమ్మను దూషించటమే కాదు, ఘోరమైన ఘాతుక చర్యలతో హింసించటానికి ప్రయత్నించిన వారు కూడా ఒకనాటి తమ తప్పిదానికి నేడు పశ్చాత్తాపంలో కుమిలిపోతూ ఆ దివ్యపాదాలను ఆశ్రయిస్తున్న వారినీ, మొదట భూషించి ఆ తర్వాత దూషించి తిరిగి తిరిగి చివరకు ఆ పావన పాదార విందాల చెంతకే చేరేవారినీ

ఒక ప్రక్క విమర్శిస్తూనే మరొక ప్రక్క కలిగిన వేదనను భరించలేక ఆ పాద పద్మాలపై వాలి తమ ఆవేదనను నివేదించుకుంటున్న వారిని, చూస్తున్నాను. దీనికి కారణం ఏమిటీ ?

బ్రతుకులోని బరువును భరించలేని వాళ్ళూ – జీవితంలో ఎదురయ్యే విషమ సంఘటనలను సహించలేనివాళ్ళూ – వెతల మధ్య నలిగి జీవితం అంటే విసిగివేసారి దానికి భరతవాక్యం పలకాలనుకున్న వ్యధిత హృదయులూ, వాళ్ళు కోల్పోయిన ప్రేమాదరణలనూ, ఆప్యాయతానురాగాల్ని శాంతిని అమ్మ చెంత పొందుతూ ఆ సన్నిధిన ఉండటం సరే.

ఇవేవీ కాక ఒకసారి చూచి వెళ్ళాలని వచ్చినవాళ్ళు తిరిగి విడిచి వెళ్ళలేక సంవత్సరాల తరబడి ఉండిపోతున్నారు. ఎందుకూ ?

ఇందులో తల్లిదండ్రులను ఒక్కక్షణం వదిలిపెట్టి ఉండలేని వాళ్ళూ – అమితగారాబంగా పెరిగినవాళ్ళూ ఉన్నారు. అయినప్పటికి అందరూ కలసి ఇక్కడ ఆ పనీ – ఈ పనీ అని విచక్షణ లేకుండా ఎంతైనా శ్రమించటానికి ఇష్టపడతారు

కాని వెళ్ళాలంటే మాత్రం కన్నీరు కారుస్తారు – ఎందువల్ల ?

ఇది విశ్వకుటుంబం. కనుక విభిన్న మనస్తత్వాలు ఉన్నాయి. ఇక్కడ – శాంతస్వభావులతో పాటూ ఉగ్రమూర్తులూ ఉన్నారు. ఈ ఉద్రిక్త స్వభావుల మధ్య సున్నితహృదయులూ ఉంటున్నారంటే ఏ విశేషతవల్ల ?

స్త్రీ పురుషులు కానీ, వివాహితులు – అవివాహితులు కానీ ఎవరికి తగిన ధర్మాలు – బాధ్యతలూ వాళ్ళకున్నాయి. అన్నీ మరచి ఒక వేళ జ్ఞాపకం ఉన్నా లెక్కచేయక ఇక్కడ ఉంటున్నా ఉండాలని ప్రయత్నిస్తున్నా సంఘంలో దూషింపబడటం – దుష్ప్రచారాల పాలుగావటం, కుటుంబాలలో కలతలూ, నలతలూ చెలరేగటం జరుగుతుంది. అప్పటికీ ఈ సంఘర్షణలో నలుగుతూ నైనా ఇక్కడికే పరుగులు తీస్తున్నారు. ఏ బలవత్తర ఆకర్షణవల్ల ?

అమ్మ తన అల్లరి కబుర్లతో చిలిపి చేష్టలతో ముగ్ధులను కావించే మనోజ్ఞవేళలతో పాటూ – మృదువుగా మందలించే గంభీర వేళలూ ఉంటాయి. అప్పుడైనా ఎందుకు అనిపించదు ఇక్కడ నుండి వెళ్ళాలని? వీటన్నింటికి కారణం ఏమిటీ ?

నీవు వచ్చినప్పుడు ఐదు సంవత్సరాల అపర్ణని చూచావు కదూ. అమ్మయందు ఆ చిన్నారికున్న అచంచల విశ్వాసానికి విస్మితుడనయ్యా నన్నావు. నీవే కాదన్నయ్యా – ఎప్పుడైనా – ఎక్కడైనా – ఏ సమయంలోనైనా – ఎవరైనా అమ్మను గూర్చి ప్రశ్నించనీ – అపర్ణ నుండి లభించే సమాధానాలు విని ప్రతి ఒక్కరూ ఆశ్చర్య చకితులౌతారు, ఆ పసిహృదయంలోని ఆరూఢమైన భక్తి విశ్వాసాలకు.

ఎన్నిగంటల కాలమైనాసరే అమ్మను తిలకిస్తున్నప్పుడు ఆ అమ్మాయి దృష్టిని ఎవరు – ఎన్ని విధాలుగా ప్రయత్నించినా చివరకు అమ్మయైనాసరే మరల్చలేరు.

"నువ్వు చూస్తున్నావని నేను ఎక్కడ కూర్చోను" అని నవ్వుతూ ఒక్కొక్కసారి అమ్మలోపలికి వెళ్తారు, అప్పటికైనా అపర్ణ దృష్టి మరల్చు తుందేమోనని. కాని అపర్ణ దృష్టా చెదిరేది ? హాలులో అమ్మ లేకపోతే ఆ నాలుగు గోడలకు అలంకరింపబడిన అమ్మ ఛాయా చిత్రాల మీద తన చూపు కేంద్రీకరిస్తుంది.

ఇక్కడ ఉన్న పిల్లందరికి నిరంతరం అమ్మ ధ్యాసే. అమ్మ నామం చెయ్యటం

వాళ్ళ పాటలు - అమ్మని ఆరాధించటం వాళ్ళ ఆటలు, అమ్మను గురించి చెప్పుకోవటం వాళ్ళ మాటలు.

ఇవన్నీ వాళ్ళకు ఎవరు చెప్పారు ? పెరుగుతున్న వాతావరణాన్ని బట్టి ఈ శిక్షణ ఏర్పడుతుందేమోనని అంటావేమో ! సరే మరి అప్పటి కప్పుడు వచ్చి వెళ్లిపోయే పిల్లల్లో కూడా ఇట్లా చెయ్యాలని ఇంటి దగ్గర శిక్షణ ఎవరు ఇస్తున్నారు? ఒకసారి చూచినవాళ్ళు మరొకసారి అమ్మను చూపించమని అక్కడే ఉండిపోదామని పెద్దవాళ్ళను వేధించమని వాళ్ళకు యెవరు చెప్పారు ? ఏ ప్రమాదమొచ్చినా, ఏ జబ్బుచేసినా మందు కంటే ముందు అమ్మ తీర్థం కుంకుమ ఉపయోగిస్తే నివారణ చెందుతుందనే నమ్మకం వాళ్ళలో కలగటానికి హేతువేమిటి ? చరమదశలో కూడా బంధువుల కోసం కాదు వాళ్ళు ఆరాటపడేది, తపించేదీ అమ్మ కోసం. ఆ నామ స్మరణ కోసం - ఆ తీర్థం కోసం. ఎందుకూ ? నెలలు నిండని పసివారు సైతం అమ్మ ఒడిలోకి చేరాక మళ్ళీ వాళ్ళ తల్లుల దగ్గరకు వెళ్ళమని మారాం చేస్తారు దేనికనీ ?

ఈ అవస్థ ఒక మనకే కాదు. పశుపక్ష్యాదులు కూడా అనుభవిస్తున్నాయ్ - అవీ మనలాగే అమ్మను చూస్తూ, ఆ మధురవాణి వింటూ ఆచరణ సన్నిధిన ఉండాలనే కాంక్షిస్తాయి. సాటివాడి ఆకాంక్షనే అర్థం చేసుకోలేని మనం ఇంకా వాటి వాంఛితాలను ఏం అర్థం చేసుకోగలం? చేసుకున్నా మానవనైజం కొద్దీ వాటిని విదిలించక, చీదరించుకొనక తప్పదు. అయినా భరించి ఇక్కడే ఉండటానికి యత్నిస్తాయ్.

ఈ సందేహాలను గురించి ఆలోచిస్తే మూలకారణం ఏదీ ? అదే ప్రశ్న మిగులుతుంది.

"నేనేం చదువుకోలేదు - నాకేంరాదు" అనే అమ్మ - సంభాషిస్తున్నంత సేపు అవతలి వ్యక్తిని బట్టి ఆ మనస్తత్వాన్ని బట్టీ అందుకు తగిన విధంగా సరళంగా సూక్తులూ, మధురోక్తులూ, ఛలోక్తులుతో నిండిన సమాధానాలు చెప్తుంటే వింటున్నాను.

నాకేం తెలియదు, నా దగ్గర ఏ మహాత్యాలు లేవు, నేను సామాన్యురాలిని,

అనే అమ్మ అంగవైకల్యులకు ఆ లోపం తీరుస్తున్నా ముక్తిమార్గంలో లక్ష్యం లేని అవిశ్వాసులకు విశ్వాసం కల్గించటానికి మహత్యాలు కనబరుస్తుంటే కంటున్నాను. ఇవే కాదు; ఇంకా అనేకం కంటున్నాను, వింటున్నాను కాని వీటన్నింటిలో నన్ను ఆకట్టుకొనగలిగిన విషయం యిదే.

ఇంతమందిని, ఇన్నిరకాల ప్రాణులనూ ఒకే త్రాటితో బంధితుల్ని కావించి వారి హృదయాల నిండా ఆవరించి అందరిచేత"అమ్మా" అని పిలిపింప చేసుకుంటున్న శక్తి అమ్మలో ఏమిటని ?

బహుశా నాకు కలిగిన ఈ సందేహాలు చాలామందికి కలుగుతాయేమో ఎందుకంటే ఇవి అందరికీ అందుబాటులో ఉన్న అనుభవాలే వాళ్ళు వెతుక్కుంటే ఏం సమాధానం లభిస్తుందో కాని నాకు లభించిన సమాధానం యిది – ఆనాడు ఏ కారణం చేత రామదర్శన భాగ్యం కలగగానే వానరులు అన్నీ మరచి రఘువల్లభుని వెంట అరణ్యాలలో సంచరించారు?

ఏ ఆకర్షణవల్ల వ్రజభూమిలో మాధవుడి వేణునాదం విన్నంతనే గోపికలు సర్వం త్యజించి వంశీమోహనుడి వెంట పరుగులు తీశారు ?

ఆరామకృష్ణుల ప్రేమతత్వానికి వాళ్ళు బంధితులై ఆ స్థితిని అనుభవించారా? అయితే ఆస్థితే ఈనాడు ఇక్కడ వాళ్ళందరికీ అనుభవమౌతుందా ? నాటి కారణమే నేటి కారణమా ? అవును అంటాను నేను.

ప్రేమ ఉన్న చోట అసాధ్యం అనే పదానికి తావులేదు కదన్నయ్యా!

– ఏప్రియల్, **1965**



# కస్తూరి కళ్యాణం

అన్నయ్యా,

అమ్మను గురించీ, ఆ సన్నిధిలో జరిగే కార్యకలాపాల గురించీ నేను రాసే లేఖలు యాంత్రికమయిన జీవితంలో విసిగిన ప్రాణానికి రిలీఫ్ అన్నావు. ఎడారిలో ప్రయాణం చేసేవాడికి ఒయాసిస్సు కనిపించినట్లే నన్నావు. మంటల గాలుల్లో తపించేవాడికి మలయమారుతం తగిలినట్లు అన్నావు. అబ్బో - చాలా సంతోషం అన్నయ్యా, తప్పక నీవు కోరినట్లు, అమ్మ గురించి విశేషాలు వినిపిస్తాను. ఇక్కడి విషయాలు వివరిస్తాను.

ఇక్కడ క్రితం నెల ఒకటవ తేదీన, హిందూకాలమాన ప్రకారం చైత్ర శుద్ధ ఏకాదశీ రోజు అమ్మ జన్మదినోత్సవం అతి వైభవంగా జరిగింది. ఈ నెల 5వ తేదీన పాశ్చాత్య కాలమానం ప్రకారం కల్యాణ దినోత్సవం జరుపబడుతుంది. సందర్భోచితంగా ఉంటుంది. కనుక యీ లేఖలో ఇక్కడ జరిగే వివాహాలూ, ఆ తతంగంలో అమ్మ పాల్గొనే విధానమూ గురించి చెప్తాను.

అమ్మ కరుణించిన ఏ భాగ్యశాలురనో తప్ప ఈ దివ్యసన్నిధిలో తమ కల్యాణం కావాలని కాంక్షించిన వారందరిని ఆ అదృష్టం వరించదు. ఆ పావన పాదద్వయంపట్ల ప్రగాఢ విశ్వాసం ఉండవచ్చు. శ్రద్ధాభక్తులుండవచ్చు. కాని వారు ఆశించినట్టు మాత్రం జరుగదు. ఆ భాగ్యానికి నోచుకోనప్పుడు ఎంత దూరం వెళ్ళినా, అంటే ఇక్కడ వివాహం జరగాలని అన్ని ప్రయత్నాలు చేసుకున్నా చివరి క్షణంలో విఫలమయిన సంఘటనలున్నాయి. అప్పుడు వినిపిస్తుంది. 'దేనికయినా ప్రాప్తం ఉండాలి' అన్న అమ్మ మాట.

పెళ్ళిలో మొదటి అడుగు పెళ్ళికూతురును గానీ, పెళ్ళికొడుకును గానీ చెయ్యటం అనుకుంటే - రెండవ అవకాశం అందకపోవచ్చు. కానీ, యీ మొదటి అడుగులు ఇక్కడే వేసిన అదృష్టవంతులు చాలా మంది ఉన్నారు. కాని అడుగు ఆకారం ఒకే విధమయినా, అందరి అడుగులు ఒకలా ఉండవు. చిన్నా, పెద్దా, లావూ, సన్నం, రకరకాలుగా ఉంటాయి. అట్లాగే పెళ్ళికూతుళ్ళను చెయ్యటంలో చేసే విధానం ఒకే క్రమంలో ఉన్నా, వేడుక జరగటంలో మాత్రం బేధం ఉంటుంది.

కొంతమందికి వేడుక ముగిసే వరకు అమ్మ కూడా ఉండి ఆ తతంగంలోని అర్థం వివరిస్తూ, సందేశాన్ని ఇస్తుంటే; మరికొంతమందికి మధ్యలోనే వెనక్కి తిరిగి వెళ్ళటమో, లేక కూడా ఉన్నా మౌనంగా చేయించటమో జరుగుతుంది. కొంతమందికి ఆ వేళల్లో అమ్మ చిరునవ్వు చిలిపిగా పలకరించి, మనసుల నుల్లాసపరిస్తే – కొంతమందికి అమ్మ మౌనమూ, గాంభీర్యమే శరణ్యమౌతుంది. ఏదయినా కానీ, వాళ్ళ వాళ్ళ ప్రాప్తానుసారం జరుగుతుంది. ఏ వేడుక సందర్భంలో నయినా అంతే.

ఈ సంవత్సరం ఫిబ్రవరి 5న ఒక వేడుక జరిగింది. పది సంవత్సరాల నుండి ఇక్కడకు వస్తూ వెళ్తూ ఉన్నా– ఉండాలన్న నిశ్చయంతో గడచిన సంవత్సరంలో యిక్కడకు వచ్చిన మల్లాది కస్తూరి, మా ఆటపాటల్లో పాల్గొని, ఆనందంలో పాలుపంచుకొన్నది. కానీ, సంవత్సరమయినా నిండకుండానే యీ ఫిబ్రవరిలో వివాహం కావటంతో తన జీవితభాగస్వామి వెంట వెళ్ళింది. అమ్మను విడిచి వెళ్ళలేక కన్నీరు కారుస్తూ పాపం, ఎంత ఆశించిందో ఆ అమ్మాయి తన వివాహం యిక్కడే జరగాలని. కాని అనివార్య కారణాల వల్ల పెళ్ళి పొన్నూరులో జరిగింది. పెళ్ళి కూతురుగా మాత్రం ఇక్కడనే చేయబడింది.

సామాన్యంగా యీ వేడుక అమ్మ వేకువజామున చేస్తారు. కాని అట్లా జరుగలేదు కస్తూరికి. కారణాలు ఏవైనా కానీ, అమ్మ వెలుపలికి రావటమే పదింబావుకు కావటంతో, యీ తతంగం అంతా పూర్తి అయ్యేటప్పటికి పదకొండు అయింది. అమ్మ ముఖద్వారంలోకి రాగానే ఆ గడపముందు టెంకాయ, కర్పూరం అంతకు క్రితమే సిద్ధపరచిన కస్తూరి, తన చేతిలోని పుష్పమాలలు అమ్మ మెడలో వేసి, టెంకాయకొట్టి, కర్పూరం వెలిగించి హారతి యివ్వగానే అమ్మ వరండాలోకి వచ్చి పెళ్ళికూతురికి, తోడు పెండ్లికూతురికి వేసిన పీటలకు ఎదురుగా పశ్చిమాభిముఖంగా నిలబడ్డారు. పెండ్లికూతురూ, తోడు పెండ్లికూతురూ (సాగర్ గారి హైమ) పీటల మీద కూర్చున్నారు.

అమ్మ రాకకు పూర్వమే ఆ వరండా కడిగి ముగ్గులు వేసి, పీటలు వేసి దీపారాధన చేసి అక్షతలు, టెంకాయలు, కర్పూరం, నవధాన్యాలు, రావీ వేపమండలు, పసుపు, కుంకుమ, కొబ్బరినూనె, సున్నిపిండి, పసుపు, సున్నం,

బియ్యం కలిపిన నీళ్ళూ, నీళ్ళతో ఒక బకెట్టూ, రెండు చెంబులు, అన్నీ సిద్ధం చేయబడినాయి. ఆవూ, దూడను తీసుకువచ్చి పందిరిలో స్థంభానికి కట్టివేశారు. అమ్మ యీ క్రతువు చేస్తున్నప్పుడు ప్రక్కల నిలబడి వస్తువులన్నీ అందించటానికి వీలుగా ఒకరిద్దరు అక్కయ్యలూ, అన్నయ్యలూ సిద్ధంగా ఉన్నారు. ఒక అన్నయ్య జేగంట కొట్టటం ప్రారంభిస్తే మా బృందమూ, మరి కొంతమంది అన్నయ్యలూ నామం చెయ్యటం ఆరంభించారు. జేగంట వినంగానే జనంతో పందిరి నిండిపోయింది.

కస్తూరి, హైమలు – యిద్దరూ తమ దోసిలి నిండా పూలు తీసుకొని తమ ఎదురుగా నిలబడిన అమ్మ పాదాల మీద పోసి, అక్కడే టెంకాయలు కొట్టి నమస్కరించగానే అమ్మ కలాపం మొదలు పెట్టారు.

ముందు కొన్ని టెంకాయలను వాళ్ళిద్దరకూ నలువైపులా కొట్టి, తర్వాత రావి వేపమండలు కలిపి చేతికి యిచ్చి తన మెడలో దండలు తీసి అమ్మ యిద్దరికీ వేశారు. ఆ తర్వాత కుంకుమతో కల్యాణం బొట్టుపెట్టి, పళ్ళెంలోని ఎఱ్ఱ నీళ్ళలో ఉన్న అక్షతలను కొద్దిగా ముద్దచేసి శిరస్సు మీద పాపిట మధ్యలో ఒక ముద్దపెట్టి, దానికి ముందు వెనుకలా యిరుప్రక్కలా మరో నాలుగు ముద్దలు పెట్టారు. వారిద్దరూ టెంకాయలు కొట్టగానే, కొబ్బరి నూనె తీసుకుని వాళ్ళ చేతులకూ, వీపుకు రాచి, సున్నిపిండి కూడా అట్లాగే రాచి, మళ్ళీ వాళ్ళ చుట్టూ కొన్ని టెంకాయలు కొట్టి, అక్షతలు యిద్దరి శిరస్సులపై వేసి, ప్రక్కకు నిలబడి నాన్నగారిని పిలువమన్నారు. వారు రాగానే అమ్మ నాన్నగారికి అక్షతలు పెట్టి, వారి ప్రక్కకు వచ్చి నిలబడ్డారు. కస్తూరీ, హైమా అమ్మా నాన్నగారి పాదాలపై పూలువేసి, టెంకాయలు కొట్టి, పండూ తాంబూలం చేతికియిచ్చి నమస్కరించగానే, మరోసారి అక్షతలు వేశారు నాన్నగారితో కలిసి. ఆ తర్వాత అమ్మయే స్వయంగా అందరికీ అక్షతలు పెడుతూ, అందరిచేత అక్షతలు వేయించి వాళ్ళిద్దరి చేత, పండ్లూ తాంబూలాలు యిప్పించారు. దంపతులంటే వారు జంటగా వచ్చి తీసుకోవలసిందే. ఒకవేళ ఎవరయినా ఒక్కరు వచ్చినా అమ్మ ఊరుకోలేదు. "మీ అవిడను రానీ," లేక "మీ ఆయన్ను రానీ – అంత తొందరేం? "అంటూ చిరునవ్వుతో ప్రశ్నిస్తూ, వాళ్ళను వాళ్ళ ప్రక్క నిలబడే వాళ్ళు వచ్చేవరకు ఆపి, ఆ వెనుక యిప్పించేది.

పెద్దవాళ్ళచేతనే కాదు. చివరకు సంవత్సరం నిండిన రహిచేతను అక్షతలు వేయించి, వాళ్ళిద్దరి చేత నమస్కారం చేయించారు. ఇక నుండి ప్రతివాళ్ళకు అట్లా తలవంచి వినయంగా ఉండాలని అమ్మ ఉద్దేశం.

కస్తూరి తిరిగి టెంకాయ కొట్టి హారతి యిచ్చి లేచి నిలబడ్డది. వాళ్ళిద్దరికీ నీళ్ళతో నిండిన రెండు చెంబులను యిచ్చి ఎడమ వైపు నడుమున పెట్టుకోమని, తనే పెట్టి – రావి వేప మండలను జాగ్రత్తగా పట్టుకోమని తనూ వెండి బిందెను ఎడమవైపు నడుమున పెట్టుకొని, ఆవుదగ్గరకు దారితీశారు. అమ్మ తన బిందెలోని నీరు ఒక ధారగా క్రిందపోస్తూ, ముందుకు వెళ్తుంటే బాలికల బృందం శ్రీ సూక్తపఠనం ఆరంభించారు. రావి వేప మండలను క్రిందకు వంచి దానిమీదుగా నీరుధారగా పోస్తూ, అమ్మ అడుగు జాడలలోనే కస్తూరీ, హైమా నడవసాగారు. అమ్మ అట్లా మూడుసారులు ప్రదక్షిణ చేయించి ఆవు, దూడల ముందు ఆగారు. వారూ ఆగారు. అమ్మ ఆ రెండింటి మధ్యగా వెళ్ళి ఆవుతల విసరకుండా, దూడ అటూయిటూ తిరగకుండా వాటి మేనులను ప్రేమగా తడుతూ, ముఖాలను ఆప్యాయంగా నిమురుతూ తోకవైపూ, ముఖమూ నీటితో కడిగి పసుపురాచి, కుంకుమతో బొట్లు పెట్టి, వాళ్ళచేత కూడా చేయించారు. నవధాన్యాలను ఆవుముందు పెట్టించారు. రావి వేప మండలను అందులో వెయ్యమన్నారు. ఆవూ, దూడా ఆతృతగా వాటిని తింటుండగా, అమ్మ కదులుతున్న వాటిని అట్లాగే బుజ్జగిస్తూ ఆవు కొమ్ములకు పూలదండ చుట్టారు. ఆవుదూడల నడుముల మీద నీరు చిలికించి పసుపూ, కుంకుమలు చల్లించారు. కస్తూరి ఆవు చుట్టూ టెంకాయలు కొట్టి హారతి వెలిగించేటప్పటికి శ్రీ సూక్తపఠనం పూర్తి అయి నీరాజనం పాట అందుకున్నారు. అమ్మ లోపలకు వెళ్లారు.

ఆ రోజు ఆవు పేడ వెయ్య లేదు కాని, లేకపోతే వెయ్యగానే అమ్మ దగ్గరుండి ఆ పేడ పెండ్లికూతురిచేత ఎత్తించి కాని లోపలకు వెళ్లరు.

ఈ కలాపమంతా జరిగిన గంటా అమ్మ ఎంత సరదాగా ఉన్నారని! చిరునవ్వులతోపాటు ఛలోక్తులు విసురుతూ, తను నవ్వుతూ మమ్మల్ని నవ్వించారు. తలమీద నుండి ముఖం మీదకు కారుతున్న నీటిని తుడుచు కోవటానికీ, కనీసం కన్నెత్తి ప్రక్కకు చూసేటందుకూ కూడా కస్తూరికి అవకాశం లేకుండా. అమ్మ ఒక

దాని వెనుక ఒకటి త్వరత్వరగా కార్యక్రమమంతా నిర్వహిస్తుంటే – ఆ దృశ్యం ఎంత ఆనందంగా ఉందని ! ఈ మాట అంటే అమ్మ నవ్వి ఇక నుండి ఆ అమ్మాయిని చుట్టివేసే బాధ్యతలు అట్లాగే ఉంటాయి అన్నారు.

మంగళ చిహ్నమయిన తోరణాలతో అలంకరింపబడిన పచ్చని పందిరి క్రింద కంటికినిండుగా కనిపిస్తున్న నరనారీజనసమూహం మధ్య ఆ జగజ్జనని పావనకరంచేతనే పెండ్లి కూతురయిన కస్తూరి వదనంలో కల్యాణశోభ వెల్లివిరిసింది.

అమ్మ లోపలకు వెళ్లగానే జేగంట మ్రోత వినిపించలేదు. కర్పూరం వెలుగు కనిపించలేదు. కెమెరా సర్దుకున్నది.

ఇందులో అమ్మ చేసే ప్రతి పనీ అర్థపూరితమయినదే. ఆనాడు కస్తూరికి చెప్పకపోవచ్చును కానీ, ఆ అర్థాలను ఒక్కొక్కసారి పెండ్లికూతురికీ, ప్రేక్షకులకూ కూడా చెప్తుతుంది.

అమ్మ అప్పుడప్పుడు అట్లా చెప్పిన వ్యాఖ్యానాలను తెలియజేయటం అసందర్భం కాదనుకుంటాను.

**ఎట్టినీళ్ళు అంటే** – పసుపు, సున్నం వేరు వేరు రూపాలు. నీళ్ళు పొయ్యగానే కలిగిన రూపాంతరం ఎట్టినీళ్ళు. పసుపు వధువు, సున్నం వరుడు. ఇవే శ్వేతధాతువులు; శుక్రశోణితాలు. సున్నం రూపం, పసుపురూపం, పోయి మరో క్రొత్తరూపం ఏర్పడింది. అట్లానే యికనుండి రెండు మనసులూ ఒకటి కావాలి.

**నడుమున బిందె పెడుతూ** : బరువులు యిట్లా మొయ్యాలి యికనుండి ఎట్లాంటి బరువో తెలుసా ? ఇటు పమిట జారిపోకుండా, అటు బిందె జారి పోకుండా నీళ్ళు తొణకకుండా జాగ్రత్తగా అడుగువెయ్యాలి. ఇంత బరువును మోస్తూ, జీవితమంతా జాగ్రత్తగా నడవాలి.

**తోడు పెళ్ళికూతురును** కూర్చోపెట్టటంలో ఉద్దేశం భర్తను ఆ క్షణం నుండి ప్రక్కన చేర్చినట్లేనని. ఆ కలాపంలో ఇద్దరూ తోడుగా అట్లా కలసి చెయ్యటంలో, ఇక నుండి దంపతులు అట్లా ప్రతి పనీ తోడుగా కలిసి చెయ్యాలని.

**రావివేప మండలు** కలిపి చేతికి యివ్వటంలో అవి లక్ష్మీనారాయణులనీ,

దాంపత్యం అట్లా ఉండాలనీ, తీపి, చేదూ గల ఆ రెంటిలా భిన్నత్వాలు గలవారు, యిక అట్లా ఏకంగా ఉండాలనీ.

**ఎఱ్ఱనీళ్ళు చుట్టూ పోయటంలో** ఉద్దేశం ఆవరణ ఏర్పరచటమే. ఇక నుండి ఒక హద్దులోనే ఆ యిద్దరూ ఉండిపోవాలని.

ఇక అమ్మ చేసే పెండ్లి గురించి కూడా క్లుప్తంగా చెప్తాను. అవి కొన్ని ముఖ్య ఘట్టాల గురించి మాత్రమే.

అమ్మ పెండ్లి చేయటం అంటే, "అంతా నీ చేతి మీదుగా జరగాలమ్మా, పౌరోహితుడు, పెండ్లి పెద్ద, అన్నీ నువ్వే, నువ్వు పెట్టిందే లగ్నం. నువ్వు చెప్పినట్లు చెయ్యటమే మా పని" అని పెండ్లి యొక్క సర్వబాధ్యతలూ తన మీదే వదిలిపెట్టినప్పుడు ఆ పెండ్లి జరిగే తీరే వేరుగా ఉంటుంది.

అలా కాక ఈ సన్నిధిలో జరగాలని వాళ్ళ ప్రయత్నాలు వాళ్ళు చేసుకున్నప్పుడు, పౌరోహితులు చేయిస్తున్న విధానాన్ని కుర్చీలో కూర్చొని, సాక్షిమాత్రంగా చిరునవ్వుతో వీక్షిస్తూ ఉంటారు. ఆ తంతు ముగిసాక అక్షతలు వేసి ప్రసాదమిచ్చి లోపలకు వస్తారు.

అంతేకాక ఎవరి వివాహమయినా జరగనీ. వాళ్ల వాళ్ల ఆచార సాంప్రదాయాలను బట్టే జరిపిస్తూ ఉంటారు.

వీటన్నింటికీ ఉదాహరణగా జరిగిన పెండ్లిళ్ళు అనేకం ఉన్నాయి. కానీ, అవన్నీ యిక్కడ వివరించటానికి అవకాశం లేదు. అందుకని ఒక పెండ్లి గురించి చెప్తాను. అది యీ మధ్య అంటే ఏప్రిల్ 14న జరిగింది. ఈ వివాహం ఉభయపక్షాలకూ యిష్టమై, సర్వబాధ్యతలూ అమ్మకే వదిలేసి చేసుకున్నారు. వరుడు గుండారం నుండి యిక్కడకు తరచుగా వస్తూ ఉండే సుబ్బారావు అన్నయ్య. అదేరోజు యిక్కడ ఎంతో వైభవంగా జరపాలనుకున్న వారి పెండ్లి కారణాంతరాల వల్ల జరుగకపోవటం – ఏదో అమ్మ సమక్షంలో, అమ్మాయి మెడలో తాళిగట్టి అమ్మ చేత అక్షతలు వేయించుకుందామని వచ్చిన ఈ అన్నయ్య పెండ్లి ఊహించనంత అందంగా, ఆనందంగా జరగటం చూస్తే "అనుకున్నది జరుగదు; తనకున్నది తప్పదు" అన్న అమ్మ సూక్తి ఎంతనిజం అనిపించింది.

ఈ పెండ్లికి మంత్రాలు: అంబికాస్తవం, మేళాలు : నామ సంకీర్తనమూ, జేగంటా. వేదిక నిరాడంబరంగానూ, అందంగానూ ఏర్పాటు చేయబడ్డది. వేదికపై సింహాసనం. ప్రక్కల పూజా ద్రవ్యాలు, వేదికముందు పెండ్లికి కావలసిన యేర్పాట్లు.

అమ్మ వచ్చి సింహాసనం అలంకరించారు. అమ్మ తెల్లపట్టు చీర కట్టుకున్నారు. మోచేతి నుండి భుజాల వరకూ జరీ అంచు వున్న నల్ల రవికె వేసుకున్నారు. చీరమీద జరీపువ్వులూ, రవికె జరీఅంచూ, బంగారు గాజులూ, గళసీమను నిండుగా ఆక్రమించిన గజ్జలపట్టెడ, పెట్రొమాక్సు లైట్ల వెలుగులో కాంతులీనుతూ, తెలుపూ, పసిమీ మిళితమైన అమ్మ మేనిఛాయలో కలిసి క్రొత్త అందాలను కల్పించుకుంటున్నాయి.

సిగలో ముడవబడిన వికసించిన జాజులు విరగబడి నవ్వుతున్నాయి, తమ అదృష్టానికి మురిసిపోతూ.

పెండ్లి కలాపానికి ముందు వధూవరులు కలిసి అమ్మకు పూజ చేసుకున్నారు. ఇద్దరూ కలిసి అమ్మ పాదాలు కడిగారు; పారాణి పెట్టారు. పూలతోనూ, కుంకుమతోనూ పూజచేశారు. ఇద్దరూ కలిసి నివేదన చేసి, ఒకేసారి అమ్మ పాదాలకు నమస్కరించారు. అమ్మ పూజా పుష్పాలు ఉభయుల శిరస్సులపై చల్లి ఆశీర్వదించారు. వారిద్దరకూ కల్యాణపు బొట్లు పెట్టి, ప్రసాదమిచ్చి నూతనవస్త్రాలు యిచ్చారు అమ్మ.

చూడు, అన్నయ్యా – పెండ్లికాకముందు వధూవరులు ఒకరిని ఒకరు చూడడమే పనికిరాదు కదా. అమ్మ వారిద్దరి చేత పెండ్లి ముందుగానే సమిష్టి పూజ చేయించారు. అంటే యిప్పుడేమిటి, వారి పుట్టుకతోనే వారి కలయిక నిర్ణయమయినది కదా అని అమ్మ ఉద్దేశమేమో.

వధూవరులు కొత్తబట్టలు కట్టుకు వచ్చారు. అప్పుడు వారికి అమ్మ సమక్షంలోనే బుగ్గలు చుక్కలూ, ముఖాల భాషికాలూ, పాదాలకు పారాణి – అవసరమయిన లక్షణాలన్నీ ఏర్పరచారు.

మొదట వధువు వరుని పాదాలు కడిగించి తర్వాత వరుని చేత కూడా వధువు పాదాలు కడిగించారు అమ్మ.

భార్యకు భర్త దేవుడయినట్లే, భర్తకు భార్య దేవత అని అమ్మ సందేశం. భార్యభర్తలలో ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ కాదని బోధించటం కోసం అమ్మ అలా చేయించారు.

తర్వాత కలాపమంతా వరుసగా అమ్మ దగ్గర కూర్చుని అంటే సింహాసనం దిగి వధూవరులకు దగ్గరగా వేదికమీద వెండిపీటపై కూర్చుని స్వయంగా సరదాగా, ఛలోక్తులతో, చిరునవ్వులతో పూర్తి చేయించారు.

మంగళసూత్రధారణ జరిపేటప్పుడు అమ్మయే మంగళసూత్రాలు పట్టుకుని వాటిని అందరకూ చూపి, వాటి అర్థమూ, ప్రాముఖ్యతా వివరించి మొదటి ముడి తనే వేసి, తర్వాత రెండు ముళ్ళూ వరునిచేత వేయించారు.

పెండ్లి జరుగుతుండగా కారులూ, లారీలు వచ్చినాయి. జనంతో పందిరి క్రిక్కిరిసి పోయింది. బాలికల బృందం సమయానుకూలంగా పాటలు పాడారు.

మొత్తమ్మీద వివాహం బలే సరదాగా, సంతోషంగా జరిగింది అన్నయ్య. నేను ఎంత చెప్పినా జరిగినంత చెప్పలేనుగా. అమ్మ ఈ కార్యక్రమాలు స్వయంగా జరిపేటప్పుడు చూసి తీరాలి. ఈసారి యిక్కడ పెండ్లి జరిగేటప్పుడు, నీకు తెలియజేస్తాను రా అన్నయ్యా.

**– మే, 1966**



# అందరికీ అమ్మయితే దేవత కాదా !

అన్నయ్యా,

నిజమేనయ్యా, సందేహాలు నివృత్తి చేసుకోవలసిందే. సందేహం కలుగకూడదు. కలిగిన తర్వాత లోపల దాచుకుంటే, అగ్నిలా కాల్చి వేస్తుంది కనుక వెంటనే చల్లార్చడం శ్రేయస్కరం.

**ఇంతకూ నువ్వడిగేది :** మీరందరూ అమ్మను యింతగా ఆరాధిస్తున్నారు. సింహాసనం మీద కూర్చో బెడుతున్నారు. కిరీటం పెడుతున్నారు. పూజలు చేస్తున్నారు. అందులోనూ కుంకుమరాసులతో పాదపూజ చేస్తున్నారు. పాలతో పాదాలకు అభిషేకం చేస్తున్నారు. ఆమె పాదాలు శిరస్సున ధరిస్తున్నారు. ఆమె మాటను వేదవాక్కుగా పాటిస్తున్నారు. ఆమెను ప్రాణం కన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నారు. మీరు, యింత మహోన్నతంగా భావించడంలో మీ ఉద్దేశమేమిటి? ఎంత 'గొప్పవ్యక్తి' అనుకున్నా మీరిలా ఆరాధించలేరు. భగవంతుడని మీ అభిప్రాయం. అసలు భగవంతుడంటే ఏమిటి ? ఈ అమ్మ ఆ భగవంతుడంటే ఎట్లా ? నేను యిట్లా అడుగుతున్నానని నువ్వు బాధపడుతున్నావా ? పైగా నేనొక నాస్తికురాలినని అనుకుంటావేమో....

అన్నయ్యా, నా ఉద్దేశం ప్రకారం యీ ప్రపంచంలో ఎవరూ నాస్తికులు కారు. ప్రతిజీవికీ తన జీవితంలో ఏదో ఒక సమయంలో భగవంతుని ఉనికి అనుభూతమయి తీరుతుంది. ఏదో ఒక అనంతమూ అదృశ్యమూ అయిన శక్తి తననూ, యీ జగత్తునూ నడిపిస్తున్నదని అర్థమవుతుంది. అయితే దానికి పేరు ఏదయినా పెట్టుకోవచ్చు. 'శక్తి' అనుకోవచ్చు. దైవం అనుకోవచ్చు. మరొకటి అనుకోవచ్చు, ఏమనుకున్నా ఒకటే. వాదనకూ తర్కానికి పైకి ఎట్లా అన్నా - అంతరంగికంగా అందరూ ఆస్తికులే.

ఆమాటకువస్తే - పై కులమనుకునే వీరందరూ ఆస్తికులంటావా ? నేను అనలేను. ఆస్తికత్వం అంటే దేవుడున్నాడని నోటితో అనడమేనా ? సర్వజ్ఞుడూ, సర్వవ్యాపకుడూ, సర్వశక్తిమంతుడూ అయిన భగవంతుని త్రికరణశుద్ధిగా విశ్వసిస్తే - యీ ప్రపంచం యిట్లా ఎందుకుంటుంది ? ఈ ద్వేషాలకూ, స్పర్థలకూ, యుద్ధాలకూ, బీభత్సాలకూ తావెక్కడ ఉంటుంది ? మనం ఎట్లా అసత్యమాడగలం? ఎవరిని మోసం చేయగలం ? ఎట్లా అధర్మంగా ప్రవర్తించగలం ? భగవంతుడు ఏమీ తెలీనవాడనా? భగవంతుడెక్కడో ఒక మూల కూర్చుని మనను చూడలేడనా?

మనను ఏమీ చేయలేని బలహీనుడనా ? మరేమిటి ? అంటే పరిపూర్ణమయిన విశ్వాసం వేరు. ఎప్పుడో అవసరమయినప్పుడూ ఆపదలో ఉన్నప్పుడూ అడ్డుపడమని అరవడమూ, ఆదుకొనమని అర్థించడమూ వేరు.

ఇంతకూ అసలు విషయానికి వద్దాం – అమ్మ దైవమని ఎట్లా అనికదా నీ సందేహం. అసలు దైవమంటే ఏమిటి? దైవలక్షణాలు ఏమిటి ? భగవంతుని అవతారాలుగా మనం చెప్పుకుంటున్న వ్యక్తుల లక్షణాలు ఎట్లా ఉంటాయి ? అవి అమ్మలో ఎంతవరకు మనం గుర్తిస్తున్నాం ? వీటికి సమాధానాలు రాబట్టుకుంటే నీ సందేహం సమసిపోతుంది.

అమ్మను కొందరు రాజరాజేశ్వరీ అవతారంగా విశ్వసిస్తున్నారు. కొందరు గాయత్రిగా ఉపాసిస్తున్నారు. కొందరు పార్వతిగా పూజిస్తున్నారు. కొందరు లలితగా భావిస్తున్నారు. కొందరు రాముడుగా, కృష్ణుడుగా, శివుడుగా, ఆంజనేయస్వామిగా, కుమారస్వామిగా, శాయిగా, మహమ్మదుగా, క్రీస్తుగా – అనేక రూపాల ఆరాధిస్తున్నారు. కవులూ, పండితులూ, భక్తులూ, జ్ఞానులూ, సాధకులూ, విజ్ఞానపరిశోధకులూ –అందరూ అమ్మలోని దివ్యత్వాన్ని గుర్తించి అర్చిస్తున్నారు.

వారి భావనలకూ, ఆరాధనలకూ వారి వారి అనుభవాలకూ విశ్వాసాలే కారణం అనుకో, అన్నయ్యా ! వారి అనుభవాలు మనవికావు. వారి విశ్వాసాలు మనవి కానక్కరలేదు. అవి మనసుకూ హృదయానికీ సంబంధించినవి. కనుక ఎవరి విశ్వాసాలూ, అనుభవాలూ వారివే కావచ్చు. కానీ, యింతమందికి యన్ని అలౌకిక అనుభూతులూ యిన్నిరకాల రూపదర్శనలూ ఒక సామాన్యవనిత అయితే ఎట్లా కలిగిస్తున్నది ? ఈ జనసహస్రాలు ఒక మానవాంగన పాదాల మ్రోల ఎందుకిట్లా సాష్టాంగ పడుతున్నాయి ? వారందరూ పిచ్చివారంటారా ?

శాస్త్రముల ననుసరించీ, పురాణేతిహాసముల ననుసరించీ ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, పంచభూతాలూ అతని ఆజ్ఞను శిరసావహిస్తాయి. అతడు కాలాతీతుడు.

ఇక, అవతార వ్యక్తులు, వారి యిచ్ఛానుసారం జన్మిస్తారు. వారు సామాన్యుల వలె కష్టసుఖాలు అనుభవించవచ్చును కానీ, కర్మబద్ధులు కారు, ఒక నిర్ణీత పథకం ప్రకారం బృహత్తర కార్యాలు నిర్వహిస్తారు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తారు. ద్వంద్వాతీతులై స్థితప్రజ్ఞులై ఉంటారు. మానసిక దారుఢ్యతా, శరీర సౌష్టవతా కలిగి ఉంటారు. ఆత్మజ్ఞానులై ఉంటారు.

వీనిలో కొన్ని లక్షణాలూ, గుణాలూ సిద్ధపురుషులకు కూడా ఉంటాయి. మరి, వారికీ, అవతారములకూ తేడా ఏమిటి అంటే– వారికి సాధనవల్లా, కృషివల్లా లభించిన శక్తులు అవతారములకు జన్మతః కలుగుతాయి. పైగా అవతారవ్యక్తులు అన్ని వేళలా ప్రశాంతంగా ఉంటారు. కారణం కార్య కారణములు వారికి అవగతమే కనుక వారు ప్రేమమయులై సర్వులనూ సమానంగా ఆదరిస్తారు. కారణం – వారికి భిన్నత్వం తోచదు కనుక.

అవతారమూర్తులలో యింకా అనేక ప్రత్యేకలక్షణాలూ, విశిష్ట గుణాలూ ఉండవచ్చు. నీకు తెలుసుకుగా నా శాస్త్ర పరిచయం ఎంతటిదో కాకపోతే, నీ వన్నట్లు 5, 6 సంవత్సరాల నుండి యిక్కడనే ఉంటున్నాను కనుక అదీ అమ్మ సన్నిధిలో ఉండే మహద్భాగ్యం కరుణా మూర్తి అయిన అమ్మ యీ అల్పురాలికి లభింపజేసింది కనుక అమ్మ లోని అనేకమయిన విశిష్ట లక్షణాలు గమనించే అవకాశం ప్రాప్తించింది.

వాటిని బట్టి సోదాహరణంగా అమ్మకూ అవతారాలకూ గల సారూప్యతను వివరిస్తాను. తర్వాత నిర్ణయం నీ యిష్టం.

నేనేమిటి మా అమ్మా – యిట్లా అంటున్నానని కోపగించుకోకు. నీకూ అమ్మ కాకపోలేదు, నా అభిప్రాయంలోనూ, అమ్మ దృష్టిలోనూ, కానీ నీకూ ఆ భావం రావాలి కదా. నీకు ఆ భావం వస్తే నువ్వు అమ్మ దివ్యత్వం అంగీకరించినట్లే. మరి నాకూ నీకూ అమ్మ అయితే అందరకూ అయినట్లే. అందరకూ అమ్మ కాగలిగిన అమ్మ దైవం కాక సామాన్య స్త్రీ ఎట్లా అవుతుంది? ఇంతకూ నేననేదేమిటంటే మా అమ్మ దైవమన్న మా విశ్వాసాన్ని మీ మీద బలవంతంగా రుద్దటానికి నేనేమీ ప్రయత్నించను. అది నా ఉద్దేశం కూడా కాదు.

అదీగాక యిటువంటి ప్రయత్నానికి అమ్మ అంగీకరించదు. లోగడ అనేకసార్లు యిటువంటి చర్చలు వచ్చి, అమ్మ ఏ అవతారం అని తర్జన భర్జనలై అమ్మను అడిగితే –

“ఎవరినయితే మీకేమీ ? అమ్మను అయితే చాలదా?” అని తేల్చి వేసి నవ్వేసింది. నేను కన్నంతలో, విన్నంతలో నా శక్తి కొద్దీ ప్రయత్నించి నీ ప్రశ్నకూ సందేహానికీ సమాధానం యిస్తాను.

నీవు మాత్రం సందేహించక నీ సందేహాలు తెలుపుతూ ఉండు.

**– జూన్, 1966**

# ప్రపంచానికే స్వాతంత్ర్యం వచ్చిన రోజు

అన్నయ్యా,

ఇక్కడ భారీ ఎత్తున జరుపబడే ఉత్సవాలలో ఆగష్టు, 15 ఒకటి. భారతదేశ చరిత్రలో దానికున్న విశిష్టతా, ఆనాడు దేశమంతటా జరుపబడే ఆ పర్వదినోత్సవ ప్రాముఖ్యమూ నీకు తెలుసు. కాని ఆనాడు అర్కపురిలో ఉత్సవానికి గల హేతువు మాత్రం మరొకటి ఉన్నది. అందుకే జూన్ లేఖలో నేను కోరినట్లు నీ సందేహం తెల్పినా దాని సమాధానం మరో లేఖలోకి వాయిదావేసి ఈ కారణాన్ని వ్రాస్తున్నాను. అదే యీ లేఖ.

ఇతర ప్రాంతాల నుండి అమ్మను గుర్తించి దర్శనార్థమై జనం రాకపోకలు ఆరంభించి, సుమారు దశాబ్దిపైన కాలం గడచింది. నీకు వివరిస్తానన్న కారణానికి కారణమైన అన్నయ్యల బృందం చీరాల నుండి 57 నవంబరు నెలలో వచ్చారు. ప్రారంభంలో వాళ్ళు అమ్మను దర్శించిన కొన్ని గంటల కాలంలోనే తిరుగు ప్రయాణమయ్యేవారు కాని తర్వాత కొద్ది రోజులలోనే వారానికి ఒకసారి రావటం. వచ్చినప్పుడల్లా ఎవరి వీలును బట్టి వాళ్ళు నాలుగైదు పూటలు ఉండటం మొదలైంది.

బహుశ నీకు జ్ఞాపకం ఉందనుకుంటాను. నీవు ఇక్కడికి వచ్చినపుడు అమ్మ మృదువుగా అడిగిన ఆ మొదటి మాట. "నాన్నా ! భోజనం చేశావా?" అని. ఈ మాట నీ ఒక్కడికే కాదు అమ్మను దర్శించటానికి వచ్చిన ప్రతివ్యక్తి యొక్క కర్ణపుటాల్ని సోకుతుంది. ఈ పలకరింపు ఈనాడూ - ఆనాడూ ఎప్పుడు ఉన్నది. ఇప్పుడు అమ్మ ఆ మాట అనగానే "అన్నపూర్ణాలయానికి" వెళ్ళి భోజనం చేస్తే అప్పుడు నాన్నగారింట్లో భోజనం చేసేవాళ్ళు.

కాని ఈ విధంగా నాన్నగారింట్లో భోజనం చెయ్యటం చీరాల వాళ్ళకు సమంజసం అనిపించలేదు. నాన్నగారు సామాన్య కుటుంబీకులు. కుటుంబ పోషణకు అయ్యే వ్యయమే కాక ఈ పై వచ్చే జనము యొక్క వ్యయం కూడా వారే భరిస్తున్నారు. ఈ భరించటం వారికి బరువూ - బాధా అనిపించకపోయినా వీళ్ళకు ఇక్కడ ఎంత చనువు ఉన్నా తమ బరువు వారు భరించటం బాధే అనిపించింది.

ఇవన్నీ ఆలోచించి త్వరలోనే వాళ్ళు ఒక అభిప్రాయానికి వచ్చారు. ఇప్పుడు వచ్చిన ఈ నలుగురూ నాలుగు చేతలూ కలిపి వేరొక పొయ్యిని వెలిగిస్తే అది వీళ్ళకే కాక భవిష్యత్తులో వచ్చే సోదరులకు కూడా ఎప్పుడు ఏ వేళలో, ఎవరు రావాలన్నా, ఎన్నాళ్ళున్నా, ఎవరికీ ఇబ్బంది కలుగజేయని అవకాశం ఉంటుంది. ఇటు నాన్నగారికి బరువు తగ్గించినట్లు ఉంటుంది అని.

వాళ్ళు ఈ అభిప్రాయాన్ని అమ్మకు తెలియజేయగా అమ్మ నాన్నగారితో సంప్రదించమన్నారు. అందులో నాన్నగారితో సన్నిహితులయిన సోదరుడొకరు ఈ విషయం నాన్నగారికి వివరించి ఈ "వేరు" ఏర్పాటును గూర్చి అన్యథా భావించవద్దని కోరుతూ ఎక్కడతిన్నా వారు పెట్టిన అన్నమేనని చెప్పారు. అది 58 సంవత్సరం ఆగష్టు 9వ తేదీ ఉదయం. కాని వారు ఎన్ని చెప్పినా ఈ మార్పు తమకంత తృప్తికరంగా లేదని నాన్నగారు అన్నారు. అప్పుడు ఇదంతా వింటున్న అమ్మ ఈ "వేరు" ఏర్పాటులోని ఉద్దేశాన్ని నాన్నగారికి వివరించారు.

"పెరిగిన బిడ్డ తండ్రికి సహాయంగాను, పెరగబోయే బిడ్డకు ఆధారంగానూ ఉంటాడు. తండ్రికి ఐదేళ్ళ బిడ్డను పోషించటంలోనూ, పెళ్ళాం బిడ్డలు గల వాణ్ణి పోషించడంలోనూ భేదం ఉన్నది. నేను భరించలేను. నాయనా నీ దారి నీవు చూచుకో అని తండ్రి అనకుండా తన బాధ్యత తాను గుర్తించి బిడ్డ "నాన్నా నా అన్నం నేను తింటాను" అని అనటం ఎటువంటిదో ఈనాడు ఈ ఏర్పాటు అటువంటిది. ఇది ఎప్పుడో ఒకప్పుడు తప్పదు. తండ్రీ, కొడుకులు వేరుపడటం ఉన్నది కాని ఎప్పుడూ తండ్రీ కొడుకులు వేరు కారు. దూరాన ఉన్న కొడుకు వేరే ఉంటే అది వేరైనటా? ఈ వేరు వేరు కాదు. రాబోయే వాడికి ముందు వచ్చినవాడు, రెక్కలు రాని వాడికి రెక్కలు వచ్చినవాడు దారి చూపించటం అవుతుంది. జరగటం అంటారా - అది మనం జరిపేది కాదు. జరిగేదే కాని" అమ్మ వివరణతో నాన్నగారు తృప్తిపడినా వారికి మరో సందేహం కలిగింది. ఈ ఏర్పాటు బాగుంది. దీని సంపూర్ణ బాధ్యత వహించి నిర్వహించే వాళ్ళు ఎవరని, వెంటనే అమ్మ అన్నారు నిర్లిప్తంగా - జగన్నాథ రథం కదిలితే ఆగదని.

నాన్నగారు తమ ఆమోదం తెలిపిన వెంటనే అన్నయ్యలందరూ ఈ "వేరు" ఏర్పాట్లు హడావుడిలో మునిగిపోయారు.

ఒక అన్నయ్యకుసందేహం కలిగింది. ఆనాటి వంటమనిషిని పెట్టి వంట ప్రారంభించవచ్చు కాని ఆ తర్వాత దీనికంటూ నిలబడి సమర్థించే వాళ్ళు ఎవరని ? అమ్మ విని - అవును ఎవరు ? అన్న ప్రశ్న తిరిగి వాళ్ళను వెయ్యలేదు. నిర్లిప్తతతో "పదార్థాలు చేరినప్పుడు పక్వం చేసేవాళ్ళు వాళ్ళే ఏర్పడుతారు" అన్నారు.

ఇంకొక అన్నయ్య "రేపటికి కావాల్సిన వెచ్చాలు ఏమిటి ? ఎంతెంత తీసుకురావాలమ్మా" అని ప్రశ్నిస్తే సమాధానంగా అమ్మ "ఇందులో నేను చెప్పేదేముంది నాయనా ? ఈ రోజు మీకు ఇక్కడ స్వాతంత్ర్యం కలిగిన రోజు. అందరికి అనుకూలంగా ఉండేలా మీరే స్వయంగా ఆలోచించుకొని మీకేం కావాలో అది చేసుకొని తినండి. మీ దృష్టిలో ఆగష్టు 15 భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజు. కాని ఈ రోజు ప్రపంచానికి స్వాతంత్ర్యము వచ్చినరోజు" అన్నారు. నిజానికి మహాత్ముల మాటలు, చేతలు మనకెంతవరకు అర్థమౌతాయి. మరి అమ్మ 58 ఆగష్టు 15వ తేదీ ప్రపంచానికి స్వాతంత్ర్యం సిద్ధించిన రోజు అని అనటంలో లోతుగా ఆలోచిస్తే ఇదై యుండవచ్చునని అనుకుంటాను.

47లో మనదేశానికి లభించిన స్వాతంత్ర్యానికి 58లో అర్కపురిలో అమ్మ చెప్పిన స్వాతంత్ర్యానికి భేదం చాలా ఉన్నది. అది భారతదేశానికి పరిమితం కాగా ఇది విశ్వవ్యాప్తమైనది. ఇక్కడ కుల, గుణ, మత, వర్గ, శాంతి భేదాలతో, పుణ్యపాపాలతో నిమిత్తం లేకుండా సర్వజీవకోటికి అమ్మ సాన్నిధ్యంలో స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు లభించుతాయి.

అమ్మ తనకిచ్చిన ప్రాముఖ్యానికి 15వ తేది మురిపెంగా నవ్వుకున్నది. చిహ్నంగా కుంభవర్షం కురిసింది ఆనాడు. అమ్మ ఇచ్చిన సందేశం అన్నయ్యలలోని ఉత్సాహాన్ని తగ్గనివ్వలేదు. ఉత్తేజం ఉప్పొంగింది. ఫలితంగా "అన్నపూర్ణాలయంలో" అగ్నిహోత్రుడు ప్రవేశించాడు. ఆ క్షణం ఎటువంటి క్షణమో అతని తోడ్పాటుతో ఆ ఆలయంలో ఆనాడు వండబడిన వంటకాలు ఏభైమందికి పరిమితి అయితే ఈనాడు అసంఖ్యాకంగా భోజనం చేస్తున్నారు. ఆనాడు వందలతో ఆరంభమైన ధనవ్యయం ఈనాడు లక్షలలో ఉన్నది. ఆనాడు కుటీరంలోభుజించినా ఈనాడు భవనాలలో భుజిస్తున్నా ఎప్పుడూ ఈ మహాప్రసాదం తింటున్నామనే ఆనందం అనుభవిస్తున్నారు. జనాభా పెరుగుతున్న కొద్దీ ఇందుకోసంగా భవనాలు నిర్మాణంలో వున్నాయి. అయితే ఆనాటి నుండి ఈనాటివరకు ఆ అన్నయ్యలే ఇదంతా నిర్వహించి

ఈ ప్రగతి సాధించారా అన్న సందేహం నీకు కలుగుతుందేమో. ఒక్కసారి అమ్మ అన్న మాట మననం చేసుకో. 'రాబోయే వాడికి ముందు వచ్చినవాడు దారి చూపిస్తాడు' అని. అంతే అదే జరిగింది. ఎవరికి ఎంతవరకు ఎన్నాళ్లు ప్రాప్తం ఉన్నదో అంతవరకు సేవచేసుకో గల్గుతున్నారు. ఇది ఏ ఒక్కరిచే నిర్వహింప బడలేదు. అది విభాగమైన వాళ్ళు, పదార్థాలు చేర్చేవాళ్ళు - మొదలైన ఏ విభాగాలైనా అంతా నిమిత్తమాత్రులై సమిష్టి కృషి చేస్తున్నారు.

ఈ భోజన సౌకర్యాన్ని గూర్చి మొదట్లో ఒక అన్నయ్య అమ్మను అడిగారు "ఈవిధానం బాగుంది కాని ఇట్లా ఎన్నాళ్ళు ఎంతమందికి పెడ్తారు?" అని. సమాధానం... "మనం పెట్టటం కాదు. ఇక్కడ ఎవడి అన్నం వాడు తిని వెళ్తాడు" అని

ఆ సమాధానం నేడు కూడా వినబడ్తుంది. ఎప్పుడంటే పలువురు పలురకాలుగా దీన్ని గురించి ప్రస్తావించినప్పుడూ, ప్రశంసించినప్పుడు. ఆ సమాధానం అనుభవంలో కూడా ఋజువౌతున్నది.

సంక్షిప్తంగా చెప్పుకుంటే ఇది నేను చెప్తానన్న ఇక్కడ ఆగష్టు 15 యొక్క ప్రత్యేకత. సరే. ఆనాటి నుండి ఏటేట ఆగష్టు పదిహేనవ తేదీన ఉత్సవం జరుపబడుతున్నది. ప్రతి ఆగష్టు పదిహేనున సాధారణంగా అమ్మకు అర్చనలవీ జరిగినా ఒక్కొక్కసారి ఒక్కొక్క ప్రత్యేకతను రూపొందించు కుంటుంది.

ఉదాహరణకు 59లో బంగారు పట్టాలు అమ్మ పాదాలకు అలంకరింపబడ్తే 61లో శంఖ, చక్ర, కమల, త్రిశూలాలు అమ్మ హస్తాల్ని అలంకరించి శోభించాయి.

మరి రేపు రాబోయే పదిహేను ఏ ప్రత్యేకత చూపిస్తుందో కాని అది నీవు లేఖారూపంగా చూచేకంటే జగత్ కల్యాణమూర్తి అయిన అమ్మ ప్రశాంత వదనంలో, అనవరతలాస్యం చేసే దేదీప్యమానమైన రమణీయదరహాసంలో దర్శనమిచ్చే "అన్నపూర్ణ"ను దర్శించి, ఆనాడు వైభవోపేతంగా జరిగే అర్చనల మధ్య కనిపించే అమ్మ దివ్య సుందరమూర్తిని ప్రత్యక్షంగా చూచి మా ఆనందంలో పాలుపంచుకోవటానికి రమ్మని ఆహ్వానిస్తున్నాను. నీవు ఒక్కడివే కాదు. ఈ విషయమందు ఆసక్తి కలిగిన నీ తోడి సోదరీ సోదరులకు కూడా ఈ విషయం తెలియజేసి అందరూ కలసిరండి.

**- ఆగష్టు, 1966**

# పెద్ద కుక్క

1964 సంవత్సరం ఆగష్టు నెల మూడవ తేది సాయంకాలం 7 గంటలకు జరిగిందీ సంఘటన :

ఆవేళ పది నిమిషాల క్రితం అమ్మ చెప్పిన ఒక పని పూర్తి చేసి తిరిగి నేను అమ్మ గది దగ్గరికి వచ్చేటప్పటికి హడావుడిగా వున్నది అక్కడి వాతావరణం. హాల్లోకి వెళ్ళబోతూ వరండాలో నిలబడిన సావిత్రిని చూచి విషయం తెలుసుకోవాలన్న కుతూహలంతో కారణమేమిటని ప్రశ్నించాను. "అమ్మ పెద్దకుక్క దగ్గరకు వెళ్తున్నారట" అన్నది ఆ అమ్మాయి.

నా ఊహ నిజమైనదనుకుంటూ లోపలికి వెళ్ళాను. ఒక పావుగంట క్రింద చంద్రమ్మ అక్కయ్య మాటల సందర్భంలో అమ్మతో "రోజూ వచ్చే పెద్ద కుక్క ఇవ్వాళ ఇటువైపు కన్పించలేదమ్మా, ఎక్కడుందో పాపం ! దానికి రోజులు దగ్గరికి వచ్చాయి" అన్నది. ఆమె అన్నమాటలో అతిశయోక్తి ఏమీ లేదు. ఆనాటి దాని పరిస్థితిచూస్తే రోజులు కాదు కొన్ని గంటల వ్యవధి మాత్రమే ఉన్నదనిపిస్తుంది. వెంటనే అక్కడ ఉన్న సావిత్రిని అది ఎక్కడుందో చూచి రమ్మని అమ్మ పంపించారు.

అసలు ఉదయం అమ్మ స్నానం చేసి హాల్లోకు రాగానే రోజువలె అక్కడ కన్పించకపోయేటప్పటికి ఎక్కడుందో అని అప్పుడే వెతికించారు. అప్పటికది పోస్టాఫీసులో పడుకొని ఉన్నది. ఆ తర్వాత మరో రెండుసార్లు చూచినా అది అక్కడే ఉన్నది. "వర్షంపడినా ఇబ్బంది లేని ప్రదేశమది. అక్కడేపడుకో నివ్వండి దాన్ని. నెమ్మదిగా అదే లేచి వస్తుంది" అని అమ్మ అన్నాక మళ్ళీ అటువైపు ఎవరూ వెళ్ళలేదు. మరి ఎప్పుడు లేచి వెళ్ళిందో అమ్మ ఇంటివైపు రాకుండా డాబాలవైపు వెళ్ళి వాటి కెదురుగా ఉన్న ఇసుక కుప్పల మీద పడుకున్నది.

జడివాన కురియకపోయినా తెరలు తెరలుగా సన్నని జల్లు పడ్తూనే ఉన్నది ఆ రోజుల్లా. రివ్వుమంటూ వీస్తున్న గాలి శీతాకాలాన్ని తలపింప చేస్తున్నది. అయినా ఆ కుక్క లేవలేకా, మరణ బాధవలన శరీరంలో కలుగుతున్న తపనకు తట్టుకోలేక అక్కడే పడుకున్నది.

సావిత్రి చూచివచ్చి ఈ విషయం చెప్పగానే అమ్మ వెంటనే బయల్దేరారు.

అమ్మ హడావుడి చూచి కాత్యాయని "ఈ వర్షంలో బురదలో నువ్వేం వెళ్తావమ్మా! దాన్నే ఇక్కడికి తీసుకొస్తాము" అన్నది. డాబాలున్న ప్రదేశం అమ్మ ఇంటికి దాదాపు నూటయాభై గజాల దూరంలో ఉంటుంది. జల్లుపడటం వలన దారి బురద బురదగా ఉన్నది. అందులో ఈ నేల రేగడి నేల. అయితే కాత్యాయని అమ్మని వెళ్లొద్దు అనటానికి కారణం ఇదొకటే కాదు. సాయంకాలం నుండి అమ్మ అదోరకంగా నలతగా ఉన్నారు.

కాత్యాయనికి సమాధానంగా అమ్మ "ఈవర్షం బురద ఇవన్నీ నాకే క్రొత్త కాదమ్మా ! వీటికి అలవాటు పడ్డదాన్నే. పాపం పిచ్చిది. దానికి నేనంటే ఎంత ప్రేమో ! దానికి ఓపిక ఉన్నన్నాళ్ళు నా కోసం వచ్చేది అది. ఇవ్వేళ దాని కోసం నేను వెళ్తాను" అని అంటూ వరండాలో నుండి మందిరంలోకి రాబోతుండగా కాత్యాయని ఒక భుజం పట్టుకొని జాగ్రత్తగా బురదలో జారకుండా తీసుకొచ్చింది. మరోసారి ప్రయత్నిద్దామని రామకృష్ణ అన్నయ్య కాత్యాయని అన్నమాటే అన్నాడు అమ్మతో.

అందుకు అమ్మ నవ్వి "దాన్ని మీరు ఇక్కడికి తీసుకొచ్చేది నా కోసం కాని దాని కోసం కాదుగా నాన్నా ! నాకేం ఫర్వాలేదు. నేను వెళ్ళాల్సిందే" అని మందిరం ద్వారం దగ్గరకు వచ్చారు.

మోకాలి లోతు రేగడి బురదలో అమ్మ ఎట్లా నడవగలరన్న ఉద్దేశ్యంతో మేము అడ్డుపడ్తున్నాం కాని; మరణ కాలమాసన్నమైనదని కడసారిగా అమ్మ దర్శనాన్ని కోరుకున్న ఆ కుక్క ప్రార్థన వ్యర్థమౌతుందా ? భక్తపరాధీనుడు కదా భగవంతుడు !

అమ్మ ద్వారం దాటి ఒక అడుగు వేశారు. కాని మేము ఊహించినట్లు మరో అడుగు వెయ్యటానికి అమ్మ శ్రమపడలేదు. పొడినేల నడిచినట్లు ఆ తడినేలమీద చకచకా నడుస్తూ దాన్ని సమీపించారు. అదే సమయంలో లక్ష్మీనరసమ్మ అక్కయ్య గిన్నెలో పాలుపోసి త్రాగిస్తున్నది. నెమ్మదిగా నాకుతూ అతి కష్టం మీద గుటకలు వేస్తూ మ్రింగుతోంది కుక్క. "అన్నం తినలేదా" అమ్మ ఆ కుక్కను చూస్తూ అక్కయ్యను అడిగారు.

"ఇందాక పెడ్తే కాస్త తిన్నది. కాని ఏమీ తినటం లేదమ్మా! అది" "జల్లు పడుతుంది కదా ఇక్కడే ఉంచారేం. పంచలో పడుకో బెట్టకపోయారా"

"ప్రయత్నించాం కాని రాలేదమ్మా"

గ్లాసులో మిగిలిన కొద్ది పాలలో తులసి దళాలు తెప్పించి వేసి తాను కుక్క ప్రక్కన కూర్చొని దాని మీద చెయ్యివేస్తూ ఆ పాలను అక్కయ్యను పట్టమన్నారు. తన ప్రార్థన నాలకించి పరుగున వచ్చినా ఆర్తజనరక్షణి అమృతస్పర్శకు ఆ కుక్కలోని నరనరమూ ఆనందంతో పులకరించింది. ఆ ఆనంద చ్ఛాయలు దాని కదలికలోనే కాదు ముఖంలో కూడా కన్పించాయి. కళ్ళు విప్పి అమ్మను చూడాలని ప్రయత్నించింది. కాని దృష్టి మాంద్యం అందుకు అడ్డుపడింది. అక్కయ్య గిన్నెలో పాలుపోసి దాని ముందు పెట్టింది. కాని అది ముట్టుకోలేదు. దాని ఉద్దేశం గ్రహించిన అమ్మ చిరునవ్వుతో ఆ గిన్నె తాను పట్టుకొని త్రాగించారు. ఐదు నిమిషాల తర్వాత ఆ గిన్నెలో తులసిదళం కూడా కన్పించలేదు. అమ్మ దాని మూతి కడిగి శరీరమంతా నీళ్ళు చల్లి తోకవైపు భాగం తుడిచి కురుపు ఎక్కడుంది? అంటూ చెవి పట్టుకొని చూశారు. అది బాధగా మూల్గింది. మళ్ళీ ఒకసారి నీళ్ళు చల్లి చెవి అంతా కడిగి మేనంతా నిమిరి దీన్ని వెచ్చగా ఉండే ప్రదేశంలో పడుకో పెట్టండి అని లేచారు అక్కడ నుండి.

వరండాలో కూర్చున్న నాన్నగారు తిరిగివస్తున్న అమ్మను చూచి అడిగారు కుక్క పరిస్థితి ఎట్లా వున్నదని. "దాని పని అయిపోయింది పాపం" అన్నది అమ్మ.

"ఆ కుక్క ఎంత చురుకైనదో, తెలివి గలదో అంత సాహసి కూడా. సామాన్యంగా అది ఎవరి జోలికీ వెళ్ళేది కాదు. కాని దాని మనస్సు నొప్పించేట్టుగా ఎవరైనా ప్రవరిస్తే మాత్రం వాళ్ళ ఇళ్ళ కిటికీ ఊచలు పీకి ఇళ్ళల్లోకి దూరి గొడవచేసి వాళ్ళను ఏడిపిస్తుండేది. ఒకసారి దాని బాధపడలేక వాళ్ళు తలుపులన్నీ వేసి కొట్టబోతుంటే అది ఒక్క ఉదుటున చూరెత్తి బయటకు దూకింది. మొదట్లో మీ అమ్మగారి దగ్గరకు వచ్చే జనానికి ఏడవ మైలురాయి నుండి ఊళ్ళోకి దారిచూపించేది. ఈ కుక్కే వచ్చే జనాన్ని ఎట్లా తీసుకొచ్చేదో వెళ్ళే జనాన్ని అట్లా పంపించి వచ్చేది" అని నాన్నగారు దాన్ని గురించి చెప్తూ "విశ్వాసానికి కుక్క

జాతే పేరండీ" అన్నారు. "ఒక్క కుక్కకే కాదు మన దగ్గరున్న పిల్లులకు కూడా ఉన్నది కదా" అన్నారమ్మ. దానికి నాన్నగారు "ఏమో విశ్వాసానికి కుక్కనే చెప్తుంటారు కదా" అన్నారు.

"మనకు తక్కిన వాటితో పరిచయం లేదు కనుక అనుకుంటున్నాము. అన్నింటిలో విశ్వాసం ఉన్నది" అంటూ అమ్మ లోపలికి వచ్చారు.

లోపలికి వచ్చాక "ఈ రాత్రికి కుక్క పోతుందేమో" అనుకున్నారు స్వగతంగా.

అమ్మ మాటలోని అంతరార్థమేమిటో కాని ఆ కుక్క ఆ రాత్రి చనిపోలేదు. రెండు రోజులు విపరీతమైన బాధననుభవించి 5వ తేదీ సాయంకాలం 7-40 ని.లకు అంతిమశ్వాస వదిలింది. అమ్మకీ విషయం తెలియగానే మరో కుక్కలు కాని, జంతువులు కాని దాన్ని పీకి తినకుండా ఉండేలా ఒక గొయ్యి తీసి పూడ్చి పెట్టమన్నారు.

సంస్కారమనేది కేవలం మానవులలోనే కాక మిగతా జీవజాలంలో కూడా ఉన్నదని మనకు తెలియచెప్పిన ఆకుక్కను గురించి ఇంకా చెప్పుకోవాలంటే దాని ఆకృతి కుక్కరూపమే కావచ్చు; కాని దాని హృదయం వివేకవంతులం విజ్ఞానవంతులం అని అనుకుంటున్న మనకంటే ఎన్నో రెట్లు విశాలమైనది. అమ్మను అది ఎంత ప్రాణప్రదంగా ప్రేమించేదంటే అమ్మకు ఏ చిన్న బాధ కలిగినా, ఎవరైనా కలిగించినా అది సహించలేక పోయేది. ఆ విషయంలో ధర్మానికి కట్టుబడిన వేళల్లో కళ్ళనీళ్ళు కారుస్తూ లేనప్పుడు ఆవతలివారి అంతు కనుక్కునే దాకా వదలి పెట్టేది కాదు.

దాని చూపులో, నడకలో, నడతలో అమ్మకోసం ఏ క్షణంలోనైనా ఆత్మార్పణం చెయ్యగల త్యాగం, ధైర్యం కనుపిస్తుండేవి.

అనేక సంఘటనలలో అమ్మకు తల్లిగా, తోడుగా, మిత్రుడుగా ప్రవర్తించింది. అందుకే ఒక సందర్భంలో అమ్మ దాన్ని గురించి ఒక మాటలో అన్నారు. "మనిషి మనిషిని ఎంత దూరం ప్రేమించవచ్చో అంతదూరం అది ప్రేమించగలద"ని.

ఎప్పుడైనా ఇంట్లో పిల్లలకు జబ్బుగా ఉంటే అమ్మ వాళ్ళ దగ్గర కూర్చునే అవకాశం లేక ఏదో పనిలో ఉన్నప్పుడు అమ్మ ఆ పని పూర్తి చేసుకొని వచ్చేవరకు

వాళ్ళ దగ్గరే అది కూర్చునేది. ఇంటికి ఎవరైనా క్రొత్తమనిషి వస్తే అమ్మ దగ్గరకి వెళ్ళి తాకి సంజ్ఞచేసి చెప్పేది కాని అరవటం కాని కరవటం కానీ లేవు. ఇటువంటి లక్షణాలతో అది కుక్కలన్నింటిలో ప్రత్యేకంగా ఉండేది.

ఇంతకూ అమ్మ చరిత్రలో ఒక విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించాల్సిన యోగ్యత దానికున్నది. అందుకే ఆనాడు అంటే 1950లో దానికి ఏడేళ్ళ వయస్సులో ఊళ్ళో కుక్కలకు పిచ్చి ఎక్కిందని వాటి తలల మీద కొట్టి ఊరికి దూరంగా పారేసి వస్తున్న సమయంలో వాటిలో జేరిన ఈ కుక్క, దీని సోదరులలో మరొకటి ఆ కొట్టిన దెబ్బలకు మరణించక స్పృహ వచ్చాక నడవటానికి ఓపికలేకపోయినా, తగిలిన గాయాలు బాధపెడుతున్నా అలాగే పరుగెత్తుకు వచ్చి మజ్జిగ చిలుకుతున్న అమ్మ పాదాల మీద వాలిపోయాయి. వెంటనే ప్రాణం వదిలింది ఒకటి. అది అక్కడున్న మజ్జిగ చుక్కలునాకి తేరుకున్నది; కాని మజ్జిగ చుక్కలు నాకగానే తేరుకునే స్థితికాదది.

అమ్మ చిందించిన ఆ నాలుగు చుక్కలే దాని పాలిట అమృతమై చరితార్థమైన పునర్జీవితాన్ని ప్రసాదించినాయి.

**- అక్టోబర్, 1966**


COURTESY VISWAJANANI TRUST

# అమ్మకేదీ విశేషం లేదు - అంతా సహజమే

అన్నయ్యా,

అవును, నీవు అన్నట్లు ఈమధ్య నీకు ఉత్తరాలు రాసి చాలాకాలమైంది. కాని ఈ కాలవిలంబనకు చెప్పుకోదగిన పెద్దకారణమేమీ లేదు.

ఇకనుండి ఏ నెలకానెల ఇక్కడి విషయాలతో నిండిన లేఖలను నీవు అందజేయమని కోరావు. అలాగే కాని, అనుభవానికి తప్ప అసాధ్యమైన వర్తమాన కాలదృష్ట్యా అమ్మను దైవం అనటానికి ఆ విధంగా ఆరాధించటానికి గల కారణమేమిటో ఒకటి రెండు మాటల్లో చెప్పుకొని ఆ భాగంలోకి వెళ్దాం.

ఇంకా మనం ఏపాతరాతియుగంలోనో, ఈ సర్వాన్ని తన ఇచ్ఛానిచ్ఛల ననుసరించి నడిపించే శక్తి ఒకటుందని నమ్మే ఏ మూఢ విశ్వాసకాలంలోనో లేము. నేడు మనం ఉన్నది ఇరవయ్యో శతాబ్దిలో, ఈ అణుయుగంలో విజ్ఞానానికేం కొదవలేదు. ఒక గ్రహం నుండి మరొక గ్రహానికి దారులు నిర్మించేటంతగా మేధాశక్తి పెరిగిందీనాడు. మనం కనిపెట్టిన అనేక అద్భుతమైన యంత్రాలు చిత్ర విచిత్ర వస్తువులు భౌతికంగా జీవితాన్ని విలాసంగా, వినోదంగా అనుభవించుటవరకే పరిమితం కాలేదు. విజ్ఞానప్రగతి పథంలో మనం ఎంత త్వరగా పయనిస్తున్నామో కూడా సుస్పష్టం చేస్తున్నాయి. నేడు జగత్తు నంతా కల్యాణ శోభలతో విలసిల్ల చేయగల్గటానికి, క్షణమాత్రకాలంలో శ్మశానవాటికగా మార్చటానికి శక్తి మనకున్నది. ఈ ప్రపంచ ప్రయోగశాలలో నిరంతరాన్వేషకులం, విశ్రాంతి లేదు మనకు. అందుకు విజ్ఞానశాస్త్రంలో రోజుకో నూతనాధ్యాయం చదువుతున్నాము. ఈ ప్రయత్నంలో ధనం ఒక్కటేకాదు జీవితాలే కర్పూరంలా కరిగిస్తున్నాము. ఇంత స్పష్టంగా మన ప్రయత్నం, కృషి, ఫలితం కనిపిస్తుంటే ఇదంతా మనది కాదని మనం నిమిత్త మాత్రులమని అనుకోటం కేవలం మూఢత్వమే అవుతుంది. ఇంకా అంతకంటే చిత్రమైన ఈ సంగతి చూడు. ఒక సాధారణ స్త్రీని ఒక కుగ్రామంలో నిరాడంబరమైన సామాన్య గృహిణిగా ఉన్న ఆమెను సర్వాధారమైన శక్తి అని జగన్మాతఅని, విశ్వసించటమా ? అసలు దైవమనే శక్తి ఉన్నదనటమే వైజ్ఞానికరంగంలో మన తిరోగమనానికి చిహ్నమనుకుంటుంటే దీన్ని గురించి ఏమనుకుందాము ?

ఆమెను అందరు "అమ్మ" అంటారు. దేవత అని పూజిస్తారు, కాని ఆమె ఎప్పుడూ ప్రత్యేకంగా తాను దైవమనీ తనని పూజించమనీ చెప్పలేదు.

ఆమె ఏమీ చదువుకోలేదు.

"ఇవిగో నా మహిమలంటూ" మహత్యాలు ప్రదర్శించలేదు. తానూ మనలా సామాన్య మానవినే అంటుంది. అయినా ఆమె సర్వజ్ఞురాలనీ, సర్వశక్తిమతి అనీ, "మానవ ముసుగు చాటునున్న మాధవి" అనీ అంటారు. ఎంత చిత్రమైన విషయం.

ఇదేమిటి ? ఇట్లా రాస్తున్నావు ? అని నీకు ఆశ్చర్యంగా ఉన్నదా ? ఆయోమయంగా ఉన్నదా ?

నేను రాస్తున్నది ఆస్తికత్వానికి, నాస్తికత్వానికి కనీసం ఆ పదాలకైనా సరిగా అర్థమైనా తెలియనివారిని గురించి, అమ్మ అన్నట్లు నిజమైన శాస్త్రకారుడు ఎప్పుడూ ఆస్తికుడే. ఆస్తికులనే 'భగవంతుని' నాస్తికుడు వాడి భాషలో స్వభావం అంటాడు. భాష వేరు గాని ఇద్దరూ అంగీకరిస్తారు తమకు అర్థం కాని శక్తి ఏదో ఒకటుందని.

ఒక్క శాస్త్రజ్ఞుడే కాదు; ఏ శాస్త్రకారుడైనా సరే కేవలం ఆ శాస్త్రంతో పరిచయమాత్రంగా కాక పూర్తిగా అర్థం చేసుకోగలిగితే కనీసం నిత్యజీవితంలో జరిగే సంఘటనలైనా జాగ్రత్తగా పరిశీలించగలిగితే మనకు అర్థంకాని అజ్ఞానశక్తి ఒకటుందనే సత్యాన్ని ఒప్పుకోక తప్పదంటారు. దాన్నే విధి అను, దైవం అను, ప్రారబ్ధం అను, ఆత్మ అను, స్వభావం అను, సహజం అను ఇంకా ఏమన్నా ఉన్నది మాత్రం ఒకటే.

అసలు అమ్మ దృష్టిలో దైవం అంటే ఒక కిరీటం, నాలుగు చేతులు ... ఎక్కడో ఓమూల కూర్చున్న వాడనికాదు. అంతా అయినవాడని అర్థంకానివాడు అని. అందుకే 'దేవుడెవరంటే ?' దేవులాడినా దొరకనివాడుఅని, అద్వైతం అంటే అంతా అయి అర్థంకానిది" అని నిర్వచించారు. ఈ కనిపించేదంతా దైవమేనంటారు. ఒకసారి "ఆత్మాసాక్షాత్కారం అంటే ఏమిటమ్మా?" అని ఒకరు ప్రశ్నించినప్పుడు "ఈ కనిపించేదే" అన్నారు.

దైవాన్ని గూర్చి నిరాకారుడు, నిర్గుణుడు, నిర్వికల్పుడు అని మనం చెప్పుకునే

ఆ పదాలకు అమ్మ చెప్పే అర్థం వేరు. నిర్గుణుడంటే గుణరహితుడని కాదు; గుణసహితుడే. అన్ని గుణాలు తానైనావాడు.

నిర్వికల్పుడంటే అన్ని సంకల్పాలు తనవే.

నిరాకారుడంటే అన్ని ఆకారాలు గలవాడు అని. అంతేకాదు పరిమితమైన ఒకరూపం ఒక నామంకాదు దైవమంటే – వాడు సర్వలక్షణ సమన్వితుడు.

అయితే ఈ అమ్మను ఆదైవమని ఎట్లా అంటున్నావు ? దైవాన్ని గూర్చి చెప్పుకునే లక్షణాలన్నీ ఆమెలో ఉన్నాయా ? ఏం చూచి, ఏ ఆధారంతో అక్కడ ఆ మానవత్వంలో మాధవత్వాన్ని ఆపాదిస్తున్నావు ?

శాస్త్రాలు – ఉపనిషత్తులతో కాదు కాని మొత్తం మీద ప్రమాణం ఆధారంగానే చెప్తున్నాను అన్నయ్యా ! ఆ ప్రమాణం నా మనస్సు. ఒకవేళ నీకు వాటిలో పరిచయమున్నా – తెలిసినా అందులోనైనా నీవు అర్థం చేసుకో కల్గింది నీ మనస్సు అనే ప్రమాణంతో నేగా – నీవు, నేనే కాదు; ఎవరైనా అంతే.

ఇంతకీ అనటానికి తగిన కారణాలు లేకపోతే ఒక సామాన్య మానవాంగనను దైవం అనటం చిత్రమైన విషయం కావచ్చు. కాని ఛలోక్తి అయిన సంగతిమాత్రం కాదు. అవునంటావా !

ఇక్కడ మనం కాస్త ఆగాలి. దైవాన్ని సర్వాంతర్యామి అంటున్నాము, నిజమేకాని సర్వాంతర్యామి అని మనం అంతటా అన్నింటికి నమస్కరించటంలేదే? ప్రత్యేకించి ఒక విశిష్టమైన రూపు, మానవతీతమైన విలక్షణ శోభితమైన పటిష్ట చరిత్ర గలిగిన మూర్తులకే అవనత శిరస్కులమై హస్తాలు ముకుళిస్తాము. ఎందుకూ? అంటే దానికి సమాధానం ఉన్నది. మనం మానవులం. అవధులు – పరిధులున్నాయి మనకు.

అందుకే అనంతమైన శక్తి అవతారం పేరిట పరిమితమైన ఆశక్తిని అర్థంగానిస్తుంది. అది ఆదిశక్తి ఆట అను, లీలఅను, సహజమను. కాని సృష్టి ఆరంభమైన నాటినుండి ఏదో ఒక రూపంలో అవతరిస్తూనే ఉన్నది. పరిమిత రూపం ధరించినప్పుడు దాని కట్టుబాట్లకు, నియమాలకు కట్టుబడినట్లు కన్పించినా మరోవైపు తన సర్వశక్తిమత్త్వాన్ని ఏదో ఒకరూపంగా అవగతం చేస్తూనే ఉంటుంది.

ఈ వాస్తవాన్ని అవతారమూర్తుల చరిత్రలు తెలియచేస్తాయి. అట్లాంటిదే "అమ్మ" చరిత్ర.

అవనిపై అడుగిడునప్పటినుండి ఈ క్షణంవరకు ఆమె జీవితాన్ని పరిశీలిస్తే మనకా సత్యం సుబోధక మౌతుంది. ఆమెను కవులు కీర్తిస్తున్నారు. కావ్యాలు లిఖిస్తున్నారు. సర్వసృష్టికారిణి అని, గాయకులు గానం చేస్తున్నారు. చిత్రకారులు చిత్రిస్తున్నారు. శిల్పకారులు చెక్కుతున్నారు శిల్పాలు. ఎందుకూ ? వారిని భావుకులు, ఉద్రేకపరులందామా ? అన్నా వారిని ఆవిధంగా కదలించగల్గి అద్భుతమైన కళాఖండాల్ని సృష్టింప చేయగల్గిన ఏదో "అలౌకికత" ఆమెలో లేకపోతే ఇది సంభవమేనా ?

ఆమె ఎవరైందీ, ఆమె దగ్గరకు ఎందుకు వస్తున్నది తర్వాతమాట. కాని ఆమె దర్శనార్థమై వివిధ ప్రాంతాలనుండి, సూదూర దేశాల నుండి అనేకమంది అనేక వృత్తులవారు కులమత జాతి వర్గ విచక్షణ లేకుండా వస్తున్నారు. వీరిలో పామరులు విషయం వదిలేయి. ఎందుకంటే వారికి ఒకటే తెలుసు. తమను నడిపించే శక్తి ఒకటి ఉన్నది. దానిచేతిలో తాము కీలుబొమ్మలమనీ ఆశక్తే ఈ అమ్మ అనీ. వాస్తవం అదే అయినా అంత త్వరగా ఈ సత్యాన్ని అంగీకరించలేని పండితుల, శాస్త్రకారుల, హేతువాదుల మాట నేను అనేది; వారంతా ఎందుకు వస్తున్నారు ? ఆమెలోని ఏ విశేషం ఆమె పాదాల మ్రోల మోకరింపచేసి అంజలి ఘటింపచేస్తుంది వారిచేత ?

వ్యక్తిని పూజించటం అనేది అతిశయోక్తి అయిన సంగతేమీకాదు. మనలో పరిమళ భరిత వ్యక్తిత్వాలకు చేతులు జోడిస్తాము. అలాగే ఆమెలోని ప్రేమ, కరుణ, త్యాగం, దాతృత్వం, మంచితనం వీటిని చూచి ఆరాధిస్తున్నారా, కాదనను కాని మనం చూడకపోయినా శాస్త్రాలు చరిత్ర లాధారంగా తెలిపిన దేవతామూర్తుల నామాలన్నింటిని వాళ్ళు రామకృష్ణులు, లక్ష్మీ పార్వతులు, మహ్మదు, క్రీస్తు ఎవరైనా వారి రూపాలు చూచి ఆ నామాన్ని అర్చిస్తున్నారు, ఆరాధిస్తున్నారూ అంటే అది ఒక సామాన్య వనితే అయితే సాధ్యమేనా ?

ఆమె శక్తికి నిదర్శనంగా హఠాత్తుగా ఆకాశంలోనుండి దిగిరావటం, భూమిలో నుండి ఉద్భవించటం వంటివి లేకపోవచ్చు. మనకు సాధారణ

విషయంగా నున్న ఒక తల్లి గర్భవాసాన మనలాగే ఆమె జన్మించటం విశేషం కాకపోవచ్చు. కాని జన్మించిన క్షణం నుండి ఆ తర్వాత జరిగిన సంఘటనలన్నింటిలోనూ ఓ ప్రక్క సాధారణంగా కనిపిస్తూనే మరో ప్రక్క తన అసాధారణతను కనపర్చసాగింది. సూర్యుడిముందు దీపంలా ఆధ్యాత్మికశక్తి ముందు తన మహిమలన్నీ అల్పమే అయినా 'సృష్టి కంటే మహత్త్వం ఏముంది?' అనే ఆమె, ఇవన్నీ చూపించిందంటే నిస్సందేహంగా అవన్నీ మనకోసమే. అవి మనలను అంత త్వరగా సూటిగా వాడిగా వేడిగా తాకుతాయి కనుక.

ఆమె జీవితాన్ని అనుభవించింది; పూర్తిగా జీవితంలోకి మిట్టపల్లాలన్నింటిలో లభ్యమయ్యే కష్టసుఖాలన్నింటినీ నిర్లిప్తంగా, నిశ్చలంగా, నిర్వికారంగా అనుభవించింది. ఇది కావాలనీ లేదు; ఏదీ అక్కర్లేదనీ లేదు. ఏది తటస్థపడ్తే అదే అనుభవించింది. ద్వంద్వాతీతమైన ఆ స్థితిముందు జీవనం, మరణం రెండూ తమ ఓటమిని అంగీకరించాయి.

"పరబ్రహ్మ స్వరూపమంటే అన్నమే కాదు అశుద్ధం కూడా" అనీ, అలాగే అన్నింటిని సమదృష్టితో ప్రేమిస్తుంది. ఎప్పుడూ సమభావన కలిగి ఉంటుంది. తనని అందరూ 'అమ్మా' అన్నా అనకపోయినా, ప్రేమించినా ప్రేమించకపోయినా తాను అందర్నీ తన బిడ్డల్లాగానే ప్రేమిస్తుంది. ఆ ప్రేమకు మనలోని మంచిచెడ్డలతో ప్రమేయం లేనట్లే కేవలం మానవజాతినే కాక సృష్టిలోనే సకల జీవరాసులను ప్రేమిస్తుంది. మనతో ఆడుకున్నట్లే వాటితోనూ ఆడుకుంటుంది; తియ్యగా పలకరిస్తూ, హాయిగా కబుర్లు చెప్తుంది.

ఆమె మాట్లాడుతుంటే ఆ స్వరంలో పలికే మధుర మంజుల విపంచీ స్వనాలొకటే మనకు వీనులవిందు నొనర్పవు; సరళ శైలిలో, సుగమభాషలో సకలవేద – శాస్త్ర సందర్శనమౌతుంది.

ఆమె రూపమూ అంతే. ఆ దర్శనం ఎడారిలో దప్పిక గొన్న వాడికి నీళ్ళు దొరికినంత హాయిని, చల్లదనాన్ని చేకూరుస్తుంది. ఒక్క మాటలో చెప్పుకోవాలంటే ఆ సౌందర్యం మధురభక్తి భావనలకు ఆలంబనమైనది.

ఏక కాలంలో అనేకచోట్ల అనేకమందికి కనిపించటం, అనేకవిధ రూపదర్శన

మివ్వటం, ఆమె మీద పంచభూతాలు తమ ప్రకోపాన్ని కోల్పోవటం వీటికి చిహ్నాలందాము.

ఎన్ని సంవత్సరాలైనా గడవనీ, అతిపెద్ద సంఘటనైనా కానీ, చిన్న విషయమైనా కానీ, ఆ సమయంలో అక్కడ ఉన్న వాతావరణ స్థితిలో సహా ఏ సంగతైనా చెప్తుంటే ఏవో బలంగా ముద్రించుకుపోయినవి తప్ప ఒకవేళ గుర్తుఉన్నా ఆ విధంగా గుర్తులు వుండని మనం ఆమె జ్ఞాపకశక్తి అసామాన్యమైన, అద్భుతమైన జ్ఞాపకశక్తి అనుకోకతప్పదు. కాని ఆమె అంటుంది చిరునవ్వుతో 'నాకు గుర్తు ఉండటంలో విశేషం లేదు. నాకు ఎప్పుడో జరిగినట్టు ఉండదు. జరుగుతున్నట్టే ఉంటుంది.'

అంటే ఆమెకు వర్తమానం తప్ప భూత, భవిష్యత్‌లు లేవు అన్నమాట. అదెప్పుడౌతుంది. కాలమే తానైననప్పుడు ?

అందుకే అమ్మకేదీ విశేషం లేదు. కొద్దీ గొప్పా లేదు. ఆ మాటలలో చర్యలో దేనిలోనైనా సహజతే ప్రస్ఫుటమౌతుంది. సర్వం సామాన్యమే తనకు. మాటలలో వినిపించే అద్వైతం ఆచరణలో కనిపిస్తుంది.

దాన్ని ఈ చిన్న లేఖ ద్వారా నీకు చెప్పలేను. నీవే ఒకనాడు గ్రంథరూపంలో చూద్దువుగాని, ఇందులో మాత్రం ఒకప్పుడు నీవు అడిగిన ప్రశ్నకు "అమ్మని దైవమని ఎందుకంటారు ?" అన్న దానికి సమాధానం వెతుక్కో. నేను రాయబోయే విషయాల్లోని 'వింతలూ – విశేషాలు' అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించు.

సరే ! అట్లాగే కాని మరో సందేహం అంటావా ? అమ్మ అవతారమూర్తి అయితే ఏ ధర్మస్థాపనకు అరుదెంచినది ? కృష్ణుడు చెప్పినట్లు తనూవచ్చేముందు తనరాకను తెలియచేసిందా ?

వీటిలో పై నెల లేఖలో సమాధానం చెప్పుకుందాము. ఇక సెలవుతీసుకోనా మరి.

**– జనవరి, 1967**

# అమ్మ మహాప్రేమసాగరం

అన్నయ్యా,

నిజమే అమ్మ ఏ ధర్మ సంస్థాపనకు అవతరించినది ? ఏ న్యాయపాలనకు అరుదెంచినది ?

కాని ఈ ప్రశ్నలు వేసుకునేముందు వేసుకోవాల్సిన ముఖ్యప్రశ్న ఇది? దుర్జనుల దౌష్ట్యం ప్రబలిన వేళలో సజ్జనకోటి సంరక్షణకు భగవానుడు అవతరించటం బాగానే ఉన్నది కాని ఈ సృష్టే తనదైనప్పుడు ప్రత్యేకించి అధర్మం ఎక్కడిది ? అందులో భాగం కాదా? తన నిర్ణయం లేనిదే పెరుగుతుందా ?

అయితే మరి గీతలో "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని కృష్ణుడు ఎందుకన్నట్లు ? అధర్మం తన కతీతమైనదనా ?

ఈ ప్రశ్నలన్నీ ఒకసారి గీతలో ఈ భాగం గురించి మాట్లాడుతున్న ఒకరిని అమ్మ అడిగారు. నాడు సమాధానం ఇవ్వలేక అమ్మనే చెప్పమన్నట్లు మౌనం వహించారు. అమ్మ, ఈ సృష్టి అంతా వాడిదేననీ, ధర్మాధర్మాలు రెండూ అందులో భాగమేననీ, ఆ గీతాశ్లోకానికి అర్థం అధర్మంతనకతీతమైనదని పెరిగినదని తాను రావటం కాదనీ,'ఇంత'ని తాను పెట్టుకున్న నిర్ణయం పూర్తి అయి రావటమే అని సమాధానం ఇచ్చారు.

దీనిని బట్టి మనకవగతమౌతున్న విషయమేమిటి? ఇదంతా తన వినోదార్థమైదైవం సృష్టించుకున్న ఆట అనిపిస్తుంది.

ఈ విశ్వం జనించిన దగ్గరనుండి ఆశక్తి అవతారం పేరిట ఎన్నిమార్లు ఏఏ రూపంగా ఈ విశ్వవాణిని పలకరించి వెళ్ళిందో కాలగమనంలో అతిస్వల్ప ఆయుః పరిమాణంగల మనకు తెలియకపోవచ్చు; కాని తెలిసినంతలో సృష్టిలో తనకొకటి క్షుద్రమైనది మరొకటి విశిష్టమైది లేదని తెలియచేసింది. ఎందుకంటే అవతారం అనగానే కేవలం రామకృష్ణులనే చెప్పుకోవటం లేదు. వరాహ కూర్మ మీనాలను కూడా చెప్పుకుంటున్నాము.

అలాగే ఆ శక్తికి స్త్రీ పురుష భేదమూ లేదు. ఏ అవతారం ధరించినా, ఉద్దేశం ఒకటే కాని ఆచరణ విధానంలో భేదం ఉండవచ్చు.

దుష్టశిక్షణకు ఒకసారి ఆయుధాల నుపయోగిస్తే మరొకసారి ప్రేమ వాత్సల్యాలనే ఉపయోగింపవచ్చు. ఒకసారి శరీరాలనయితే మరొకసారి గుణాలను శిక్షించవచ్చు. ఒకసారి శాసనంతో మార్పు తేగలిగితే మరొకసారి లాలనంతో మార్పు కలిగించవచ్చు. అది ఆశక్తి ఇచ్ఛ ననుసరించి ఉంటుంది. తాను ఏర్పరచుకున్న ఆట రీతినిబట్టి ఆయా సందర్భాన్నిబట్టి తన "అవతారాన్ని" నిర్ణయించుకుంటుంది.

ఈనాటి కాల పరిస్థితిని బట్టి - అది నీకు ప్రత్యేకంగ చెప్పనక్కర్లేదు. ఎక్కడ చూచినా, ఏ రంగంలోనైనా అరాచకం - అన్యాయం - అశాంతి, అవినీతి చట్టాపట్ట వేసుకొని తిరుగుతుంటే నాగరికత వికసిస్తున్న కొద్దీ సంకుచితమౌతున్న మనం ఆశించే ప్రగతి పుస్తకాలు, ఉపన్యాసాల వరకు మత్రమే పరిమితం కాక క్రియలో ఎట్లా కనిపిస్తుంది ? దీనికి కారణం సాటివాళ్ళను సమంగా ప్రేమించలేని దౌర్భాగ్యస్థితే. ప్రస్తుతం ప్రపంచంలో చాలాకరువైనది ఆ ప్రేమ ఒకటే. ఆ కరువు తొలిగి అందరి మనస్సులు ప్రేమభరితమైనప్పుడు ధర్మదేవత చల్లని చిరునవ్వును చూడగలం.

అందుకే తల్లి తనయుని ప్రేమించినా సోదరి సోదరుని ప్రేమించినా భార్య భర్తను ప్రేమించినా విశేషమైన ఈ రోజుల్లో అందరికీ ప్రేమస్వరూపిణియైన మాతృదేవిగా అమ్మ ఏ ధర్మస్థాపనకు ఈ ధరణిమీద అవతరించారో ?

"పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తం" "పరివర్తనమే మార్పు" "దేహాన్ని కాదు; గుణాలను శిక్షించటమే" అదే అమ్మ. ఆ విధంగానే మార్పు కలిగిస్తున్న అమ్మ ఆచరణ విధానమేమిటో నీ ఊహకే వదలివేస్తున్నాను.

ఇక కృష్ణుడు చెప్పినట్లు అమ్మ తాను వచ్చేముందు తన రాకను తెలియజేసిందా ? అవతారమూర్తులనటానికి అదొక లక్షణమని కాబోలు అడిగిఉంటావు. కాని కొన్ని అవతారాలలో ఈ లక్షణం కనిపించదు. అంతమాత్రాన వారిది అవతారం కాదంటావా?

అమ్మచరిత్రలో ఈ లక్షణం వాచా చెప్పటంకాక చేతలో చూపించటమే జరిగింది. అమ్మ తండ్రిగారైన సీతాపతిగారికి అమ్మ జన్మించటానికి కొన్ని మాసాల ముందుగా ఒకసారి స్వప్నంలో ఈనాటి అమ్మ రూపులో ఆనాడు సాక్షాత్కరించి ఇంట్లో ఉన్న వస్తువులన్నింటిని చీపురు చేటతో సహా అన్నీ వీధిలో వేసి ఇంటి ముందరభాగంలో కుర్చీ వేసుకొని కూర్చొని కనిపించారట.

స్వప్నం కరిగిపోయి మెలకువ వచ్చిన తర్వాత తాతగారు ముక్కున భాసిల్లుతున్న ముంగర బులాకీలతో, కనుబొమ్మల మధ్య భాగంలో పూర్ణబింబాకృతిలో అరుణకాంతుల నీనుతున్న కుంకుమబొట్టుతో, సుమకోమలసుందర హస్తాలనలంకరించిన కంకణ సముదాయంతో ధరించిన ఆభరణాల కాంతిని ధిక్కరిస్తున్న వెలుగుతో దీపిస్తున్న మేనిఛాయతో అలౌకికమైన తేజఃపూరితమైన ప్రశాంత గంభీర వదనంలో లాస్యం చేస్తున్న రమణీయ దరహాసంతో, శ్వేతవస్త్రధారిణియై సాక్షాత్కరించిన ఈ ముత్తయిదువ దర్శనం తమకెంతో హాయిని, తృప్తిని చేకూర్చటమే కాక తమకది శుభసూచకమని కూడా అనుకున్నారు.

తమకే కాదు ప్రపంచానికే అది శుభసూచకమని, ఆమె చర్య నవయుగానికి సూచన అని ఆనాడు అనుకోనీయలేదు తాతగారిని అమ్మ. ఆ తర్వాత కూడా పుట్టిన క్షణం నుండి అసాధారణతను కనబర్చుతున్నా దాన్ని అర్థం చేసుకోనివ్వలేదు. అందుకే ఇప్పుడంటారు తాతగారు :

"ఆ రోజుల్లోని అమ్మను, అమ్మ మాటలను – చర్యలను గురించి ఇప్పుడు ఆలోచిస్తే ఆనాటి విషయాల్లోని "విశేషం" ఇప్పుడు స్ఫురిస్తుందనీ, ఆశక్తి ఈనాడు అర్థమౌతుందనీ.

అమ్మమ్మకు అమ్మ శిశువుగా భూపతనం కావటానికి రోజులు జరుగుతున్న కొద్దీ భూభారాన్ని మోస్తున్నట్లుగా ఉండేదట.

దీనితో నా సమాధానం పూర్తి అయితుంది; కానీ ఇంతతో నీ సందేహాలు తీరాయి అనుకోను. అవి ఎప్పుడూ కలుగుతూనే ఉంటాయి. కలిగిన అన్నింటిని నీవు అడగలేకపోవచ్చు; నేను చెప్పలేక పోవచ్చు.

అమ్మను దైవమని విశ్వసించమనీ ఆమెను పూజించమనీ నమస్కరించమనీ కూడా చెప్పను. అమ్మ అన్నట్లు నమస్కారమంటే చేతులు జోడించటమే కాదు దానికెంతో సంస్కారముండాలి. కాని ప్రతి ఒక్కరికీ ఈ అవకాశం లభ్యం కావాలని ఆశిస్తాను.

అమ్మ ఎవరైనదీ నీకనవసరం, దాన్ని గురించి తర్వాత ఆలోచిద్దువు గాని. నీ ఎదుట నున్నదొక మహా ప్రేమసాగరం– అందులో స్నానం చెయ్యకపోయినా కనీసం దోసెడు జలపానమైనా చెయ్యి.

**– ఫిబ్రవరి, 1967**

# అమ్మ నామ సప్తాహం

ఈలోగా జరిగిన జనవరిని పలకరిద్దాం పద.

సరిగా... ఆ క్షణాలలో ఉరకలు వేస్తున్న ఆనందోత్సాహాలతో పాశ్చాత్యులు నూతన సంవత్సరానికి స్వాగతమిస్తున్న సమయంలో కొన్ని నిమిషాల పాటు మ్రోగింపబడిన జేగంట నినాదం ఆవరణలో వారినే కాదు ఊళ్ళో వాళ్ళని కూడా నిద్రమేల్కొలిపింది.

ఇంగ్లీషు క్యాలెండరు ప్రకారం కాలం క్రొత్త బట్టలు కట్టుకున్న ఆవేళలో మేము శరీరాలు చలికి ముడుచుకుపోతున్నా సంతోషోత్సాహాలతో విప్పారిన మనస్సులతో కనపడ్తున్న అమ్మరూపంలో ఉన్న కనుపించని కాలానికి పూజచేసి సరదాగా రస్కులు – బిస్కెట్లుతిని టీ త్రాగాము.

కాని ఈ పండుగను గతంలో జరిగిన వాటితో పోల్చుకుంటే ఉత్సాహం సరదా ఈసారి జరిగినదానిలో చాలా తక్కువ పాళ్ళలో ఉన్నాయి. కారణం ఆవరణలో ముప్పావుభాగం జలుబు జ్వరాలతో బాధపడుతున్నారు. అమ్మకు ఆరెండే కాక వాటికి దగ్గు ఆయాసం మొదలైనవి జతచేరాయి.

ఈ నెలలోనేగా సూర్యుడు కర్కటరేఖ నుండి మకరరేఖ వైపు పయనమారంభిస్తాడు. అందుకే సంతోష చిహ్నంగా కాని సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిన పుణ్యకాలమని కాని మరే పురాణేతిహాసాల ననుసరించి కాని, హిందూ సంప్రదాయంలో ప్రాముఖ్యము నిచ్చే పండుగలలో ఒకటైన సంక్రాంతి మరో వారం రోజుల దూరంలో ఉండగానే ఆవరణలో అహర్నిశం నామసంకీర్తన వినిపించసాగింది. ఇంక జీరలు లేని జిలుగులురాని ఆ లేత స్వరాల నుండి ఉచ్చరింపబడ్తున్న అమ్మ నామం ఎంత వినసొంపుగా ఉన్నదో ? పట్టుమని పది సంవత్సరాలు లేనివాళ్ళు, ఏడేళ్ళలోపువాళ్ళు డోలక్, హార్మోనియమ్ మొదలైన వాద్యాలను వాళ్ళేవాయిస్తూ నామం చేస్తుంటే చూడటానికెంతో ఇంపుగా ఉండేది ఆ దృశ్యం. ఈ పండుగ పది రోజులూ ధనుర్మాస ప్రసాదాలతో, వచ్చివెళ్ళే జనసందోహంతో ఒక ప్రక్క అందంగా ఆకర్షణీయంగా అలంకరించిన మందిరంలో పూటకో విధంగా అలంకరించిన వేదికమీద ఆసీనయైన అమ్మకు రెండు వేళలా

చేసే పూజలతో, మరో ప్రక్క రాత్రింబవళ్ళు వినిపించే నామంతో సందడిగా గడచిపోయింది.

సప్తాహం చేసినవాడు నూతలపాడు నుండి వచ్చిన బాలబాలికల బృందం. వాళ్ళు అంతకు పూర్వం కార్తికపూర్ణిమ, శివరాత్రి, అమ్మ జన్మదినోత్సవం మొదలైన పర్వదినాలలో వచ్చి ఏకాహం చేశారు. కాని సప్తాహం చెయ్యటం ఇదే మొదటిసారి. సప్తాహం అని తెలిసి నందిపాడు, రావిపాడు, వరంగల్ మొదలైన ఊళ్ళ నుండి కొన్ని భజన బృందాలు వచ్చి ఒకటి రెండు రోజులు పాల్గొన్నాయి.

ఆరవతేది ఉదయం 10-30కు ప్రారంభమైన సప్తాహం భోగి ఉదయం పదకొండు గంటలకు పూర్తి అయినది. ఆరోజే ధనుర్మాస ప్రసాదానికి చివరిరోజు అయినా పిల్లలంతా ఉన్నారని పండుగ అని అమ్మ ఆపై రెండురోజులు కూడా ప్రసాదం చెయ్యమన్నారు. భోగినాడు అందరికీ తలంట్లు పోయించి సంకీర్తన చేసిన ఆ బాలబృందానికి, పెద్దవాళ్ళకి బట్టలుపెట్టి అందులో అమ్మాయిలకు గాజులు వేయించి వాళ్ళకని చేయించిన రవ్వలడ్డులు పెట్టారు. ఇదంతా చూస్తూ అనుభవిస్తూ ఎంత సంతోషించారో, వెళ్ళేరోజున అమ్మను విడిచి వెళ్ళలేక అంతకంటే ఎక్కువగా దుఃఖపడ్డారు.

వాళ్ళు ఉన్నన్నిరోజులు అమ్మ మొదటగా వాళ్ళ ఆహార ఆరోగ్యాలను గురించి కనుక్కొనేవారు. వాళ్ళు వచ్చిన రోజు రాత్రే బృందానికీవిధంగా శిక్షణ నిచ్చిన నరసింహారావుగారిని పిలిచి వాళ్ళు భజనసరిగా చేస్తున్నారా లేదా అని చూచేకంటే వాళ్ళ ఆరోగ్య విషయంలో టైము ప్రకారము ఆహారము ఇవ్వటం విశ్రాంతి నివ్వటం చూస్తూ వాళ్ళకు బడలిక లేకుండా నామం చేయించమన్నారు, వారికి నామం చెయ్యటం ముఖ్యం అయితే తనకు వారి ఆహారం, ఆరోగ్యం ముఖ్యం అన్నారు.

భోగినాడు రాత్రి యోగన్నయ్య - రుక్మిణక్కయ్య వారి చిరంజీవి రహి, హైమా కలసి అమ్మకు పూజచేసి పాదాలమీద భోగిపళ్ళు పోశారు. ఆ తర్వాత అమ్మ, నాన్నగారి పాదాలమీద పళ్ళుపోసి నమస్కరించి తర్వాత మమ్మలనందర్ని వరసగా పందిట్లో కూర్చోబెట్టి భోగిపళ్ళు పోశారు. **- ఫిబ్రవరి, 1967**

# పూర్ణిమ

20వ తేదీ మధ్యాహ్నం సెలవులకు వాళ్ళ తాతగారి యింటికి వచ్చిన ఎనిమిది సంవత్సరాల పూర్ణిమ అవి ముగిసి తిరిగి గుంటూరు వెళ్ళబోతూ వాళ్ళ దొడ్లో పూసిన గోరింట పూలను మాలకట్టించి అది తీసుకొని అమ్మ దగ్గరకు వచ్చి అమ్మకు ఇచ్చి నిలబడింది. అమ్మ అది జడలో పెట్టుకుంటూ "వెళ్ళవుగాని కూర్చో" మనగానే కూర్చుచున్నది. కొన్ని క్షణాలు గడిచాక తనవంకే తదేక దీక్షగా చూస్తున్న ఆ అమ్మాయి నుద్దేశించి అన్నారు. "ఎందుకోసం వచ్చావు ఇక్కడికి" అని. వెంటనే ఏ సమాధానం ఇవ్వలేదు కాని కొంతసేపాగి మళ్ళీ అమ్మ తిరిగి ప్రశ్నించగానే "నీకోసం" అన్నది నెమ్మదిగా.

"నా కోసమా? ఎందుకూ?"

"నిన్ను చూడాలనిపించి"

"ఎందుకు చూడాలనిపిస్తుంది. వీళ్ళందర్నికూడా అలాగే చూడాలనిపిస్తుందా"

"లేదు"

"నన్నే ఎందుకనిపిస్తుంది. ఈ బొట్టా, ఈచీరా, ఈ గాజులు, ఈ సొమ్ములు ఇవి చూచా".

"కాదు"

మరి ఎందుకమ్మా ? – పూర్ణిమ మాట్లాడలేదు.

"నమస్కారం కూడా నాకే చెయ్యాలనిపిస్తుందా, అందరికా?"

"నీకే"

"ఎందుకూ?"

"............" చెప్పమ్మా, భయంలేదు.

"నువ్వుదేవుడవని"

"ఎందుకు దేవుడంటున్నావు? ఏం చూచి అంటున్నావు ?"

ఆ అమ్మాయి సమాధానం ఇవ్వలేదు. కాదు సమాధానం ఉన్నా వ్యక్తపరిచేశక్తి లేదు. అందుకే మౌనం వహించింది.

పూర్ణిమ వెళ్ళాక నేను అన్నాను అమ్మతో, ఆ విశ్వాసం అపర్ణను తలపిస్తుందని, అమ్మ అన్నారు అపర్ణకంటే కూడా పూర్ణిమ విశ్వాసం విశిష్టమైనదని. దానికి కారణాలు చెప్పారు. నిజమే అన్నయ్యా, అపర్ణకు కనీసం నివసిస్తున్న గృహ వాతావరణంలో నైనా ఆధ్యాత్మిక చింతనకు, దైవభక్తి తావు ఉన్నది. పూర్ణిమకు ఆ అవకాశమూ లేదు. ఆ పరిస్థితిలో పెరుగుతున్న ఆ పసిహృదయంలో నాలుగు సంవత్సరాల వయస్సున్నప్పుడే అమ్మ అంటే ఎనలేని భక్తిశ్రద్ధలు చోటుచేసుకున్నాయి. వాటిలోని పటుత్వం ముందు ఆ అమ్మాయి ఈ ఆవరణలో రావటానికి ఎవరు నిరోధించటానికి ప్రయత్నించినా వారికి ఓటమే ఎదురైంది. సెలవులకు ఈ ఊరు వచ్చినప్పుడల్లా అమ్మ సన్నిధిలోనే ఎక్కువకాలం గడుపుతుంది.

మరి ఆ పసిమనసుకు ఎందుకనిపించింది అమ్మ దైవం అని. ఇది చూడు: 30వ తేది సాయంకాలం అమ్మ వైకుంఠపాళి ఆడుతున్నారు. అదిచూచి "నీవు ఆడుతున్నావా అమ్మమ్మా ! నీకు ఆటలంటే ఇష్టమా?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించిన ఫణికి "అవును నాయనా నేను వచ్చింది అందుకే. నేను చేస్తున్నది అదే" అన్నారు నవ్వుతూ అమ్మ.

– ఫిబ్రవరి, **1967**


COURTESY VISWAJANANI TRUST

# మధుర సౌందర్య జలధి

విన్నావా అమ్మా !

నాప్రక్కనేస్తం హర్షపులకిత స్వరంతో చెప్తున్న మాట ఏమిటో ? వసంతం ప్రవేశించిందట. పరవళ్ళు త్రొక్కుతున్న ఆనందంతో ప్రకృతిని పలకరిస్తోందట సౌందర్యకాంత...

ఆ పూబాల అమాయకత్వానికి నాలో నేను నవ్వుతున్నాను – నీ సౌందర్యానికి అమ్మా ! ఈ సౌందర్యాలు సాటిరాగలవా అని.

**నీవు సౌందర్యమూర్తివి :** కాదనకు, నీ సౌందర్యము పూజనీయమయినది, పవిత్రమైనది, ప్రశాంత మనోజ్ఞమైనదే కాదు; అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక మధురభక్తి భావనలకు ఆలంబనమైనది, జ్యోతిర్మయివైన నీవో విశిష్టజ్ఞాన సౌందర్యజలధివి. అందుకే అఖిలప్రాణికోటి నీ పాదాలముందు మోకరిల్లి అంజలి ఘటిస్తోంది నేడు.

**నీవు సుహాసినివి :** నీ మందహాసంలోని మధురరాగసుధలు ఋజువు పరుస్తాయి. నీవే ఈ సృష్టిస్థితిలయకారిణివని. 'కాదు అబద్ధం' అంటావు చిరునగవుతో. అవును నీవు నవ్వగలవు. నీవు నవ్వినట్లు మరెవ్వరూ నవ్వలేరు. ఈ సృష్టినీది. నీ కేళీ విలాసార్థమై ఏర్పరచుకున్న ఈ ఆటను చూచి ఎవరు నవ్వగలరు ? ఇంకెవరు ప్రేమించగలరు ?

**నీవు సుభాషిణివి :** నీ మహత్తర మధురవాణి నిరూపిస్తుంది నీవు అజరామర చైతన్యస్రవంతివని. అందుండి ఉద్భవించే సందేశాలు, బోధనలు గాఢతమోవృతమైన హృదయాలలో వెలుగులు దీపింపజేసే దివ్యజ్యోతి కిరణపుంజాలు, సకల వేదశాస్త్రసారాన్ని ఒకే ఒక మధురోక్తిలో చెప్పగలిగే చాతుర్యం, భారమైన జీవితాన్ని అనుభవిస్తూ గమ్యమాలోచించక ప్రయాణించే పథికుల పెదవులపై చిరునవ్వులు అంకురింపచేసే శక్తి నీ అమృతవాణిలోనే ఉన్నది. ఆ నీ వాణి అందరి హృదయ మందిరాలలో సర్వదా ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది.

**నీవు సులోచనవి :** నీ నేత్రాంచలాలలో జాలువారే అనురాగం వ్యథాభరిత హృదయులైన నీ పాదాశ్రితులకు ఓదార్పు నివ్వడమే కాదు వారి శిథిల

హృదయాలలో వసంతం విరియించగలరు. వాత్సల్యసుధలు చిలికే తేజోపూరితమైన నీ నయనయుగళిని గాంచి హృదయాలు ఆనందోద్వేగంతో పులకరిస్తుండగా నోరారా నిండుగా అమ్మా అని ఎవరు పిలవకుండా ఉండగలరు ?

**నీవు సుందరాంగివి :** సుందరమూ సుకోమలమూ అయిన నీ పావనకర – చరణాలలో ఎంతటి శక్తిగలదమ్మా ! సంకుచిత హృదయాలను క్షాళన మొనర్చి మానవతా మమతలను కుసుమింపజేయగలవు. నీ స్పర్శలో అనుభవమయ్యే అవ్యక్తమైన అమూల్యమైన దివ్యానుభూతి పావనుడ్నేకాదు పతితుడినీ చరితార్థుడ్ని చేయగలదు.

**నీవు సుందరివి;** సుందర నయనవు; సుందరభాషిణివి, సుందరహాసినివి; సుందరహస్తవు, సుందర చరణవు మాత్రమే కాదు –

నీలోని ప్రతి అణువూ సుందరమూ ప్రతికణమూ మధుర మధురమూ– అందుకే అంటాను.

నీవు మధుర సౌందర్య జలధివి.

**– ఏప్రిల్, 1967**


COURTESY VISWAJANANI TRUST

# రవీంద్రనాథ్

మహనీయుల దర్శన మాత్రముననే జన్మ తరిస్తుందంటారు. మరివారి దర్శనమే కాక తత్పావన పాదసన్నిధిని ఉండే సేవ చేయగలగే అవకాశము, తమ జీవిత చరమాంకానికి అక్కడే యవనిక కూడ దింపబడే భాగ్యము కలిగిన వారిని గూర్చి ఏమని వర్ణించగలం ?

అమ్మ సాన్నిధ్యంలో ఆ విధంగా జీవితానికి భరతవాక్యం చెప్పబడిన వారిలో శ్రీ పోతుకూచి విద్యాసాగర్ రాజ్యలక్ష్మమ్మగారి జ్యేష్ఠపుత్రుడు రవీంద్రనాథ్ ఒకడు.

అతని జీవనదళం అమ్మ చరణాల చెంతన చేరేటప్పటికి అతని వయస్సు పదహారు సంవత్సరాలు. ఆ తర్వాత గడిచిన ఆరు సంవత్సరాలు – స్వల్పకాలమే అయినప్పటికి ఈ వ్యవధిలోనే అమ్మే జగధాధారమైన శక్తి అనే విశ్వాసం అతనిలో భావనామాత్రంగా కల్గించటమే కాక అందులో అతనిని జీవింపచేసిన సంఘటనలతో అతని చరిత్రను కూర్చారు.

ఆ వ్యక్తిత్వంలోని ఆ ప్రత్యేకతే రవి లేని లోటు ఈ ఆవరణకో పెద్ద అగడ్తనే సృష్టించింది. ఆదళ పరిమళమే అమ్మ చరిత్రలో మరొక పుట చదివింప చేస్తోంది.

ఏదైనా సరే ఒక నూతన విషయాన్ని గూర్చి వినటంగాని, కనటంగాని అమితమైన ఆసక్తి, కుతూహలాలు ఉండేవి రవికి. 1960 లో మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్తున్న రవి ఒక బామ్మగారి ద్వారా అమ్మను గూర్చి మొదటి సారిగా వినటం జరిగింది. చూడాలన్న ఆసక్తి కలిగినా అవకాశం లేదు కనుక అంతగా దానిని గురించి ఆలోచించలేదు. కాని 61లో అమ్మను దర్శించిన తండ్రి తాను పొందిన అనుభూతిని వర్ణించి చెప్తుంటే శ్రోతయైన రవి ఆ అదృష్టం తనకు కలుగుతుందా అనుకున్నాడు. అదే మననం చేసుకుంటూ నిద్రించిన ఆ రాత్రి స్వప్నావస్థలో అమ్మ సాక్షాత్కరించింది.

ఆ మర్నాటి ఉదయం ప్రక్కవారింటికి వెళ్ళి అమ్మ ఛాయాచిత్రాన్ని పరిశీలనగా చూశాడు. రాత్రి తాను చూచిన అమ్మకు ఈ చిత్రానికి పోలిక లేదు. ఆశ్చర్యపడ్తూనే అనుకున్నాడు. ఈ చిత్రాల రూపంలో కంటే తండ్రి చెప్పిన జిల్లెళ్ళమూడిలో చిన్న పర్ణశాలలో మంచంపైన కూర్చున్న అమ్మనే ఒకసారి చూస్తే బాగుండునని. అనుకోవటమే కాదు తపించసాగాడు. తీరా ఆ అవకాశమే

లభ్యమైనప్పుడు ఆనాటి వాతావరణాన్ని బట్టి తన అనారోగ్యరీత్యా వెళ్ళటానికి సందేహించాడు కాని తండ్రి చిరాకు అతనిలో పట్టుదల కలిగించగా నాలుగున్నర మైళ్లు మోకాలిలోతు రేగడి బురదలో నడచి ఆరోజునే – అంటే 1961లో నవంబరు ఒక సోమవారం నాటి – ఉదయం జిల్లెళ్ళమూడిలో అడుగుపెట్టాడు.

వెంటనే అమ్మ దర్శనమైనది. తాను స్వప్నంలో కాంచినది సర్వాంగభూషితయై నిమీలితనేత్రయైన సింహాసనాసీనయైన అమ్మను, ఇప్పుడు చూస్తున్నది నిర్మలమైన చిరునవ్వుతో, నిరాడంబరమైన అలంకరణతో నిండుగా ఉన్న అమ్మను, కాని రెండు రూపాలలో తాను చూసింది ఒకే తేజస్సును. రవి ఆశ్చర్యపోగా అనిర్వచనీయమైన ఆనందాబ్ధిలో మునిగిపోయాడు. అమ్మ సుందరమైన కోమలమైన పాదాలను చూసి ముగ్ధుడౌతూ ఆ సన్నిధిన ఉండే అవకాశం అవస్యం కావాలనుకుంటున్న రవి భావం గ్రహించినట్లుగా అమ్మ అతని శిరస్సును ఆప్యాయంగా నిమురుతూ ఒడిలోకి తీసుకున్నారు – 62 జనవరిలో అతని కోరిక సఫలమైనది.

మొదట్లో అమ్మని రవి తలెత్తి సూటిగా చూడటానికి బిడియపడేవాడు. కాని తలవంచుకొని కూర్చున్నా అమ్మ కదలికను, చూపులను, నిశితంగా పరిశీలిస్తూ, మాటలను జాగ్రత్తగా వింటూ వాటి వెనుక దాగిన అర్థాల గురించి ఆలోచించే దానిలో ఆ భావాల్ని అమ్మ ఎప్పుడూ తొలగనివ్వలేదు. కనుకనే అమ్మ “మానవీ” రూపంలో ఉన్న “మాధవి” అని గుర్తించాడు. తనలోని లోపాలను కల్మషాలను క్షాళన మొనర్చి స్వచ్ఛంగా రూపొందించమని ప్రార్థించేవాడు. ఆ ప్రార్థన ఫలించింది. అలాగే అతని మనస్సునే ఒక కర్పూరకళిక గావించి తనకై ఆత్మార్పణం చెయ్యగలిగిన శక్తి అమ్మ ఇచ్చారు. అతని విశ్వాసానికి తగినట్లే ఉండేవి అతని అనుభవాలు కూడా. రోగము ఒకటి ఔషధం ఒకటి ఉపయోగించటం వలన బాల్యావస్థలోనే హృద్రోగపీడితుడయ్యాడు రవి. ఆ తర్వాత ఎన్నిరకాల ఔషధాలు, చికిత్సలు చేసినా ప్రయోజనం లేని ఫలితమే ఎదురైంది. పెరుగుతున్న రవిలో ఏవేవో ఆశలు, ఆశయాలు పరుగులు తీస్తున్నా గుండెజబ్బును బట్టి వాటికి పగ్గాలు వెయ్యక తప్పలేదు. కాని ఇక్కడకు వచ్చాక ఈ వాతావరణ మెంతో నచ్చింది. అమ్మ ఆత్మీయమైన ఆదరణలో అతనిలోని అసంతృప్తి తొలగిపోయింది. అంతేకాక ఇక్కడే 62లో బాగా జబ్బు చేసి మృత్యువాతపడబోయిన తనని ఈ మందులు కాక అమ్మ వాత్సల్యం, ఆ చల్లనిస్పర్శా, ఆ తీర్థ కుంకుమలే తనను బ్రతికించాయని

తనకు కలిగిన అనుభవాల్ని బట్టి రవి నిశ్చయించుకున్నాడు.

తన ఆరోగ్యనారోగ్యాలు, డాక్టర్ల మందులమీద కాక అమ్మ అనుగ్రహం మీద ఆధారపడి ఉన్నదన్న నమ్మకం కలగగానే ఆ జబ్బు తగ్గిన నాటి నుండి అంతకు పూర్వం తనకు అలసట కలిగించని పనులు చేస్తుంటే రవి దాదాపు ఆవరణలో జరిగే పనులన్నింటిలో పాల్గొన ప్రారంభించాడు. ఏపని చేసినా కేవలం ఉత్సాహాన్నే కాదు; శ్రద్ధా, దూరపు ఆలోచనా కనపరుస్తుండేవాడు. ఏ రోజు కారోజు తన దినచర్య పుస్తకంలో ఆ పనుల గురించి రాసుకునేవాడు.

రవిలోని ఆ కార్యదీక్షకు, కర్తవ్యపాలనకు అమ్మ ఎంతో ముగ్ధురాలయ్యేవారు.

ఒక్కొక్కసారి రవి తనని తాను మర్చిపోయి బాగా అలసటా బాధా కలిగించే బరువు పనులు చేస్తుండేవాడు. అప్పుడు రవి కెట్లాగుండేదో కాని, అమ్మ అన్నట్లు నాలుగు గోడల మధ్య కాక ఎడారిలో కాపురం చేస్తున్న ఎండుటాకులా ఉన్న ఆ గుండెతో, ఏక్షణాన ఊడి క్రింద పడ్తుందో అన్న దడతో రవి ఆ పనులు చేస్తుంటే అమ్మ చూసినా, లేక తెలుసుకున్నా బాధపడేవారు. పిలిచి మందలించేవారు. తేలిక - బరువు అనే భేదం లేకుండా అసలు పనిచెయ్యటమే వద్దు అనేవారు. రెండు రోజులు ఊరుకున్నా మూడో నాడు మళ్ళీ ఏదో పనిచేస్తూ కనిపించేవాడు.

ఆరోగ్యంలాగే ఆహారాన్ని గూర్చి పట్టించుకునేవాడు కాదు రవి. ఉప్పు, కారం లేని భోజన మతనిది. వడ్డించేవాళ్ళు శ్రద్ధ తీసుకోవాల్సిందే తప్ప ఏది వేసి పెట్టినా తినేవాడు.

అతని ఆలోచనలు ఎప్పుడూ ఈ ఆవరణ - దాని ప్రగతి - చుట్టూ పరిభ్రమిస్తుండేవి. అర్కపుర ఉజ్జ్వల భవిష్యత్తుకై పసిడి కలలు కంటుండేవాడు. ఈ ఆవరణలోని ఏ పనిచేసినా అది అమ్మను అర్చించటమేనని అందులో తాను మనస్ఫూర్తిగా చేస్తూ అందరూ అలాగే చెయ్యాలనేవాడు. ఎవరికైనా ఇక్కడ పనుల పట్ల గౌరవభావం లేకపోయినా, వాటిలో అశ్రద్ధా, అలక్ష్యం చూపినా వాళ్ళు ఎవరైనా సరే రవి సహించలేకపోయేవాడు.

క్రమంగా పశువుల పోషణ పనిలో ప్రవేశించాడు. ఈ భాగమే తన జీవితంలో ఒక మలుపు అటుండేవాడు రవి. ఈ రోజుల్లోనే అందర్ని ఆశ్చర్య పరచి, ఆలోచింపచేసే సంఘటన ఒకటి జరిగింది.

1963లో జిల్లెళ్ళమూడి వరదచే చుట్టబడింది. వరద కాస్త తగ్గుముఖం పట్టగానే పశువులను తోలుకెళ్ళసాగారు కాలవవైపు గొడ్లకాపరులు. రవీ వెళ్ళాడు. కాలవ అవతలిభాగంవైపు వెళ్ళి పశువులను మేపి తిరిగివస్తూ కాలవలో దిగుతుండగా ఆ నీటివేగానికి ఆవు బెదటరంతో రవి తోక వదిలివేశాడు. వెంటనే నీటిలో మునిగిపోయిన అతడు 6 గజాలలోతు వెళ్ళాక తగిలిన ఒక మట్టిపుట్టను గట్టిగా పట్టుకొని అమ్మ నామస్మరణచెయ్యసాగాడు. స్పృహకోల్పోకుండా, నీరు త్రాగకుండా ఆ స్థితిలో అక్కడ దాదాపు 20 నిమిషాలు ఉన్నాడు. ఇంతలో అతని స్నేహితుడొకడు వచ్చి ఒడ్డుకు తీసుకురావటం జరిగింది. కాని ఈ సంఘటన తర్వాత రవిలో చాలామార్పు కనిపించింది.

అమ్మవద్ద అంత చొరవ తీసుకోవటం అధిక ప్రసంగం చెయ్యటం అతనికి అలవాటు లేదు. అమ్మతోనే కాదు; ఎవరితో మాట్లాడినా తూచినట్లుగా మాట్లాడేవాడు. ఉదయ సంధ్యాకాల ప్రార్థనలలో తప్ప అమ్మ పిలిస్తే కాని ఆ వైపుకు వచ్చేవాడు కాదు. ఏవైనా పనులవలన రాలేని సమయాలున్నప్పుడు ఆ పని చేసుకుంటూ ప్రార్థనచేసేవాడు. చివరి దశకూడా (ఫిబ్రవరి) 19వ తేదీ ఉదయం సుప్రభాత పఠనలో పాల్గొన్నాడు.

ఎప్పుడూ ఏదో పనిచేస్తూ, అమ్మ నామమో అమ్మ పాటలో పాడుకుంటుంటే ఆ ధ్యానమే ఆవరణలోనే ఉంటున్నా రవి అమ్మ చెంతకు రానవసరం లేకుండానే అమ్మనే రవి దగ్గరకు తీసుకెళ్ళింది. అంటే మేము ఇక్కడ చూస్తున్న అమ్మను అదే కాలంలో కాలువ ఒడ్డున రవి చూస్తుండేవాడు.

అమ్మ రూపదర్శనం కంటే ఆ స్పర్శలోని హాయి తాను ఎక్కువగా అనుభవిస్తుండే వాడినని చెప్తుండేవాడు. ఏ రోజైనా మామూలుకంటే గుండెనొప్పి, ఆయాసంకాని మరేబాధైనా కానీ ఎక్కువగా పడ్తున్నప్పుడు అమ్మ హస్తస్పర్శలోని సుఖానుభూతి అనుభూతమయ్యేది.

నిద్రపట్టని రాత్రులలో అమ్మ తియ్యని పలకరింపు అతనికి జోలపాట పాడేది. పొలానికి కావలి అవసరమైన రోజుల్లో అది యెంత చిక్కని చీకటి రాత్రియైనా సరే ! రవి వెళ్ళటానికి వెనుకంజ వేసేవాడు కాదు. దారిలో ఎదురయ్యే ఒక సన్నని వెలుగు ప్రకాశంలో సురక్షితంగా పొలం చేరేవాడు.

ఇటువంటి అనుభవాలు అనేకం కలిగిన రవి వాటిని గూర్చి అతిశయోక్తులు చేర్చి ఎవరికీ ఎప్పుడూ చెప్పలేదు. చాలాకాలం తర్వాత తనకు సన్నిహితులైన ఒకరిద్దరు మిత్రులతో ఏదో ప్రసంగవశాన చెప్పటం జరిగింది. వారు ఇవన్నీ విని ఆశ్చర్యపడ్తుంటే "ఇందులో ఆశ్చర్య పడాల్సిన అవసరం ఏముంది ? ఇంత సృష్టినే చెయ్యగాలేనిది ఇవన్నీ ఓ లెక్కా వాడికి" అని తేలికగా నవ్వేశేవాడు. "వాడు" "దేవుడు" "పరమాత్మ" అని అమ్మను గూర్చి అనేవాడు రవి.

1966లో జూన్ 20 నుండి బాపట్లలో మాతృశ్రీ ముద్రాక్షరశాల ప్రారంభింపబడినది. అక్కడి పనివారితో బాటు ఇక్కడివాళ్ళు ఒకరిద్దరు ఉండటం మంచిదని అభిప్రాయపడినప్పుడు అందులో రవి ఒక్కడే జూన్ 15న ఇక్కడ నుండి వెళ్ళాడు. వెళ్ళేముందు రవి కొన్ని క్షణాలు గొడ్లను, ఆ సావిడిని వదిలి వెళ్ళలేక మూడు సంవత్సరాలుగా వాటికీ, తనకీ మధ్య కల్గిన అనుబంధపు మమతతో బాధపడినా వెంటనే కర్తవ్యం అతన్ని హెచ్చరించటంతో ప్రెస్‌లో అడుగు పెట్టాడు. నిండు మనస్సుతో పనిచేయ నారంభించాడు. ఆ మనస్సే అక్కడకు తీసుకెళ్ళింది అమ్మను. పగలల్లా తనను తాను మర్చి శ్రమించిన రవిని రాత్రిపూట అమ్మ వెళ్ళి సేదతీర్చేవారు.

"ఆ బలంతోనే తాను ఆ ఆర్నెల్లు అయినా పనిచేశా" నన్నాడు. డిసెంబరు మూడున రాత్రి బాపట్ల నుండి ఇక్కడకు తిరిగివచ్చిన రవి అప్పటికే నాలుగు రోజుల నుండి అస్వస్థతగా ఉన్నా అది మభ్యపెట్టి పనిచేస్తుంటే అది బయటపడటం, ఆ సంగతి తెలిసి అమ్మ కబురు చెయ్యగానే రవిని ఇక్కడకు తీసుకురావటం జరిగింది. ఆ తర్వాత రెండు నెలల్లో నాలుగైదుసార్లు ఎక్కువ కావటం తగ్గటం జరిగింది.

భరించలేని బాధ కలిగినప్పుడు ఈ జీవితం ముగిసిపోతే బాగుండునని చాలా అరుదుగా అనుకునేవాడు. కాని మనస్ఫూర్తిగా ఎప్పుడూ దాన్ని కోరలేదు కాని తనగుండె పరిస్థితిని బట్టి ఏ క్షణంలోనైనా తాను మృత్యువు వాత పడ్తానన్న నిజం అంతకుముందు ఉండేదట ! కాని ఇక్కడకు వచ్చాక తగ్గిపోయిందట. పైగా అందులో అతనికి జరిగిన సంఘటనలు తనకిప్పట్లో మరణం లేదని ధైర్యాన్ని కల్పించాయి. అందుకనే ఫిబ్రవరి 20వ తేదీ నుండి అతని జబ్బు తిరిగి తన తీవ్రతను చూపిస్తున్నా దానిని అణచటానికి ఏ మందు త్రాగమన్నా, ఏ చికిత్స

చేసినా అవి ఎంతో బాధ కలిగిస్తున్నా, చివర్లో వీటివల్ల తనకు ప్రయోజనం లేదని తెలిసినా కొంత అక్కయ్య తృప్తికోసం కూడా ఎంతో సహనంతో చేశాడు. రవితత్త్వమే అంత. సాధ్యమైనంతవరకు తనవలన ఇతరులకు బాధకలగకుండా జాగ్రత్తపడేవాడు. ఆ భావమే అమ్మ దైవమనే విశ్వాసమున్నా ఈ విశ్వకుటుంబంలోని ఆవరణ వివిధరకాల ప్రవృత్తుల వలన అమ్మ సున్నితమైన తనువు, మనస్సు ఎక్కడ బాధపడ్తుందో అని బాధపడేవాడు అమ్మను గూర్చి.

రవి చనిపోయేముందు తమాషాగా నాలుగురోజులలో రెండు వివాహాలు రెండు ఉపనయనాలు జరిగాయి. 24న వర్ఘూ శివరామయ్యగారి జ్యేష్ఠపుత్రుని వివాహం. నాటిరాత్రి రవి సోదరి డాక్టర్ జ్యోత్స్న తాను చెయ్యగలిగిన ప్రయత్నాలన్నీ చేసి ఆశలు వదులుకున్నది. ఆ చివరి గడియల్లో అమ్మ మరో చిత్రమైన అనుభవాన్ని ఇచ్చారు రవికి. నాడి స్థానం తప్పి, శరీరం చలువలుక్రమ్మి శ్వాసపీల్చటంలో మార్పు ఏర్పడిన ఆ సమయంలో కూడా రవి బాహ్యస్మృతి కలిగి ఉన్నాడు. ఏది ప్రశ్నించినా సమాధానాలు చెప్పసాగాడు. అంతబాధలోనూ జ్యోత్స్న తన సోదరుని ఈ స్థితిచూచి ఆశ్చర్యచకిత అయితే రవి అనుకున్నాడు తనకు శుభాశుభాలు రెండూ సమానమే అన్న అన్నమాట అనుభవంలో చూస్తున్నానని.

వివాహ వేదిక మీదకు వచ్చే ముందు అమ్మ రవి కోరినట్లు తెల్లపట్టుచీర, పట్టెడు జరీ అంచు ఉన్న నల్లనిరవిక ధరించి రవి దగ్గరకెళ్ళి కూర్చున్నారు. ఈ నాలుగురోజులు దాదాపు రోజులో ఎక్కువభాగం అమ్మ రవి దగ్గరే కూర్చునేవారు. రాత్రి ఒక అరగంట కాలం మాత్రం తాను ఒక్కరే రవి వద్ద కూర్చున్నారు. అమ్మ కూర్చొని వచ్చాక రవిలో మార్పు కనిపించింది. అంతా రవి గట్టెక్కాడనుకున్నారు కాని ఆ మార్పు అంతిమప్రకాశమని ఎవరికి తెలుసు ?

ఆ రాత్రి నుండే 'సమయం ఎంతైందీ' అని ప్రతి గంటకు రవి అడుగుతుంటే ఎందుకో అనుకున్నాము గాని అమ్మ రవికి అతని అంత్య సమయమెప్పుడో చెప్పారనీ, దానికోసం అతడు అలా అడుగుతున్నాడనీ ఆ మర్నాడు రవి అస్తమయ సమయానికి గాని మాకు తెలియలేదు. చివరిదశలో రవి చెంతనే ఉన్నారు అమ్మ. అమ్మ వేసిన తీర్థం త్రాగి అమ్మ ఒడిలోనే ఇహలోక బంధనాల నుండీ, బాధల నుండీ విముక్తి పొందాడు. 1967 ఫిబ్రవరి 25వ తేదీ సూర్యాస్తమయవేళలో అమ్మ తనలో విలీనం చేసుకున్న రవికి– కాదు ఆ భౌతిక మృతదేహానికి – అంత్యక్రియలు దగ్గర

నుండి జరిపించారు. తానే స్వయంగా కర్పూరహారతితో చితికి నిప్పు అంటించారు. రవి జన్మ చరితార్థమైనది. అతని తనువూ మనస్సూ ధన్యత నొందాయి.

అయితే అంతిమ సమయం తెలిసీ, రోజులో ఒక్కొక్క గంట జరుగుతున్న కొద్దీ బాగా శుష్కించపోయిన రవిలో వికాసమే తప్ప మరణభీతి కనిపించలేదు. మరి జీవితాన్ని ఆశించిన రవి అది తెలిసీ ఎందుకంత నిశ్చలంగా, నిర్వికారంగా ఉన్నట్లు ?

తన ప్రయాణం ముగిసి గమ్యస్థానమే చేరుతున్నప్పుడు ఇంకా భీతి ఎందుకనే భావనే అయి ఉండవచ్చు. మనస్సు అర్పణమైంది – మిగిలిన శరీరము ఈ గడ్డమీదనే దగ్ధమై పోవాలన్న ఆకాంక్ష కావచ్చు. అమ్మ చెప్పారు కనుక తాను చూడకపోయినా ఒకనాటికి తన బంగారు కలలు నిజమౌతాయన్న తృప్తి కావచ్చు. అమ్మ అన్నారు – "వాడు ఎక్కడికి పోయాడని బాధపడ్తున్నారు. వాడు నా దగ్గరే ఉన్నాడు."

ఆరిపోయే ముందు దీపం వెలుగు ప్రజ్వలంగా ఉండి తన ఉనికిని గుర్తింప చేసుకుంటుంది. అలాగే రవి అతని అంతిమదశలో అందరిచేత గుర్తింపబడ్డాడు. తన బహిఃప్రాణంగా ప్రేమించిన సోదరి జ్యోత్స్న గుండెల్లో ఆరని చిచ్చు రగిలించిన అతని మరణానికి మిత్రులు, పరిచయమున్నవాళ్ళు, లేనివాళ్ళు అంతా దుఃఖిస్తున్నారు. ఎందుకూ ? అతనిలో చెప్పుకోదగిన గుణగణాలను చూచి.

రవి మరణానంతరము నామసప్తాహం చేయించారు. అది పూర్తి అయిన మరుసటిరోజు శివరాత్రి, నాటికి రవి మరణించి పదమూడు రోజులైనవి. ఆ రాత్రి ప్రభ ఊరేగింపులో రవితో అమ్మ తీయించుకున్న ఛాయాచిత్రమొకటి ప్రముఖ స్థానాన్ని అలంకరించింది.

రవి చనిపోతూ తనలాగే చావుబ్రతుకుల ఘర్షణ మధ్య నలుగుతున్న వికాలంగుడైన వెంకన్నకు కూడా ఆ స్థితి నుండి త్వరలో విముక్తి కలిగించమని కోరాడు. అదీ నెరవేరింది శివరాత్రినాటి సంధ్యాసమయంలో.

**– మే, 1967**

# ప్రాణదానం

అన్నయ్యా,

అమ్మ అన్నట్లు 365 రోజులు పండుగరోజులే అయినా ఆషాఢమాసం వచ్చిందంటే తొలి ఏకాదశితో ఇక పండగలు ప్రారంభం కాబోలు అని అనుకోకుండా ఉండలేము మనం.

ఈ నెల 17వ తేదీన జరిగిన తొలి ఏకాదశినాటి తొలకరి చినుకులకు పృథ్వి పులకరించిందో కాని ఆ ఉదయం జరిగిన ఒకానొక సంఘటనకు ఆవరణలోని వారేమిటి ఆనాటి నూతనాగతులేమిటి అంతా కొన్ని క్షణాలు భయకంపితులయ్యారు.

ఆరోజు జనసంఖ్య హెచ్చుగా ఉండటంతో పూజకు మందిరంలో ఏర్పాటు చేశారు. అదేరోజు అమ్మను సందర్శించాలని వరంగల్ జిల్లా నుండి వచ్చిన దాదాపు ఓ ఏభై మంది జనం మందిరంలో ఒక వైపు కూర్చోని భజన చేస్తున్నారు. మరోప్రక్క మా బృందం నామం చేస్తూ పాటలుపాడుతున్నారు. ఇంకో వైపు అమ్మకు పూజలు జరుగుతున్నాయి. పూజ పూర్తి అయి అమ్మ తీర్థ ప్రసాదాలు ఇస్తున్న తరుణంలో బృందం సంకీర్తన ఆపినందువల్ల మైకు ఉపయోగం తీరినందునా కరెంటు ఖర్చు అనవసరంగా అవటం ఎందుకని నరసింహారావు మాష్టరుగారు ఆంప్లిఫైర్‌లో నుండి ప్లగ్ తియ్యబోయారు. అది పూర్వంలా బ్యాటరీ సిస్టం మీద కాక కరెంట్ సిస్టిమ్ మీద ఇచ్చిన కనక్షన్ అన్న విషయం మర్చిపోయి. ఇంకేమున్నది ? వెంటనే ప్లగ్ పిన్నులు కుడిచేతి బొటన వ్రేలుకు అతుక్కుపోయినాయి. మాష్టరుగారు "అమ్మా" అని కేకపెట్టి క్రిందపడి పోయారు. అంతా కొద్దిక్షణాల కాలంలో జరిగిపోయింది. ఆ పడటంలో మాష్టరు గారి శరీరం మరో ముగ్గురు నలుగురికి తగలటం, వారి శరీరంలో ప్రవహిస్తున్న విద్యుత్తు వారికీ తగలటమూ వాళ్ళూ కేకలు పెట్టటం, క్రొత్తగా వచ్చిన వారు ఈ దృశ్యం చూచి భయకంపితులై కంగారుగా మందిరం వెలుపలికి పరిగెత్తటం, ఎందుకు తోచిందో మరి ఈ గొడవంతా కరెంట్ మూలాన్న అని – బాల పరిగెత్తుకు వెళ్ళి మెయిన్ స్విచ్ ఆఫ్ చేసింది. ఇదంతా జరిగేటప్పటికి కొద్ది క్షణాలు పట్టింది. తన ఎదుట జనం అంతా ఇంతా హడావుడిగా చిందులు త్రొక్కుతున్నా కంగారుగా

పరుగులు తీస్తున్నా అమ్మలో మాత్రం ఏ విధమైన కదలిక కనిపించలేదు. పూజలు జరుగుతున్నప్పుడు ఏ విధంగా కూర్చున్నారో - నిశ్చలంగా నిర్వికారంగా అదే విధంగా జరుగుతున్నదంతా చూస్తూ కూర్చున్నారు. మాష్టరు గారి తల్లి అమ్మ పాదాల మీద వాలి ఇదేమిటమ్మా అని దుఃఖిస్తుంటే అమ్మ అన్నారు ఆ వృద్ధురాలి తల నిమురుతూ "ఏముంది, చూడు అబ్బాయి లేస్తున్నాడు" అని. అమ్మ అధరాలను దాటి ఆ మాట వెలుపలికి వచ్చిందో లేదో ఆ మరుక్షణమే మాష్టరు గారు లేచి కూర్చుని అమ్మను చూసి నవ్వుతూ మళ్ళీ సృష్టించావా అమ్మా అంటూ వెళ్ళి పాదాలమీద వాలారు.

కొన్ని క్షణాల కాలంలో శరీరంలో విద్యుత్తు ప్రవహించినా జీవించియుండటం సరే ఈ సంఘటనవలన మాష్టరుగారిలో శారీరకమైన మార్పు ఏమీ జరగలేదు. దీనికి పూర్వం ఎలా ఉన్నారో ఇప్పుడూ అలాగే ఉన్నారు.

రెండు రోజుల తర్వాత అమ్మ వద్ద దీని గూర్చి ప్రస్తావన వచ్చినప్పుడు ఆయన తన అనుభవాన్ని చెప్పారు.

ఆపాదమస్తకం విద్యుత్ సంచలనం కలిగించిన ఆ క్షణంలో తను మరణిస్తున్నానని తెలిసినా అమ్మ సాన్నిధ్యంలోనే కదా అన్న భావన తనకు తరగని తృప్తినే కాదు చెరగని చిరునవ్వునూ పెదవులపై నిల్పిందిట. స్పృహ కోల్పోయిన క్షణం తర్వాత తనకు ఏం జరిగిందీ తెలియదు. వస్తున్న క్షణంలో అమ్మ తన ఎదుట నిలబడి ప్రశాంత గంభీరవదనంలో చిరునవ్వు లాస్యం చేస్తుండగా "లే నాయనా" అంటూ హస్తమందించారు. 'అమ్మా' అంటూ ఉత్తరక్షణంలో మాష్టరుగారు లేచి కూర్చున్నారు.

ఆయన అంటారు ఈ అనుభవం ఇంకా తనలో ఏదైనా తనకు తెలియకుండానే అంతరాంతరాలలో ఏమూలనన్నా అమ్మను గురించి సందేహమేదన్నా ఉంటే అది నిశ్శేషంగా నివృత్తి కావటానికి ఇదొక పాఠమని.

వారు అనుకునేవారట - అమ్మ అనేకమందికి అనేకరకాల అనుభవాలు ఇస్తున్నారు గదా నాకు ఒకటైనా ఇవ్వరేమిటని. ఇప్పుడిది మరుపురాని మధురమైన అనుభవమే అన్నారు నవ్వుతూ.

ఇక్కడ యింకో ముఖ్యవిషయం - అమ్మ అందరికీ తీర్థాలు వేస్తున్నారు. రామకృష్ణ అన్నయ్య తీర్థం పాత్ర పట్టుకుని ప్రక్కన నుంచున్నాడు. మధ్యలో అమ్మ 2, 3 సార్లు అన్నయ్యతో మాష్టరుగారిని తీర్థం వేయించుకోవటానికి పిలవమన్నారు. కాని అన్నయ్య త్వరపడి వేయించుకునే వాళ్ళను ఆపి ప్రక్కగా నుంచున్న మాష్టరుగారిని పిలవటం మెందుకని పిలవలేదట. అంతలో యీ ఘటన జరిగిపోయింది. అప్పుడు అమ్మ మాట ప్రకారం మాష్టరుగారిని తీర్థం కోసం పిలిచినట్లయితే, యీ ప్రమాదం తప్పి ఉండేది. కాని యీ విషయంలో అన్నయ్య అంటాడూ ముందు జరుగబోయే సంగతి అమ్మ సూచించినా, మనం తప్పుకోలేమని మనకు పాఠం చెప్పటం కోసం అట్లా చేసిందని.

ఏమయితేనేమి - ఒక్క సంఘటనే అనేకులకు అనేక రకాల పాఠాలు కాగలిగింది.

మాష్టరు గారిని గురించి ఫిబ్రవరి లేఖలో నీకు నూతలపాటి బాల భజన బృందానికి శిక్షణనిచ్చిన అధ్యాపకులుగా పరిచయం చేశాను. అప్పటినుండి అమ్మ సన్నిధిలో కుటుంబ సమేతంగా ఉండాలనుకున్న వారి ఆకాంక్ష ఆరుమాసాలు గడవకముందే నెరవేరింది. నూతలపాటి నుండి ఈ ఊరి పాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగా బదిలీ అయ్యారు. 11వ తేదీ సాయంత్రం కుటుంబంతో ఈ ఊరు వచ్చారు. 12వ తేదీ ఏకాహం చేశారు.

- ఆగష్టు, **1967**



# శుభాశుభాలు రెండూ సమానమే

ప్రాప్తం అంటే ఇట్లాంటిదే కాకపోతే ఇక్కడి విషయాలు నీకు వినిపింపచేసి అప్పుడే నాలుగు నెలలు గడచిపోతాయా ? మొత్తం మీద ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్, మే నెలలు సందడిగానే గడచిపోయాయి శుభాశుభకార్యకలాపాలతో.

అదేమిటి అని అంతగా ఆశ్చర్యపడకు మరి. ఎన్నోసార్లు అమ్మ ఈ ఆవరణను గూర్చిన ప్రస్తావనలో – "ఇది విశ్వకుటుంబం కనుక విభిన్న మనస్తత్వాలకు ఎలా నిలయమో అలాగే ఇక్కడ శుభాశుభకార్యాలు రెండూ జరుగుతాయనీ ఆ ద్వంద్వాలు తనకు సమానమనీ" అన్నారు. అవునా మరి – ఆ సంతోష విషాదాలు ఆ భేదావస్థ ఉన్న మనకు కాని అమ్మకు ఎక్కడివి ?

అమ్మ అన్నట్లు ఈ ఆవరణలో శుభాశుభకార్యాలు జరగటం చిత్రమైన విషయమేమీ కాదు కాని ఒక శుభకార్యంతో మరొక అశుభకార్యం వంతు పెట్టుకున్నట్లుగా జరగటం ఇదే చూడటం.

ఫిబ్రవరి చివరివారంలో జరిగిన వివాహాలలో ఒక వివాహం నాటి రాత్రి జీవన మరణాల ఘర్షణ మధ్య నలుగుతున్నారు ఇద్దరు. అందులో ఆనాటి పోతుకూచి రవి జబ్బు తీవ్రతను బట్టి పెళ్ళివారు దిగులుపడ్డారు. వివాహానికే ఆటంకం ఏర్పడుతుందేమోనని. నిర్వికారస్వరూపమైన అమ్మ ఆ తరుణంలో అన్నారు "జరగాల్సిందేదో జరుగుతుంది. ఏది జరిగినా దేని దారి దానికే; పెళ్ళికి ఏర్పాట్లు కానివ్వండి" ఏ అవాంతరం లేకుండా వివాహం జరిగిన ఆ మర్నాటి సూర్యాస్తమయ వేళకు రవి మరణించాడు. గతరాత్రి అమ్మ వర్ఘూప్రసాద్ – అరుణల వివాహ వేదిక మీద కూర్చుని ఎంత వేడుకగా వివాహం జరిపించారో అలాగే ఆ రాత్రి శ్మశానానికి వచ్చి దహనసంస్కారాలు జరిపించారు. తిరిగి వచ్చాక ఆ రాత్రి బువ్వంబంతీ అప్పగింతల వేళల్లో పాల్గొన్నారు. ఆ రోజే కాదు. ఆ తర్వాత కూడా పెళ్ళివారున్న మూడురోజుల పాటు వేడుకలు జరిపింపబడ్డాయి.

శివరాత్రి రోజు సాయంత్రం ఐదుగంటల సమయంలో ఆనాడు రవితో పాటు చావుబ్రతుకుల మధ్య నలుగుతున్న వికలాంగుడైన వెంకన్న (యార్లగడ్డ రాఘవయ్యగారి కనిష్ఠపుత్రుడు) ఆ బాధనుండి విముక్తి పొందాడు. అంత్యక్రియలు అమ్మ దగ్గరుండి జరిపించి ఇంటికి వచ్చాక ఆరాత్రి అమ్మకు యథావిధిగా పూజలు జరిగాయి.

మే నెల పందొమ్మిదవ తేదీన ఇక్కడికి తరుచుగా వచ్చే సుశీల అక్కయ్యకు ఒక్కగానొక్క పుత్రుడూ అడవులదీవి కరణంగారూ ఆయన యల్లాప్రగడ మధుసూదనరావు వల్లూరి పాండురంగారావు చెల్లెలు లలితల వివాహం శాస్త్రోక్తంగా, పూర్వకాలపు వివాహాలను తలంపుకు తెచ్చే వేడుకలతో ఆడంబరంగా అతి వైభవంగా జరిగింది.

మధు అదృష్టమేమిటో కాని ఒక ముహూర్తం వేళలోనే కాక అమ్మ మధును పెళ్ళికొడుకును చేసినప్పటి నుండి వివాహ తతంగంలో చేసే ప్రతిపనిలోను (అంటే స్నాతకమూ, సదస్యమూ, స్థాలీపాకమూ, నాగవల్లీ మొదలైనవి) అమ్మ, హైమ పాల్గొన్నారు.

పెళ్ళి అయిన మర్నాటి రాత్రి బువ్వంబంతి జరిగింది. ఆ సాయంత్రం మధు మేనత్త కొడుకు మురళిని – ఆ అబ్బాయి హృద్రోగ్గపీడితుడు – ఆ రోజు దడ ఆయాసము ఎక్కువగా ఉండటం వలన ఇక్కడ వైద్యసౌకర్యము లేదని తెనాలి తీసుకువెళ్ళారు తల్లిదండ్రులు. వెళ్ళేటప్పుడు ఆ అబ్బాయి అమ్మకు పూజచేసి ప్రసాదం తీసుకున్నాడు.  నా బాధ భరించలేననీ దాని నుండి విముక్తి కలిగించమనీ అమ్మను కోరాడు. "అట్లాగే నాన్నా – ఎప్పుడూ నా దగ్గరుంటావా నాన్నా ?" అన్న అమ్మ మాటకు తప్పకుండా ఉంటానన్నాడు. మర్నాటి ఉదయం కబురు రానే వచ్చింది 21 రాత్రి రెండు గంటలకు ఆ అబ్బాయి చనిపోయాడని.

ఈ నెలలోనే 11వ తేదీన వల్లూరి చలపతిరావు గారి ద్వితీయ పుత్రుడు బసవరాజు ఉపనయనం జరిగింది. అదే రోజు ఆవరణలో ఉంటున్న ఒక అబ్బాయి (కుమార్) వడుగూ జరిగింది.

24వ తేదీన కోన సుబ్బారావు గారి జ్యేష్ఠపుత్రుడు కోనసత్యం ఉపనయనము జరిగింది.మార్చి మాసాంతంలో అంటే మరోరోజు తర్వాత ఏప్రిల్ ప్రవేశిస్తుందనగా ఇక్కడ విద్యుద్దీపాలు వెలిగాయి.

ఏప్రిల్ నెలలో ఏటేటా భారీ ఎత్తున జరిగే ఉత్సవదినమున్నది. అదే అమ్మ జన్మదినోత్సవం. ఏప్రిల్ నెల 20 వతేదీన జరిగింది. దానికి తొమ్మిది రోజులు ముందుగా జరిగిన ఉగాదినాడు ఉదయం 7–50 ని.లకు తంగిరాల రాధాకృష్ణమూర్తి అనే ఒక అన్నయ్య ఉపనయనము యధావిధిగా నిర్వర్తించే క్రతువు పూర్వకంగా కాక అమ్మ బొట్టుపెట్టి మెళ్ళో జందెము వెయ్యటంతో జరిగిపోయింది. అన్నయ్య అభీష్టమూ – అదే.

జన్మదినోత్సవము నాటి కార్యక్రమంలో ఉదయం మంగళస్నానానికి ముందు మంగళవాద్యాలు మ్రోగుతుండగా అమ్మ సింహాసనాన్ని అలంకరించి దర్శనం ఇచ్చారు. ప్రతి సంవత్సరంలాగే పోట్లూరి సుబ్బారావు గారు అమ్మకు పూజచేసి నూనెతో తలంటారు. అటుకులు, ఐదు ఆరు రకాల పిండివంటలు కలిపి పంచబడ్డాయి. ఆ సమయంలో ఉన్న జనమంతా నమస్కారాలు చేశాక అమ్మ లోపలికి వచ్చేటప్పటికి మధ్యాహ్నమైంది.

మళ్లీ అమ్మ వేదిక మీదికి వచ్చేటప్పటికి సాయంత్రం మూడు అయింది. సుబ్బారావుగారు పూజచేశాక తంగిరాల శాస్త్రి దంపతులు పూజ చేసి వాళ్ళ బాబును అమ్మకు అందించారు పేరు పెట్టమని. ప్రేమకుమార్ అని పెట్టారు. చెరుకుమిల్లి సత్యనారాయణగారను మరొక అన్నయ్య ద్వితీయపుత్రుని అన్నప్రాశన, పుట్టువెంట్రుకలు తియ్యటం జరిగినాయి. ఆ తర్వాత – వచ్చినవారంతా తాము తెచ్చిన ఫలపుష్పాదులు సమర్పించి ప్రసాదం స్వీకరించారు.

రాత్రి పూజ మొదటగా చంద్రమౌళి సీతారామయ్యగారు చేశాక "మాతృశ్రీ" జన్మదిన అభినందన సంచికావిష్కరణ మహోత్సవం జరిగింది. కొందరు రచయితలు "మాతశ్రీ"లోని తమరచనల పఠనంతో పాటు పూజాంజలులు సమర్పించారు. అనంతరం 1962వ సంవత్సరంలో అమ్మ చీరాల వెళ్ళిన సందర్భంలో తీసిన చలన చిత్రమూ, ఇటీవలే డాక్టర్ అదపా రామకృష్ణారావుగారు (హైద్రాబాద్) తయారు చేసిన కొన్ని స్లైడ్సు ప్రదర్శించటంతో నాటి కార్యక్రమం ముగిసింది.

జన్మదినోత్సవం తెలుగు పంచాంగం ప్రకారము జరిగితే అమ్మ కల్యాణదినోత్సవం ఇంగ్లీషు క్యాలెండరు ప్రకారం మే 5న జరుగుతుంది. ఇదీ పెద్దఎత్తున జరుపబడే ఉత్సవమే. అయితే ఆ రోజు అమ్మచే ఏదైనా ఒక విశిష్టతకల నూతన కార్యం ప్రారంభింపబడుతుంది.

ఈ తడవ ప్రత్యేకించి ఒక భవనానికే అనికాక ముందుకాలంలో ఒక నగరంగా రూపొందింపబడే ప్రదేశంలో కొంత భాగం కాలినడకన అమ్మ తిరుగుతూ పసుపు కుంకుమ పూలు నవధాన్యాలు చల్లుతూ ఒక నగరానికి శంఖుస్థాపన చేశారు. తర్వాత కాలువ ఒడ్డున నున్న పొలంలో విద్యుచ్ఛక్తి సహాయంతో నడవబోయే నీటిమర పెట్టబోయే స్థలంలో శంఖుస్థాపన చేశారు.

ఇంతకీ ఇటువంటి ఉత్సవాల గూర్చి కాగితం మీద అయితే ఆనాటి కార్యక్రమాన్ని తెలియచేయటమే జరుగుతుంది కాని ప్రత్యక్షంగా తిలకించినప్పుడు కలిగే ఆ వైభవంలోని ఆనందం అవగతం కాదుగా ? **– జూన్, 1967**

# ఈ స్థానం నీ కెప్పుడూ ఉన్నది

అన్నయ్యా,

ఏప్రిల్ మాసంలో ఏదో ఒక తేది, మే నెలలో 5వ తేది, ఆగష్టు నెలలో 15వ తేది ఒక్కొక్క ప్రత్యేకతకు గుర్తులై ఇక్కడ భారీ ఎత్తున ఉత్సవాలు జరుపబడినట్లే జూన్ మాసంలో 20వ తేదీ ఆ ప్రత్యేకతను కలిగించుకున్నది.

గత సంవత్సరం జూన్ 20వ తేదీన బాపట్లలో ప్రారంభింపబడిన "మాతృశ్రీ ప్రింటర్స్" ప్రథమవార్షికోత్సవం గడచిన నెల 20వ తేదీన అమ్మ సన్నిధిన జరిగింది. ఆరోజు రాత్రి 10 గంటలకు డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారిచే సంకలనం చేయబడిన "అమ్మా - అమ్మవాక్యాలూ" అనే గ్రంథ ఆవిష్కరణోత్సవం జరిగింది.

ఆ గ్రంథరాజాన్ని గూర్చి చెప్పబోయేముందు అమ్మను వారు తొలిసారిగా ఏ విధంగా దర్శించుకున్నదీ, అప్పటివారి అభిప్రాయాలూ, ఆ తర్వాత కలిగిన అనుభవాలూ, అవి తెచ్చిన పరిణామాన్ని గూర్చి వారెంత సంక్షిప్తంగా ప్రసంగించినా అది ముగిసేటప్పటికి రెండు గంటలు కాలం గడిచింది. ఆనందోద్వేగాలతో వారు చేసిన అభిభాషణ రసవత్తరంగా ఉండి ఇంకా ఇంకా మాకు వినాలని ఉన్నా, వారికి చెప్పాలని ఉన్నా అప్పటికి ఎవరూ భోజనాలు చేయనందున విరమించాల్సివచ్చింది.

నాలుగైదు మార్లు నుండి వచ్చి వెళ్తున్నా తను చదివిన, విన్న ఆధ్యాత్మిక విషయాలలో కలిగిన సందేహాలన్ని అమ్మను అడిగి నివృత్తి చేసుకోవాలనుకున్న కాంతిమతిగారికి (ఎమ్.ఎ., పి.హెచ్.డి., విశాఖపట్టణం) ఈసారి అవకాశం లభించింది జూన్ 12వ తేదీన.

ఏకాగ్రత, ధ్యానం, షట్చక్రాలు, ప్రాణాయామం, జ్ఞానం - అంటే ఏమిటి? భగవంతుడు ఎవరూ ? వీటిని గూర్చి వారి మధ్య రెండు మూడు గంటల పాటు సంభాషణ జరిగింది. చెప్పినది తేలిక పదాలతో నిండిన చిన్న చిన్న వాక్యాలే కావొచ్చు. భాష సరళమైనదే కావొచ్చు. కాని ఆ ఒక్కొక్క వాక్యమే కొన్ని ఉద్గ్రంథాలుగా వ్రాయగలిగే అర్థముతో నిండిన ఆ భావాలను తనకు తేటతెల్లముగా వివరిస్తూంటే కాంతిమతి ఆశ్చర్యచకితే అయ్యారు. రెప్పవేయకుండా అమ్మవంకే కాసేపు చూసి అన్నారు. "మీ రహస్యం తెలిసింది చెప్పమంటారా?"

"రహస్యమైతే ఎట్లా చెప్తావు ?" అని అమ్మ నెమ్మదిగా అంటూ చెప్పమ్మా" అన్నారు మళ్ళీ చిరునవ్వుతూ.

"మీరు ఓంకార స్వరూపము నుండి వచ్చారని...." మరో పదం రాకుండా దుఃఖంతో గొంతు నిండిపోయింది.

అమ్మ నవ్వి అన్నారు "నీకు తెలిసిన రహస్యమిది."

"అవును" అన్నారామె.

ఆ తర్వాత 16వ తేదీన రాచర్ల లక్ష్మీనారాయణ కుమారుడు బంగారుశాస్త్రికి అక్షరాభ్యాసం జరిగింది. మామూలుగా అమ్మ మొదట కుంకుమతో తర్వాత పలకమీద "ఓం" అని కాని 'అంఆ' అని కాని అక్షరాలు రాసి దిద్దిస్తారు. వాడికీ అట్లాగే ఓం అని రాసి దిద్దిస్తూ పలకమీద రాస్తున్నప్పుడు ముందు సున్నా చుట్టి 'ఇది ప్రపంచం" అంటూ అందులో "ఓం" అని రాస్తూ "ఇది నా మొహం" అని అతి నెమ్మదిగ స్వగతంగా అనుకుంటూ "దిద్దునాన్నా" అని బంగారుచే దిద్దించారు. అమ్మ ఎంత నెమ్మదిగా అన్నా సమీపంలోనే కూర్చున్న ఒకరిద్దరికి వినపడక పోలేదు ఆమాట. వాళ్ళు ఏమిటమ్మా అని అడిగే అవకాశం లేకుండానే లక్ష్మీనారాయణ త్వరపెట్టారు – "త్వరగా కానివ్వరా పూజ. భోజనాలకు ఆలస్యమౌతున్నది" అంటూ.

ఈ మధ్య వర్షాలు లేక ఏర్పడిన నీటి ఎద్దడి వలనా, వృద్ధాప్య దశలో పనిచేసుకోలేకా మెట్టినిల్లు ఇదై చాలాకాలం నుండి ఇక్కడే ఉంటున్న గుబ్బపు సుబ్బమ్మ రేటూరులో ఉన్న వాళ్ళ బంధువుల దగ్గరికి వెళ్ళటానికి నిశ్చయించుకొని ఈ విషయాన్ని అమ్మకు చెప్పటానికి వచ్చింది. ఇన్నాళ్ళు ఉండి ఇప్పుడు ఈ చివరి రోజుల్లో ఈ గడ్డనూ, అమ్మనూ వదిలి వెళ్లాల్సి వచ్చిన తన పరిస్థితికి దుఃఖిస్తూ విషయం చెప్పి సలహా అడిగింది వెళ్ళమంటావా ? వద్దంటావా అమ్మా ? అని. అమ్మ అన్నారు సలహా అడిగావు కనుక చెప్తున్నాను. నీకు చేసేవాళ్ళు లేరని నువ్వు పని చేసుకోలేవని మాత్రం వెళ్లొద్దు. నీకు ఇష్టమైతే ఇక్కడేఉండి ఇక్కడ వున్న కలో గంజో త్రాగి ఓపిక ఉంటే నామం చేసుకుంటూ, కుంకుమ పొట్లాలు కడుతూ కూర్చో – నీ ఆస్థితో నాకు పనిలేదు. నీకీమాట ఆనాడే చెప్పాను. గుర్తుందా ? "ఆమె తలూపింది. "ఈ గడ్డ విడిచి వెళ్ళాలంటే బాధే మరి. అవకాశం ఉన్నది కనుక ఉండమంటున్నాను. నీకు తగినట్టు చూడలేను కాని ఇక్కడ ఉన్నట్టు చూడగలను. ఇంతమంది ఉన్నారు ఇక్కడ. ఎవరో ఒకరు చెయ్యకపోరు. కాదు అక్కడికి వెళ్ళి వస్తానంటావా – సరే. నీ ఇష్టం వెళ్ళు. కాని ఈ స్థానం నీకు ఎప్పుడూ ఉన్నది. ఇది మా ఇల్లు కాదు. మన ఇల్లు. అందరిల్లు".

**– జులై, 1967**

# మాతృశ్రీ స్పోర్ట్స్ అండ్ కల్చరల్ లీగ్

వేసంగి సెలవుల్లో బ్రహ్మాండం రవీ అతని స్నేహితులు సరదాగా ప్రదర్శించే నాటకం ఈసారి వేసవి చివరిరోజుల్లో వెయ్యటం జరిగింది. నాటిక పేరు "అనంతం".

ఆ నాటిక ప్రదర్శించేముందు ఒక ఉదయం (17వ తేది) వాళ్ళు అమ్మదగ్గర కూర్చొని ఉండగా నాటిక ప్రస్తావన వచ్చి అమ్మ అన్నారు నవ్వుతూ "అనంతం నాటకం వేయటమేమిట్రా ? మనం ఉన్నది ఆ నాటకంలోనే".

కోన సత్యం అన్నాడు: "కాని ఈ నాటకంలో ఐదు పాత్రలే."

"ఈ నాటకంలో ఎవరికి వారే ఒక పాత్ర. దశలు ఐదు కావచ్చు కాని" అని ఆగి "అనంతం అనే నాటకంలో పంచభూతాలతో ఆడుకుంటున్నాము" అన్నారు అమ్మ.

23వ తేదీ సాయంత్రం వాళ్ళంతా క్రికెట్ ఆడారు. ఆట చూడటానికి అమ్మను ఆహ్వానించారు. ఆ రోజు అమ్మ అస్వస్థతగా ఉన్నా వాళ్ళని నిరుత్సాహ పరచటం ఇష్టం లేక ఆట ప్రదేశానికి వెళ్ళారు.

మొదట ఇన్నింగ్స్ పూర్తి అయి రెండో ఇన్నింగ్స్ జరుగుతుండగా శాయమ్మగారు కాఫీ తీసుకొచ్చారు. ఆవిడచేతిలోని ప్లాస్కు చూస్తూ అమ్మ అడిగారు "ఏమిటది ?"

"నీకు కాఫీ తీసుకొచ్చాను అమ్మా"

"నాకా ? ముందు వాళ్ళకు ఇవ్వండి."

"వాళ్ళకు తెస్తున్నారమ్మా."

"అయినా అందరికీ ఇచ్చిన తర్వాత నేను త్రాగుతాను. నాది ఫ్లాస్క్ కనుక వేడి చల్లారదు. ముందు వాళ్ళకు వేడి వేడి కాఫీ తెచ్చి ఇవ్వండి".

ఆట పూర్తి అయ్యాక వాళ్ళకనే చేసినా చపాతీలను అమ్మ వాళ్ళకూ, చూసిన మాకూ పెట్టారు.

'ఒకరన్నారు. "మా కెందుకమ్మా? ఆడి ఆడి ఉన్నారు. వాళ్ళకే పెట్టు".

"నేను అట్లా పెట్టలేనురా". **– జులై, 1967**

# ప్రారబ్ధాన్ని తప్పించుకోవచ్చా ?

అక్కడ నుండి తిరిగి వచ్చాక అమ్మ వరండాలో కూర్చున్నప్పుడు హైద్రాబాద్‌లో భరద్వాజకు తమకు మధ్య కర్మసిద్ధాంతాన్ని గూర్చి జరిగిన చర్చను గూర్చి చెప్తూ డాక్టర్ అడపా రామకృష్ణారావుగారు అడిగారు.

"మనం కర్మ సిద్ధాంతాన్ని నమ్ముతున్నాము. దాని ప్రకారము ప్రారబ్ధాన్ని విధిగా అనుభవించాలి. అయితే భగవంతుడి కటాక్షం ఉన్నప్పుడు అది తప్పించు కోటానికి వీలుందా లేదా ?"

"కర్మ అంటూ ప్రత్యేకించిలేదు. చేసే ప్రతీపనీ కర్మే. మనం మామూలుగా చెప్పుకునే కర్త, కర్మ, క్రియలలో కర్తే కర్మకు క్రియకు ఆధారం కదా, కర్తలేనిది కర్మలేదు. ఆ చేయిస్తున్నదేదో అదే తొలిగిస్తుంది. రావటానికి ఏది కారణమో తొలగటానికి అదే కారణము" అంటూ అమ్మ ప్రత్యుత్తరముతో ప్రారంభమైన ఆ సంభాషణ దాదాపు మూడు గంటల పాటు జరిగింది.

తర్వాత రామకృష్ణారావుగారు యిక్కడ ఉన్న ఐదురోజులూ అనేక విషయాల గురించి గంటలకొద్దీ చర్చలూ సంభాషణలూ జరిగాయి. వాటిని పూర్తిగా కాగితమ్మీదకు ఎక్కిద్దామనుకున్నా. టేప్‌రికార్డర్ మీదకు తీసుకు వద్దామనుకున్నా విఫలయత్నమే అయింది.

ఇక్కడ అనుక్షణమూ అమృత సంఘటనే; అమ్మ నుండి వెలువడే ప్రత్యక్షరమూ అమృత ప్రపూర్ణమే.

అందులో నేను కనగలిగినవెన్ని ? వినగలిగినవెన్ని ? ఇక వ్రాసుకోగలిగినవే పాటి ? నీకు చెప్పగలిగిన దేమాత్రం ?

ఆసక్తితప్ప ఆశక్తినివ్వలేదు అమ్మ నాకు, నేనేమీ చేయను ?

– జులై, 1967





# దేవీనవరాత్రులు

అన్నయ్యా,

చూశావా, ఎప్పటికప్పుడు నీకు ఉత్తరము వ్రాద్దామనుకుంటుండగానే శ్రావణ భాద్రపదాలు గడచి ఆశ్వయుజం ఆరంభమైనది.

మళ్లీ కార్తీకం ప్రవేశించేలోగా నిత్యకళ్యాణం పచ్చుతోరణమైన ఈ లోగిట్లో ఈ మధ్యజరిగిన పర్వదినాలు చేసిన "పండుగ సందడి" ఏమిటో చూద్దాము.

మంగళవారం నోములతో, శుక్రవారం పూజలతో, కళకళలాడే శ్రావణ మాసంలో ఆ నాలుగువారాలూ ఇక్కడ బృందమే కాక ఇతర ఊళ్ళనుండి వచ్చి ఆ నోములు నోచుకున్నారు కొంతమంది అక్కయ్యలు.

ఏ దేవత నుద్దేశించి వారీ నోముపట్టారో ' ఆ దేవికే ప్రత్యక్షంగా పూజ చేసుకుని వాయినాలు చెల్లించుకునే అవకాశం ఆనాడు తాను "మంగళగౌరియై" లభింపచేసిన అమ్మ, వరలక్ష్మీ వ్రతంనాడు చారుమతియై, శ్రీకృష్ణజయంతినాడు కృష్ణభగవానుడై జాతి మత కుల గుణ వర్గ వర్ణ విభేదరహితంగా అర్కపురిలో "అందరిల్లు"కు పునాదివేయబడిన ఆ శుభదినాన (ఆగష్టు 15వ తేదీన) స్వతంత్ర లక్ష్మియై, చవితినాడు పూలుపండ్లు ఆకులతో అందంగా కన్నుల పండువుగా అలంకరింపబడిన పాలవెల్లి క్రింద విఘ్నేశ్వరుడై, అదేరోజు, చివర మంగళవారమున గౌరిదేవిని ఓలలాడించుటకు వీలుపడనందున ఆ రోజు ఓలలాడించగా మంగళగౌరియై, ఉండ్రాళ్ళ తద్దెరోజు తదియగౌరియై పూజలందుకున్నారు.

అదేవిధంగా సుధాంశుడి వెలుగులోని స్వచ్ఛతను ధవళతను పూర్ణంగా ప్రస్ఫుటం చేసే శరత్కాలారంభంలో జరుపబడే దేవీనవరాత్రోత్సవాలలో నిత్యమూ ఒక్కొక్క అలంకార విశేషంతో పూజలందుకున్నారు.

ఈ తొమ్మిదిరోజులు అమ్మ ధరించే దుస్తులలో నగలులోనే గాక సదా ఆపవిత్ర ఫాలభాగంలో భ్రూకుటిన అరుణకాంతి తేజస్సును ధిక్కరిస్తూ పూర్ణబింబాకృతిలో శోభిల్లుతుండే కుంకుమ స్థానం కూడా పూటకోరీతిగా అలంకరింపబడేది. ఒక్కొక్కసారి బంగారపు బొట్లుపెట్టి చుట్టూ కుంకుమ, విభూతితో

రేఖలు దిద్దితే మరొకసారి కేవలం విభూతితో కుంకుమతో గంధంతో పెట్టుకునేవారు. ఆ బొట్టు పెట్టుకోవటము కూడా నిలువుగానో, గుండ్రంగానో లేక రెండూ మిళితమయ్యో ఉండేది.

మరి ఈ "బొట్ల"ని గురించి ఏ శాస్త్రాలలోనైనా ఇది ఈ దేవతకు అలంకారం, ఈ బొట్టు ఈ దేవత ధరిస్తుందని ఉన్నదో లేదో కాని లలితాంబగారు అమ్మతో దీనిని గురించి ప్రస్తావించే "పూటకోవిధంగా పెట్టుకుంటున్నావు కదమ్మా, అవి ఏ దేవీ అవతారానికి చిహ్న" మని ప్రశ్నించినప్పుడు - అమ్మ చిరునవ్వుతో సమాధానమిచ్చారు - "ఏమోనమ్మా, నాకావిధంగా పెట్టుకోవాలనిపిస్తుంది. పెట్టుకుంటున్నాను" అని.

పూజావేళలలో కూడా ఒక్కొక్కసారి ఎంత గంభీరంగా, మౌనంగా నిశ్చలంగా కనిపించేవారో మరొకసారి అంత చిలిపిగా అల్లరిచేస్తుండేవారు. దీని అంతరార్ధమేమిటని ప్రశ్నించినా సమాధానంగా చిరునవ్వే ఎదురయ్యేది అమ్మ నుండి.

అంతేకాక చిత్రమేమిటంటే అన్నయ్యా - జగజ్జనని ఈ నవరాత్రులలో ధరించిన బాలా, లలితా, జ్వాలాముఖీ, వైష్ణవీ, గాయత్రీ, చండీ, సరస్వతీ, దుర్గా, కాళీ మొదలైన వివిధ నామాలు గల మూర్తులను ఒకేమూర్తిలో దర్శించినా, ఒక మూర్తికి మరొకమూర్తికి సంబంధం లేదు. అలంకారంలోనే కాదు, దేహచ్ఛాయ లోను, శరీర కదలికలోనూ కూడా.

కాంతులీనే పసిడిమేనిఛాయతో, ముడుచుకున్న మల్లెమొగ్గలోని ముగ్ధత్వం గులాబీలలోని మార్దవం జోహారు చేసేంత ముగ్ధమనోహరమైన రూపులో లలితగా, బాలగా సాక్షాత్కరిస్తే ... ధరించిన ధవళ వస్త్రాలకంటే స్వచ్ఛంగా ఉన్న పాలవన్నె దేహచ్ఛాయతో, గళసీమను అలంకరించిన పుష్పహారాల నవ్వులకంటే నిర్మలమైన కాంతితో నిండిన చిరునవ్వు ప్రశాంతము ప్రకాశవంతము అయిన మోములో అలరారుతుండగా వామహస్తములోని తంబురా మీటుతూ దక్షిణ హస్తములోని చిరుతలు వాయిస్తూ విశ్వభారతిగా దర్శనమిస్తే... అష్టమినాడు నలుపూ, ఎరుపూ వన్నెల కాంతులీనుతున్న తేజోవిలసిత వదనంలో గాంభీర్యం తాండవిస్తోంటే త్రిశూలధారిణియై దుర్గగానూ, నవమినాడు నల్లని దుస్తులు ధరించి త్రిశూల, చక్రధారిణియై "కాళిక"గానూ ప్రత్యక్షమయ్యారు.

పది సంవత్సరాలుగా కలశం పెట్టి నవరాత్రోత్సవాలు చేసుకుంటున్న కేశవశర్మ అన్నయ్య ఈ సంవత్సరం అమ్మ సన్నిధిలో చేసుకున్నాడు. అన్నయ్య లాగే వరంగల్ నుండి మరొక అక్కయ్య ప్రత్యక్షంగా పూజలందుకునే ఆ జగజ్జననే ఉంటే కలశంతో పని ఏమిటి అని అమ్మ సన్నిధికి వచ్చి ఇక్కడే చేసుకున్నది.

ఆ అక్కయ్య రెండువేళలా, కేశవ అన్నయ్య రాత్రివేళ ప్రతిరోజు పూజ చేసుకున్నారు. వీళ్ళతో పాటు ప్రతిపూటా ఎవరో ఒకరు ప్రత్యేకంగా పాదాలు కడిగి సకలోపచారాలతో పూజచేసుకునేవారు. మిగతా వారందరూ తాము తెచ్చిన పూలూ పళ్ళూ సమర్పించుకుని తీర్థ ప్రసాదాలు స్వీకరించేవారు.

ఒక పూట ఇక్కడున్నవారంతా సమిష్టిగానూ, మరొకపూట లలితాంబగారు, ఇంకొకరోజు కస్తూరి, శారదాంబగారూ... సప్తమినాడు మాతృశ్రీ పబ్లికేషన్స్ వారూ, అష్టమినాడు కొప్పురావూరి సత్యనారాయణ గారూ... నవమినాడు కొమ్మరాజు నాగేశ్వరరావుగారూ దశమినాడు ఆనాడు'ఇక్కడ ఆవేళకు ఉన్నవారందరూ పూజలు చేసుకున్నారు.

దశమిరోజున నామకరణలు, అన్నప్రాశనలు అక్షరాభ్యాసాలు, కేశఖండనలు ఒక వరసగా దాదాపు పాతికమందికి జరిగాయి.

రాత్రి జమ్మిచెట్టును పాతి దాని చుట్టూ ముగ్గులతో, దీపాలతో అలంకరించి ఆ ప్రక్కనే వేదిక అమర్చగా అక్కడ అమ్మకు పూజ జరిగింది. ఆ పూట వల్లూరి పాండురంగారావు పూజచేసుకున్నాడు.

పూజ ముగిసాక డాక్టర్ అడపా రామకృష్ణరావు గారు అమ్మ జన్మదినోత్సవ సందర్భంగా తీసిన ఫోటో స్లైడ్స్ కొన్ని ప్రదర్శించారు.

**–అక్టోబరు, 1967**



# అక్షరాభ్యాసము - అన్నప్రాశన

1964 ఫిబ్రవరిలో 24 నాటి మధ్యాహ్నం అప్పుడే చెరుకూరు నుండి వచ్చిన ఆ దంపతులు తమ పాపలిద్దరికీ అక్షరాభ్యాస, నామకరణాలు అమ్మచే చేయించుకోవాలని రాగానే ఎంతో ఆతృతగా ఆ ప్రయత్నంలో ఉన్న వాళ్ళని చూచి అమ్మ అడిగారు.

"భోంచేశారా అమ్మా?"

"లేదమ్మా"

"ముందు అన్నం తిని రండి. తర్వాత పూజ చేసుకుందురుగాని" అని వాళ్ళను భోజనాలకు పంపించి ఆ తర్వాత ఒకరికి పేరుపెట్టి, మరొకరికి అక్షరాభ్యాసం చేశారు.

మొదట్లో పాపలిద్దరూ బిడియం వల్ల తల్లిదండ్రులెంత బుజ్జగించినా అమ్మ ఎంత ముద్దుగా పిలిచినా దగ్గరికి రాలేదు.

దంపతులు పూజ ఆరంభించారు. పూజ జరుగుతుండగా తన దగ్గరగా వచ్చిన చిన్నమ్మాయిని అమ్మ దగ్గరకు తీసుకొని పాదులకమీది కుంకుమ తీసి కనుబొమ్మల మధ్య కల్యాణంబొట్టు పెట్టి తన మెళ్లో దండతీసి ఆ పాప మెడలో వేశారు.

పూజ అయ్యాక అమ్మవాళ్ళకి ప్రసాదమిచ్చారు. చిన్న పాప కిస్తుండగా ఆ అక్కయ్య అడిగారు. "అమ్మాయికి పేరు పెట్టమ్మా" అని తప్పడటుగుల అవస్థను దాటి ఇప్పుడిప్పుడే కుదురుగా నడకనేరుస్తున్న ఆ చిన్నారి కింకా పేరు పెట్టలేదా అనుకుంటున్నాను. అక్కయ్య అమ్మతో చెప్తున్నారు "దీని పేరు మీ చేత పెట్టించుకోవాలనుకున్నామమ్మా, దగ్గర్లోనే ఉన్నా ఇవ్వాల్టికి గాని మాకు ప్రాప్తం లేకపోయింది".

ఆ పాపవంక చూచి అమ్మ నవ్వి "దీని పేరా - కల్యాణి" అన్నారు. క్రొత్తదనం తగ్గి పెద్దమ్మాయి కూడా అక్షరాభ్యాసం ఏ పేచీ పెట్టకుండా చేయించుకున్నది.

మొదట కుంకుమలో ఓం రాసి తర్వాత పలకమీద రాసి ఆ అమ్మాయిచే దిద్దించి బొట్టుపెట్టి తీర్థం వేసి ప్రసాదమిచ్చారు.

అమ్మ దక్షిణహస్తం వైపుగా మంచం ప్రక్కనే కూర్చున్న శేషగిరిరావు అన్నయ్యగారు నవ్వుతూ – "అమ్మచేత అక్షరాభ్యాసం చేయించుకున్నవాళ్ళకి అమ్మలాగే చదువురాదు" అన్నారు.

వెంటనే ఆ అక్కయ్య అన్నారు "అమ్మ చదివిన చదువు వస్తే ఇంకా కావాల్సింది ఏముందీ ?" అమ్మ అన్నయ్య వంక తిరిగి అన్నారు చిరునవ్వుతో – "అమ్మ దిద్దబెట్టిన ఓం అక్షరం తప్ప మరొకటి నేర్చుకోమంటారు ఈ పిల్లలు బళ్ళో."

"ఆ 'ఓం' అక్షర మొకటి గుర్తుపెట్టుకున్నా చాలు కనీసం" అన్నారు అన్నయ్యగారు.

అమ్మ నవ్వి "ప్రక్కన 'నా' ఉన్నంతవరకు 'ఓం' ఎట్లా గుర్తు ఉంటుంది" అన్నారు. ఆ సంభాషణలోని చమత్కారాని కంటే దానిలో గర్భితమై ఉన్న నిజాన్ని చూచి అక్కడ కూర్చున్నవారందరమూ నవ్వుకున్నాము.

– నవంబర్, **1967**


COURTESY VISWAJAN

# పూలు లేకపోయినా పూజకు మనసుంటే చాలు

కాసేపు గడిచాక సీతమ్మగారు వాళ్ళు శెలవు తీసుకుంటామంటే అమ్మ ప్రసాదమిచ్చారు.

వాళ్ళు రెండు గంటల క్రితం కారంచేడునుండి వచ్చారు. వాళ్ళమ్మాయికి సంబంధం కుదిరి ముహూర్తాలు పెట్టుకున్నారట. పెళ్ళికి ముందు అమ్మ దర్శనం ఆ అమ్మాయికి చేయించాలని తీసుకొచ్చారు. పూజకు కావాల్సిన సామాగ్రి అంతా తెచ్చుకున్నారు కాని పూలు ఈ ఊళ్ళో దొరుకుతాయేమోనని అవి మాత్రం తేలేదు. కాని పొరుగూరు నుండి అప్పుడప్పుడు వచ్చి ఈ ఊళ్ళో పూలు అమ్మే అతను రానందున వాళ్ళకి పూలు దొరకలేదు.

పూలు లేవని పూజ ఎట్లా చేసుకోవటమా అని సీతమ్మగారు బాధపడ్తుంటే అమ్మ అన్నారు – "ఏం ఫర్వాలేదమ్మా, ఉన్నవాటితోనే చేసుకోండి. మనస్సు ఉంటే చాలు – పూజ ఎవరికీ, ఎక్కడా. వేటితో అన్న సమస్య లేదు. అర్థం తెలిసి అశుద్ధానికి పూజచేసినా వాడికే చెందుతుంది."

వాళ్ళు బయల్దేరేముందు అందులో ఇక్కడికి ఇదే ప్రథమంగా వచ్చినావిడ అప్పుడే అమ్మ సన్నిధి నుండి వెళ్ళవలసి వస్తున్నందుకు చాలా బాధపడ్తున్నారు. చాలాసేపు అమ్మ చెంతనే కూర్చొని అమ్మవంకే రెప్పవెయ్యకుండా చూస్తూ నెమ్మదిగా అన్నారావిడ –

"మీ కుంకుమ బొట్టులో సరస్వతి కనిపిస్తోందమ్మా". అమ్మ విని "ఇది ఇంకా పేచీ అయిన విషయమే" అన్నారు నవ్వుతూ మా వంక చూసి.

ఏడురోజులుగా ఒక్కడే అహర్నిశం నామం చేస్తున్న రాధన్నయ్య (రాధాకృష్ణరెడ్డి) సప్తాహం ఈ సాయంత్రంతో ముగిసింది. ఈ రోజే మన్నవనుండి రాఘవరావు మామయ్య (అమ్మ అన్నగారు) రాధన్నయ్యని ఈ సంవత్సరం మన్నవలో జరగబోతున్న శివాలయ ఉత్సవాలలో ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో వయోలిన్ వాయించటానికి గానూ తీసుకురమ్మనమని ప్రసాద్‌ను పంపించారు.

వెళ్తావా అని అడిగారు అమ్మ అన్నయ్యని. అన్నయ్య తన అంగీకారం తెల్పగానే బొట్టుపెట్టి ప్రసాదమిచ్చి ప్రసాద్ అన్నయ్యతో "మా అబ్బాయి జాగ్రత్త నాయనా – ఏడురోజుల నుండి ఆహారం నిద్రా లేదు. తిరిగి జాగ్రత్తగా తీసుకురండి" అని మందిరం వాకిలి దాకా వచ్చి పంపించారు.

అన్నయ్యకు బొట్టు మామూలుగా పెట్టే నిలువు బొట్టు, గుండ్రటిబొట్టు, అర్ధచంద్రాకారపు బొట్టు కాక అంఆ అని వ్రాసి దాని మీద కుంకుమతోనే శంఖు, చక్ర, త్రిశూల, పద్మాలు వేశారు. అది చూసి వసుంధర నవ్వుతూ అన్నది – అమ్మ తన ఆయుధాలను అన్నయ్యకిచ్చి పంపిస్తున్నదని.

మూడురోజులుగా నాన్నగారికి వస్తున్న జ్వరం ఇవ్వాళ కూడా మామూలుగానే ఉన్నది. ఈ మూడురోజులూ అమ్మ నాన్నగారి మంచం ప్రక్కనే క్రింద పడుకుంటూ వారు కదలినప్పుడెల్లా లేచి కూర్చుని వారికి నడుం రాయటమో కాళ్ళు పిసకటమో చేసేవారు. ఈ రాత్రీ అక్కడే పడుకున్నారు.

– నవంబరు, 1967



# అమ్మ దీపాలార్పలేదు

గతమూడు సంవత్సరాలుగా సరిగా ఆ క్షణాలలో జనవరి నెల ప్రవేశకాలంలో చేయబడే ఘంటారావము ఈసారి అమ్మచే చేయబడినది. యావజ్జగతిని ఒక్క తృటికాలంలో తన ప్రేమబలంతో మేలు కొల్పగలిగే అమ్మ 68వ సంవత్సరం ఆగమన తరుణంలో ధవళ వస్త్రధారిణియై అంతకంటే స్వచ్ఛంగా, నిర్మలంగా నవ్వుతూ దాదాపు 3 అడుగుల ఎత్తు 2 అడుగుల వెడల్పు ఉన్న ఆ కంచుగంటను ఐదు నిమిషాలు పాటు ఆపకుండా మ్రోగించారు. అదే సమయంలో ఒకరిద్దరు అన్నయ్యలు దీపావళి మందుసామాను కాల్చసాగారు. ఇంకోవైపు ఈ దృశ్యాన్ని తిలకించటానికి దేవాలయ ప్రాంగణంలో సమకూడిన సోదరీ సోదరులు ముప్పిరిగొన్న సంతోషోత్సాహాలతో చేస్తున్న అమ్మ నామసంకీర్తన, జేగంట నినాదాలు, ఫోటోలు తీస్తున్న కెమేరా ఫ్లాష్‌వెల్గులు, కర్పూరపు కాంతులూ అన్నీ కలిసి క్రొత్త సంవత్సరం సందడంతా మా సొత్తే అయిందనిపించింది.

ఆ తర్వాత మందిరంలోకి వచ్చి నిరాడంబరంగా అలంకరించిన వేదిక మీద కుర్చీలో కూర్చున్నారు అమ్మ. పూజారంభానికి ముందు శాస్త్రి అన్నయ్య క్రొవ్వొత్తులు వెలిగించిన కేకుప్లేటునూ చాకునూ అమ్మచేతికిచ్చి కేకును కొయ్యమన్నాడు. వెంటనే అమ్మ కొయ్యబోతుండగా దీపాలు ఆర్పాలన్నాడు. వెంటనే అమ్మ దీపాలు ఆర్పాలా అన్నారు తమాషా అయిన ధ్వనిలో.

"మా దీపాలుకాదు అన్నాడు శాస్త్రి అన్నయ్య భీతితో కూడిన నవ్వుతో. అమ్మ ఠీవిగా నవ్వుతూ "ఆర్పుతున్నాను" అంటూ, క్రొవ్వొత్తుల వత్తులను చాకుతో తాకిస్తుండగా అవి ఆరిపోయి కేకుమీద నుండి పళ్ళెంలో పడ్డాయి. తర్వాత చాకును ప్రక్కకు పెట్టి కేకును రెండు చేతుల్లోకి తీసుకొని విరిచేసి పళ్ళెంలో ఆ ముక్కలను వేసి పొడిపొడిచేశారు. అది చూసి రామకృష్ణ అన్నయ్య అన్నాడు. "పొయ్యిలో నిప్పు ఆర్పమంటే నీళ్ళు జల్లకుండా కట్టెలను బయటకు లాగినట్లుగా ఉన్నది అమ్మదీపాలు ఆర్పిన పద్ధతి"అని.

బృందం "సందేశ గీతావళి"లోని గీతాలు, రాజాపాటలలోని పాటలు పాడుతుండగా రాధన్నయ్య "మైడియర్ గాడ్" అంటూ నామం ఆరంభించగా కొప్పురావూరి సత్యనారాయణ దంపతులు అమ్మ పాదాలు కడిగి పారాణిపెట్టి

పూలతో పూజచేశారు. ఆ తర్వాత ఒక్కొక్కరుగా అంతా పూజచేశారు బంతీ, గులాబీ, చామంతీ, తమలపాకులతో.

అందులో క్రితంరోజే వచ్చిన సోదరులు కొంతమంది ఈ ఉత్సవం సంగతి తెలిసి స్వీట్స్, బిస్కెట్స్ తెచ్చారు. టెంకాయలు, పళ్ళతో పాటు బిస్కెట్లు రస్కులు టీ నివేదనకూడా అమ్మకు చేశాక అవన్నీ కలిపి అప్పుడే అక్కడ పంచారు. అందరం సరదాగా ఆ ప్రసాదం తిని టీ త్రాగాము.

ఈ తతంగం ముగియగానే అమ్మ "మీరు సిద్ధంగా ఉండండి క్రికెట్ ఆటకు, నేను వస్తున్నాను", అంటూ రవిని అతని బృందాన్ని హెచ్చరించి ఇంట్లోకి వస్తూ వరండాలో ఆగి వేకువజామునే వెళ్ళేవారికీ, అప్పుడే శెలవు తీసుకున్నవారికి ప్రసాదాలు ఇచ్చారు.

**– జనవరి, 1968**


COURTESY VISWAJANANI TRUST

# మీరు కలవటం కాదు నేను కలుపుకోవటమే

డిసెంబరు 31 రాత్రి 12 గంటలకు నూతన సంవత్సరం ప్రవేశిస్తున్న ఆ తరుణంలో దాదాపు మూడు అడుగుల ఎత్తు 2 అడుగుల వెడల్పు ఉన్న క్రొత్త కంచుగంట అమ్మచే మ్రోగింపబడింది. తర్వాత మందిరంలో నిరాడంబరంగా అలంకరింపబడిన వేదికమీద శ్వేతవస్త్రధారిణియైన అమ్మకు పూజలు జరిగాయి. పూజానంతరం అమ్మచే తీర్థం తీసుకున్న పిదప అందరం సరదాగా స్వీట్స్, బిస్కెట్లు, రస్కులు తిని టీ త్రాగాము. కొంతమంది అన్నయ్యలు వాళ్ళ క్రొత్త డైరీలలో అమ్మ చేత సంతకం పెట్టించుకున్నారు.

ఆ తర్వాత జలోదరం వ్యాధితో బాధపడ్తున్న వెంకాయమ్మగారి (కోన సుబ్బారావుగారి సతీమణి) పరిస్థితి ప్రమాదకరంగా పరిణమించడం వలన ఉదయం నుండి మధ్యాహ్నం 2 గంటల వరకు, ఆమె చెంతనే కూర్చున్నారు అమ్మ. ఆనాటి ధనుర్మాసం పూజ అక్కడే జరిగింది.

తిరిగి రాత్రి సంధ్యావందనం జరుగుతుండగా అమ్మ ఆమె దగ్గరకు వచ్చారు. ఉదయం కంటే ఆమెలో వచ్చిన మార్పుని చూస్తూ ఆమె దగ్గరే కూర్చుని ఆమెతో, మాతో సంభాషించసాగారు. ఆ సంభాషణలో ఆమె జీవిత కాలవ్యవధి గంటల్లోకి వచ్చిందన్న భావాన్ని సూచింపచేశారు. దాదాపు పది గంటలకు ఆమె దగ్గర నుండి లేచి ఆమె అంత్యక్రియలకు కావాల్సిన ఏర్పాట్లు చేయించసాగారు. ఇదంతా చూసి బాధపడ్డాడు ఒక అన్నయ్య. "ఆమె ఇంకా బ్రతికే ఉన్నదిగా అమ్మా!" అని. అమ్మ నవ్వి అన్నది "ఇంకా ఏమున్నది అక్కడ. తేదీ మారటం కోసమేగాని ఆ "ఊపిరి" అదే జరిగింది. రాత్రి 11-25 నిమిషాలకు ఆమె అంతిమశ్వాస వదిలారు.

2వ తేదీ ఉదయం 12 గంటలకి ఆమె మృతదేహానికి దహన సంస్కారం జరిగింది. శ్మశానానికి వెళ్ళేముందు పాడెమీదకు ఆమె శరీరం ఎక్కేవరకు జరుపబడే క్రతువు వెంకాయమ్మగారికి జ్యేష్ఠపుత్రుడు సత్యం అమ్మా కలసి చేశారు. కర్పూరం అగ్నితో ఆమె శిరస్సుకు అమ్మే నిప్పంటించారు. 12-03 ని.లకు అక్కడి నుండి కాలవకెళ్ళి అందరం స్నానాలు చేసి, ఆ తర్వాత అమ్మ పెట్టిన దధ్యన్నం తిని ఇంటికి వచ్చాము మధ్యాహ్నం 3 గంటలకు.

7వ తేదీ ఉదయం 10-45 ని.లకు సంక్రాంతి పండుగ సందర్భంగా అమ్మ నామసంకీర్తన సప్తాహం ప్రారంభమైనది. ఈసారి నూతలపాటి బృందమే కాక, ఇతర ఊళ్ళ నుండి కూడా కొంతమంది సోదరీసోదరులు వచ్చి పాల్గొన్నారు.

ఆ ఉదయం గుంటూరు నుండి వచ్చినవారిలో ఒకరు చెప్పుకున్న బాధల గురించి విని అమ్మ కాసేపాగి, "బాధలు లేకుండా ఎవరూ లేరని అందరూ తలో రకంగా బాధలు పడ్తున్నా"రని చెప్తూ చిరునవ్వుతో అన్నారు "మనం వచ్చింది అందుకోసమేగా అమ్మా, బాధలేకపోతే చైతన్యం ఏముందీ ? శిల్పానికి అందం రావాలంటే ఉలిదెబ్బలు అవసరం" అని. ఆమె అడిగారు "పోనీ అమ్మా ఇన్ని బాధలు పడినా చివరలో నీలో కలుస్తాముగా!"

"అది ఎప్పుడూ ఉన్నది. దానికి అడ్డులేదు. **నువ్వుకలవటం కాదు నేను కలుపుకోవటమే"** అన్నారు మృదువుగా అమ్మ అక్షరమక్షరంలో అమృతాన్ని చిందిస్తూ.

8వ తేదీ మధ్యాహ్నం గుంటూరులో జరిగిన సాధుసభలకు వచ్చిన వాళ్ళల్లో పాలకొల్లు నుండి వచ్చిన స్వాములవార్లు ఇక్కడకు వచ్చారు. వాళ్ళతో పాటు వచ్చినవారిలో ఒకావిడ డైరీలాంటి పుస్తకంలో అమ్మచే వ్రాయించుకున్నారు. అమ్మ రాసిన "అంఆ - అంఆ - అంమ - అమ్మ" వాటిని చూచి "వీటిని పఠించమంటారా" అని అడిగారు. మీ యిష్టం అన్నారు అమ్మ. వాటి అంతరార్థమేమిటని ప్రశ్నించారు తిరిగి ఆవిడ. "అక్షరాలనిబట్టి ఉచ్చారణలో తేడా వస్తుంది కాని వాటి భావం ఒకటే. వాటన్నింటి అర్థం అంతులేనిది - అడ్డు లేనిది - ఆధారమైనది, సర్వమైనది" అన్నారు అమ్మ. **- జనవరి, 1968**


COURTESY VISWAJANANI TRUST

# ముక్కోటి - సంక్రాంతి

11వ తేదీ ముక్కోటి ఏకాదశినాడు తెల్లవారుఝూమున 5-15 ని.లకు ద్వారదర్శనం జరిగింది. అది దివ్యదర్శనమే. అమ్మ మూర్తిలోని అలంకారమూ, దేహచ్ఛాయలోనే కాదు - ఆకారంలోనూ కనిపించిన మార్పు అందర్నీ ఆశ్చర్య ఆనందడోలికలలో పరవశింపచేసింది. పన్నాలవారిచే రచియింపబడిన "సందేశ గీతావళి"లోని - "పుణ్యమహో, పుణ్యమహో పుణ్యం తవ దర్శనం, ధన్యతమం ధన్యతమం మమజీవనం" అన్న గీతం ఇందుకోసంగా వ్రాయబడిందా అనిపించింది.

మధ్యాహ్నం 12 గంటలకు పాలాభిషేకం తర్వాత పూజలవీ జరిగాయి. దాని తర్వాత "మాతృశ్రీ సంస్కృత పాఠశాల" ద్వితీయ వార్షికోత్సవం జరిగింది. పాఠశాల ఆచార్యుల వారు శ్రీ భద్రాద్రిరామశాస్త్రిగారు ప్రసంగిస్తూ దేవభాషలో, ఆ భాషయొక్క ప్రాశస్త్యాన్ని, ప్రాముఖ్యతనూ గూర్చి చెప్తూ, తన విద్యార్థినులు అమ్మ అనుగ్రహంతో అచిరకాలంలోనే ఆ భాషయందు అద్వితీయులు కావాలనీ, అదే తన ఆశయమనీ చెప్పారు. అనంతరం విద్యార్థినులు తాము సముపార్జించిన విద్యను సోదర సదస్యులకు ఆంధ్ర సంస్కృతభాషలలో ప్రదర్శించారు. ఆ తర్వాత ఆచార్యులవారు వారికి యోగ్యతాపత్రాలు అమ్మచే ఇప్పించారు. అందులో మన్నవ మంగతాయారు అభిజ్ఞ పరీక్షలో, పోతుకూచి హైమవతి పరిచయ పరీక్షలో ప్రథమాంకం గణించి నందుకుగాను బాపట్ల వాస్తవ్యులు శ్రీ ఏలేశ్వరపు నరసింహారావు గారు బహూకరించిన "శకుంతల," "శ్రీ కృష్ణలీలామృతం" అన్న గ్రంథాలు అమ్మచే యివ్వబడ్డాయి.

ఈ ఉత్సవం తర్వాత అమ్మ అందరికీ తీర్థప్రసాదాలు ఇచ్చి వేదికమీద నుండి లేచేటప్పటికి సాయంత్రం నాలుగు గంటలయింది.

12వ తేదీ సాయంత్రం "ఆశీర్వచన" తతంగం అమ్మ ఇంటి ఎదురుగా పందిట్లో అమ్మ పాదసన్నిధిన జరిగింది. వెంకాయమ్మగారి కుటుంబ సభ్యులకు అమ్మచే బట్టలు ఇప్పించారు.

గత మూడురోజుల నుండి రాత్రిపూట హరికథాగానం చేయబడుతున్నది. అమ్మ దర్శనార్థమై వచ్చిన ఆ హరిదాసులు ఒకరు ఉత్తర గోగ్రహణం, మరొకరు రుక్మిణీ కళ్యాణం చెప్పారు.

ఆ ఉదయం సంకీర్తనలో తరుచుగా పొన్నూరు నుండి వచ్చే హనుమంతరావనే అంధసోదరుడు చేసిన నృత్యం అందరి మేనులను పులకరింప చేసింది. అమ్మ నయనాలు ఆర్ద్రపూరితమైనాయి. నిజంగా వీరాంజనేయుడివలెనే విజృంభించాడు.

ఆ రాత్రి నామం కూడా అదేవిధంగా చేస్తుండగా లోపలిగదిలో కూర్చుని మాట్లాడుతున్న అమ్మ ఇకస్నానానికి వెళ్ళొస్తానంటూ లేచి, స్నానానికి వెళ్ళకుండా మందిరంలోకి వెళ్ళి అన్నయ్య వెనుకగా కూర్చున్నారు నేలమీద. ఊరికేకాదు తనూ నామం చేస్తూ తన చర్యకు సంతోషంతో కేరింతలు కొడ్తున్న వారందరివైపు చిలిపిగా చిరునవ్వు చిందిస్తూ నామం చెయ్యమని చెప్పసాగారు. ఆ మధుర దృశ్యాన్ని తమ కెమేరాలతో బంధించారు అడపా రామకృష్ణరావుగారు, చీరాల డాక్టరు గారు. దాదాపు 2 గంటల పాటు ఆ ఆనందాబ్దిలో అందర్నీ తేలియాడించి అమ్మ 11 గంటలకి స్నానానికి లేచి వెళ్ళారు అక్కడి నుండి.

14వ తేదీ భోగినాటి ఉదయం సప్తాహం పూర్తి అయి మంగళహారతి ఇచ్చారు అమ్మకు. ఈ రోజే ధనుర్మాసం చివరిరోజు. యతిరాజులు గారు ఆ చివరిపూజ చేసి మూడురకాల ప్రసాదాలు చేయించారు.

ఆనాటిరాత్రి పూజాసమయంలో పుష్పాలూ ఆకులతో పాటు రేగుపళ్ళూ అమ్మ పాదాలమీద పోశారు. పూజానంతరం అమ్మ లోపలకు వెళ్ళి మామూలు అలంకారంతో వరండాలోకి వచ్చి నాన్నగారికి బొట్టుపెట్టి పాదాలమీద పూలువేసి భోగిపళ్ళు పోసి, ఆ తర్వాత యావత్సోదరులు పందిట్లో అమ్మచే భోగిపళ్ళు పోయించుకొనుటకై బారులుతీర్చి కూర్చోగా తాను స్వయంగా భోగిపళ్ళు పోశారు. అమ్మ లోపలికి వెళ్ళి తిరిగివచ్చే కాలవ్యవధిలో అడపా రామకృష్ణరావుగారు కొన్ని ఫోటో స్లైడ్స్ ప్రదర్శించారు.

15వ తేదీ సంక్రాంతినాడు ఉదయం అమ్మ వేదిక మీదకు వచ్చేటప్పటికి 11 అయింది. ఆనాటి వేదిక అలంకరణ కానీ, సోదరీ సోదరులతో క్రిక్కిరిపిన పందిరి సందడికానీ ఒక ప్రత్యేకతను స్ఫురింపచేశాయి.

అనంతరం ఇంతవరకూ మాతృశ్రీ సంచికలో ధారావాహికంగా వెలువడిన "మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు" 'రహి' చే రూపుదిద్దుకొని మొదటి

భాగంగా వెలువడి ఈ శుభసమయంలో అమ్మచే ఆవిష్కరింపబడింది. వైభవోపేతంగా జరిగిన ఈ ఆవిష్కరణోత్సవంలో రచయిత, ఆ గ్రంథాన్ని ప్రచురించిన మాతృశ్రీ పబ్లికేషన్స్ వారేకాక అడపా రామకృష్ణారావుగారు, మొసలికంటి తిరుమలరావుగారు (ఎమ్.పి.) భద్రాద్రి రామశాస్త్రిగారు, కొప్పురావూరి సత్యనారాయణగారు, అచ్యుతుని రామకృష్ణశర్మగారు మొదలైన సోదరులు ప్రసంగిస్తూ ఆ గ్రంథ పాశస్త్యాన్ని వివరించి, ఆ గ్రంథరచయిత ఔన్నత్యాన్ని బహుధా ప్రశంసించారు. పన్నాల రాధాకృష్ణశర్మగారు, పి.యస్.ఆర్. ఆంజనేయులుగారు, యార్లగడ్డ రాఘవయ్యగార్లు కూడా ప్రసంగిస్తూ శ్లోకాలను, పద్యాలను చదివారు.

ఆ తర్వాత ఆ సోదరులకేగాక మాతృశ్రీ ముద్రాక్షరశాలలో పనిచేసే పనివారలందరికీ ఆ గ్రంథాలు అమ్మ ఇచ్చారు. ఆవిష్కరణకు ముందు అన్నపూర్ణ అమ్మ పాదాలు కడిగి పారాణిపెట్టి బంతిపూలతో పూజచేసింది.

ఆ వేదికమీదే మధ్యాహ్నం అమ్మచే చంద్రమౌళి సీతారామయ్యగారు సంస్కృత భాషయందు గణుతి కెక్కుతున్న సోదరీమణులకు తమ సంతోషాన్ని వ్యక్తపరుస్తూ విద్యార్థినులందరకు బహూకరించిన సంస్కృత గ్రంథాలను ఆచార్యుల వారు తమ విద్యార్థినులకు ఇప్పించారు. **– జనవరి, 1968**



# అర్కపురి విశేషాలు

**1968 జనవరి 21** ఉదయం సోదరుడు రాధాకృష్ణారెడ్డి తొలిసారిగా చేసిన 'అనసూయావ్రత' సమయంలో మాతృశ్రీ జీవిత మహోదధి నుండి కథాపఠనం జరిగింది. ఫలశ్రుతిలో "ఈ వ్రతం ఆచరించి కథాశ్రవణం చేస్తే మనం అనుకున్నది జరగదు అమ్మ అనుకున్నది మాత్రమే జరుగుతుందని తెలుస్తుంది. బాధలంటే ప్రేమ ఏర్పడుతుంది" అని చెప్తూ "చివరకు బాధల భగవంతుని సాక్షాత్కార మౌతుంది" అన్నారు. ఆ సాయంకాలమే కథాశ్రవణ ఫలం నిరూపితమయింది.

**జనవరి 25** ఉదయం బొంబాయినుండి వచ్చిన ఇద్దరు సోదరులలో ఒకరు తన పునర్వివాహాన్ని గురించి అమ్మను సలహా అడిగారు – అందువల్ల తన క్షేమైన మనశ్శాంతి చేకూరుతుందా అని. వారితో ఒక అరంగట పాటు సంభాషించాక చివర్లో అమ్మ అన్నారు "నేను సలహా ఇచ్చినా దాని ప్రకారం నువ్వు చెయ్యలేవు నాన్నా, నేను వద్దంటే మానగలవా ? నీకేది ఉంటే అది జరుగుతుంది. మనశ్శాంతి అంటే అది నీ మనస్సును బట్టి ఉంటుంది కానీ పెళ్ళిమీద మాత్రం ఆధారపడిలేదు".

**జనవరి 26** ఉదయం ఈ గ్రామంలోని ప్రాథమిక పాఠశాలలోని విద్యార్థులంతా ఉపాధ్యాయుల, ప్రధానోపాధ్యాయుని ఆధ్వర్యాన 'రిపబ్లిక్' దినోత్సవ సందర్భంగా అమ్మకు వాళ్ళ బడితోటలోని బంతిపూలతో పూజ చేసుకుని అమ్మను గూర్చిన పద్యాలు – పాటలు పాడారు. బారులుతీర్చి కూర్చొని తన వంక క్రొత్తగా, అమాయకంగా, వింతగా, నిర్మలంగా చూస్తున్న ఆ పసివాళ్ళను చిరునవ్వుతో వీక్షిస్తూ అమ్మ వాళ్ళకు తీర్థ ప్రసాదాలు ఇచ్చి వాళ్ళ ప్రధానోపాధ్యాయునితో అన్నారు – ఈ పూట భోజనాలు వీరికిక్కడే పెట్టించండి అని. అన్నపూర్ణాలయంలోని శేషయ్యగారికి కబురు చేశారు. మరో అరగంటలో అమ్మ సమక్షంలోనే ఆ విద్యార్థులందరికి విస్తళ్ళు వేయబడ్డాయి. వాళ్ళ భోజనాలు పూర్తి అయ్యే వరకు అమ్మ అక్కడే కూర్చున్నారు. ఈ లోపు కొందరు అమ్మను దర్శించటం, పూజ చేసుకొనటం, తీర్థప్రసాదాలు తీసుకోవటం జరిగింది. ఆ సాయంత్రం 4 గంటలకు విడవలూరు నుండి ఆ వూరి కాలేజి ప్రిన్సిపాల్ సుదర్శనంగారు కుటుంబంతో వచ్చారు. ఆ రాత్రి ఆ దంపతులు ఒకవైపు పురోభివృద్ధి గాంచుచున్న సైన్సు గురించి, మరోవైపు తిరోగమిస్తున్న ఆచార వ్యవహారాల గురించి, సాధన, మాయా, సమాధిస్థితి – వీటిని గురించి అమ్మతో సంభాషించారు.

**జనవరి 27 ఉదయం** హనుమంతరావుగారు (బాపట్ల తాలూకా సర్వేయరు) వాళ్ల బాబు 'బారసాల' ఇక్కడ జరుపుకున్నారు. ఉదయం పూజానంతరం బాబుకు 'ప్రేమకుమార్' అనీ, వారి అమ్మాయికి 'వాత్సల్య' అనీ పేరు పెట్టారు అమ్మ. సాయంత్రం బాలింతరాలిచే నూతిలో చేద వేయించటం, బాబుని ఉయ్యాలలో వెయ్యటం - ఆ వేడుకలు జరిగాయి. వాళ్ళు సెలవు తీసుకొని వెళ్ళారు.

ఆ పేరంటానికి మందు అమ్మ హాల్లో కూర్చున్నప్పుడు హనుమంతరావుగారు అడిగారు "పురిటిమైల అనీ, 21వ రోజు వరకు తాకకూడదనీ, నూతిలో చేదవేయించటంలాంటి నియమాలన్నీ ఎందుకు ఏర్పరచారు ? ఆచారం అంటే ఏమి" టని.

"ఆచరించినదే ఆచారం" అంటూ అమ్మ పెద్దవాళ్ళు అట్లా ఏర్పరచవలసిన అవసరం. నోములూ - వ్రతాలూ ఏర్పరచిన ఉద్దేశం. ఈ నియమాలు నిష్ఠల వలన మానసికంగా మనిషి ఏ విధంగా ఎదిగేదీ, మడీ ఆచారాల వలన కలిగే ప్రయోజనాలూ చెప్పారు.

**30. ఉదయం** ఆరు నెలల క్రిందట వైద్యనిమిత్తమై ఇక్కడనుండి మద్రాసు వెళ్ళిన లంకా శర్మగారూ, సంగీత దర్శకులు పామర్తి వేంకటేశ్వరావుగారూ వచ్చారు.

పంచామృతాలతో పాటు నారింజ, కమలా, బత్తాయి, ద్రాక్షరాసాలతో, అరటిపండు, బెల్లం, పంచదార, పటికబెల్లం, జీడిపప్పు, యాలకులపొడి వేసి సోదరీబృందం శ్రీ సూక్తం చదువుతుండగా అమ్మ పాదాలు అభిషేకించి, అమ్మ సహస్రనామావాళి, త్రిశతి, ఖడ్గమాలా, అష్టోత్తర నామావళులు చెప్తుండగా, గులాబీ, చామంతి, దమనం, మరువం, లిల్లీపుష్పాలతో, తులసీదళాలతో, కుంకుమతో దక్షిణాది పూజా విధానంలో పామర్తివారూ, శర్మగారూ పూజ చేసుకున్నారు ఆ ఉదయం.

ఆ సమయంలోనే కాకుమాను నుండి వచ్చిన ఒక సోదరుడు వాళ్ళ బాబుకి అమ్మచే అన్నప్రాశన చేయించుకున్నాడు.

ఆ రాత్రి అమ్మ కబుర్లు చెప్తున్న సమయంలో అవకాశం చూచి నందిగామనుండి వచ్చిన రమణరావుగారు తన సందేహాన్ని అడిగారు - "ఏదైనా ఒక పని జరగాలంటే మా కోరిక బలవత్తరంగా ఉండాలా. లేక మీ సంకల్పం ఉండాలా?" అని. అమ్మ అన్నారు. "నా సంకల్పమే. ఏదైనా నేనేగా మీకు ఇచ్చేది" అని."అవును అదే కన్పడ్తున్నది" అంటూ అన్నయ్య తనకు సంధ్య వారుస్తున్నప్పుడు, పడుకోబోయేముందు, బైటికి వెళ్ళినచోట, కరణీకం లెక్కలు చేసుకుంటున్నప్పుడు

అమ్మ కనిపించటం, ఆ అమ్మను చూస్తూ తమ ఆ పనులను మర్చిపోవటం గూర్చి చెప్పుకున్నారు. అమ్మ కనిపించటం భావనా మాత్రంగా కాక సాక్షాత్కారమే జరుగుతున్నదిట. అయితే అది ప్రత్యేకించి తను ప్రార్థిస్తున్నప్పుడు జరగదుట.

ఇదంతా వినీ రుక్మిణి అక్కయ్య అడిగింది, అన్నయ్య చెప్తున్నదంతా మౌనంగా వింటున్న అమ్మను – "ఇక్కడే కూర్చుని మాకు కనపడ్తావుగా అమ్మా ! ఎప్పుడు వెళ్తావు మరి ఈ పనులు చెయ్యటానికి ?" అమ్మ నవ్వి సమాధానం యివ్వకుండా ఆ ప్రస్తావన మార్చారు.

**జనవరి 31 ఉదయం** అమ్మతో తన ఆస్తివ్యవహారాలు, భవిష్యత్తు, తనకున్న ఉద్దేశ్యం గూర్చి చెప్తూ –"జీవితంలో సగం కాలం భగవాన్ సన్నిధిలో గడిచిపోయింది. ఇప్పుడు వృద్ధాప్యదశ వచ్చింది. రమణాశ్రమంలోనే ఉంటున్నాను. ఉన్నంతకాలం ఉండి ఎప్పడైనా ఇక్కడకు రావాలనిపిస్తే వస్తాను. మీ సన్నిధిలో ఉండిపోవాలని ఉన్నది. మీరు ఏమంటారమ్మా" అని అడిగిన కృష్ణభిక్షుగారితో అమ్మ అన్నారు వాత్సల్యంతో "తప్పకుండా ఉండు నాయనా, ఈ మాట పదేళ్ళక్రితం నువ్వు ఇక్కడకు వచ్చినప్పుడే చెప్పాను. అమ్మ దగ్గర నీకు అడ్డూ ఆటంకం రెండూ లేవని. నీ కిష్టమైనంత కాలం నీకు ఇష్టం వచ్చిన చోటే ఉండి, నీకు ఇక్కడకు రావాలనిపించి నప్పుడే రా. ఈ ఇంటి తలుపులు ఎప్పుడూ తెరిచే ఉంటాయి".

**1968 ఫిబ్రవరి 1 ఉదయం** 11–30లకు పన్నాల రాధాకృష్ణశర్మగారి పుత్రుడు ప్రేమేందు శేఖర్ పుట్టు వెంట్రుకలు తీయబడ్డాయి. ఆ తర్వాత వారిచే రచించబడిన 'సందేశగీతావళి', లోని గీతాలు సోదరీబృందం గానం చేస్తుండగా, 'అంబికా సహస్రనామస్తోత్రమ్' లోని నామాలు వారే స్వయంగా పఠిస్తూ సతీ సమేతంగా అమ్మకు పూజ చేసుకున్నారు.

**ఫిబ్రవరి 5 ఉదయం** అనంత సీతాచలంగారు తమ ద్వితీయ పుత్రుని అమ్మచే పెళ్ళికొడుకు చేయించుకున్నారు.

**ఫిబ్రవరి 7 ఉదయం** మంచాల నుండి వచ్చిన రాజేశ్వరక్కయ్య అమ్మకు నమస్కారం చేసుకోవటానికి వచ్చి అమ్మ సాదరంగా పలకరించేటప్పటికి దుఃఖించసాగింది. ఆ దుఃఖంలోనే ఆర్తితో అమ్మను వేడుకోసాగింది :

"మనస్ఫూర్తిగా నీ పాదాలను నమ్ముకునేట్టు చెయ్యమ్మా. వీటి మీద (లౌకిక విషయాలు) ఉన్నంత ప్రేమ నీ మీద ఉండటం లేదమ్మా. నిన్ను పూర్తిగా ప్రేమించి, నీకోసం ఆత్మార్పణమయ్యే శక్తి ఇవ్వమ్మా" అంటూ దుఃఖంతో జీరవోతున్న గొంతుతో మనసులోని ఆవేదనను తనకు నివేదిస్తున్న ఆ అక్కయ్య వంక నిశ్చలంగా చూస్తూ

అదే స్వరంతో అన్నారు అమ్మ "ఫర్వాలేదు. నమ్మకపోయినా ఫర్వాలేదమ్మా" అని.

కానీ ఆ అక్కయ్య వినిపించుకోలేదు. రెండు లేని అమ్మకు ఆ స్థితి కానీ తన ఆకాంక్షను నెరవేర్చమని కోరింది.

ఆ రాత్రి అమ్మ వరండాలో కూర్చున్నప్పుడు కావలి నుండి వచ్చిన ఒక వృద్ధురాలు తను పెన్నానది వద్ద కృష్ణాశ్రమము ఒకటి కట్టించానని. అందులో కృష్ణ ప్రతిష్ఠ చెయ్యాలని ఎంత ప్రయత్నించినా ఏవో ఆటంకాలు వచ్చి ఆ పనికి విఘ్నం కలుగుతున్నదని, ఆ ప్రతిష్ఠ ఎప్పుడు జరుగుతుందని ప్రశ్నించింది.

"భగవంతుని ప్రతిష్ఠ మనం కాదుగా చెయ్యాల్సింది. మనకేం సాధ్యమౌతుంది ? ఇక్కడ ఆయనకు ఉండాలని ఉంటే అదే జరుగుతుంది. అంతటా ఉన్న భగవంతుడిని ఒక చోట 'ఇక్కడ ఉన్నాడని' ప్రతిష్ఠిస్తున్నామంటే మన గుర్తుకోసం మన లక్ష్యం కోసం. దాన్ని విగ్రహం, రాయి అనుకోవటం లేదుగా. అందులో ఉన్నాడనుకుంటున్నాము. అక్కడ ఆయనకు ఉండాలనిపిస్తే అదే జరుగుతుంది." అమ్మ ప్రత్యుత్తరం విని ఆవిడ మళ్ళీ ప్రశ్నించింది –"మనం ప్రయత్నం చేస్తున్నాముగా ఇప్పట్లో అది జరుగుతుందా ? లేదా?"

**అమ్మ** : నాకు తెలియదమ్మా. ప్రయత్నం చేస్తున్నారుగా చెయ్యండి. నేను వద్దు అనటం లేదు.

**ఫిబ్రవరి 8 వ** తేదీన మొసలికంటి తిరుమలరావుగారు తమ 68వ పుట్టినరోజు పండుగ అమ్మ సన్నిధిలో జరుపుకున్నారు.

ఆరాత్రి సిద్ధాంతిగారు పెట్టిన ముహూర్తం సమయాన్న ఒకటింబావుకు కొప్పురావూరి సత్యనారాయణ దంపతులు, వారి అల్లుడు అమ్మకు పూజ చేసుకొని వారు కొత్తగా ఆరంభించబోయే వ్యాపార పుస్తకాల మీద అమ్మచే గంధం కుంకుమలతో వ్రాయించుకున్నారు.

**ఫిబ్రవరి 9వ తేదీ** మధ్యాహ్నం తెనాలి నుండి వచ్చినవారు అమ్మచే వాళ్ళ బాబుకి పేరు పెట్టించుకున్నారు. 'ప్రేమకుమార్' అని నామకరణం చేశారు అమ్మ.

సాయంత్రం స్నానానికి వెళ్ళబోతూ దానికి ముందు జరిగిన ప్రసంగంలో ఏదో మాట ఇప్పటికి 14 సంవత్సరాల వెనుకటి సంగతులు – ఆ రోజులు, అప్పుడు అక్కడకు వచ్చి వెళ్తుండే జనాభా, ఆ పరిస్థితులు, ఆ సంఘటనలు కొన్ని చెప్పారు.

రాత్రి రామకృష్ణ అన్నయ్య వాళ్ళ బామ్మచే అమ్మకు చీర పెట్టించి పూజ చేయించాడు. ఆమెకు కుడిచెయ్యి మణికట్టు దగ్గర ఎముక విరిగినందున ఎడంచెయ్యితో పుష్పాలు అమ్మ పాదాల మీద పెట్టటానికి సందేహిస్తుంటే అమ్మ అన్నారు "ఫర్వాలేదు పనికి వస్తుంది. ఆ చేత్తోనే చెయ్య"మని. పూజానంతరం తీర్థానికి ఆమె కుడిచెయ్యి చాచలేకపోతే అమ్మ ఉద్ధరిణతో ఆమె నోట్లో వేశారు తీర్థం.

ఆ ఉదయం గుంటూరు నుండి వచ్చిన దంపతులు ఆ సమయంలో అమ్మ దగ్గర సెలవు తీసుకోగా అమ్మ వారిద్దరికి నూతన వస్త్రాలు పెట్టి కట్టుకురమ్మన్నారు.

అనారోగ్య కారణంగా మళ్ళీ అమ్మను చూడగలుగుతానో లేదో తిరుగుతున్నప్పుడే ఒకసారి అమ్మను దర్శించుదామన్న భర్త కోరిక ననుసరించి అమ్మ దర్శనార్థమై వచ్చిన ఆ సోదరి తన సుమంగళీత్వాన్ని గూర్చి కన్నీళ్ళు పెట్టుకుంటే అమ్మ అన్నారు – ఆమె శిరస్సు లాలనగా నిమురుతూ "ఈ సమయంలో నువ్వు ఏడ్వకూడదు. నీ ధర్మం ఆయన కూడా ఉండి సక్రమంగా నెరవేర్చు" అని. ఆమె భర్తతో "నువ్వు ఎప్పుడూ నామం చేసుకుంటూ ఉండు, నాన్నా. ఈ స్థానం (తన దగ్గర) నీకెప్పుడూ ఉన్నది. నా దగ్గరే వుంటావు నువ్వు ఎప్పుడూ" అని చెప్పి తిరిగి ఆమెతో "ప్రక్కన ఉండి సేవ చెయ్యి నువ్వు. ఇంత కంటే మిగిలిదేమున్నది మనకు ? కంట నీరు పెట్టకుండా ధైర్యంగా ఉండు" అన్నారు.

**ఫిబ్రవరి 10** ఉదయం రావిపాడు నుండి తరచుగా ఇక్కడకు వచ్చే ఒక సోదరుడు వారి వదినగారి కుమారుడు వివాహం జరిగిన తరువాత ఆ పెళ్ళిబట్టలతోనే ఇక్కడకు తీసుకువచ్చి ఆ వధూవరులచే అమ్మకు పూజ చేయించారు.

ఆ సాయంత్రం క్రితంరోజు గుంటూరులోని హిందూకాలేజీ హైస్కూలు వాళ్ళు ఏర్పాటు చేసిన "అమ్మ హరికథ"ను చెప్పటానికి గాను వెళ్ళి సాయంత్రం తిరిగి వచ్చిన యేర్లగడ్డ రాఘవయ్యగారిని అక్కడ కబుర్లను గూర్చి అడగసాగారు. హాలునిండా ఆనాటి నూతనాగతులేకాక ఆవరణలోని కొంతమంది సోదరీ సోదరులున్నారు. సంభాషణ సరదాగా. ఛలోక్తులతో సాగింది.

**– ఫిబ్రవరి, 1968**

# కోన వెంకాయమ్మ

అన్నట్లుగానే అమ్మ ఉదయం ధనుర్మాస పూజకాగానే క్రికెట్ ఆట చూడాలనుకున్నారు. అప్పటికి రవీవాళ్ళూ ఆట ఆరంభించారు. ఇంతలో వెంకాయమ్మగారు దగ్గర నుండి కబురు రావటంతో పూజకు వెళ్ళబోతున్న అమ్మ ఆగి ఇటు డాబాలోకి వచ్చారు.

దాదాపు సంవత్సరం పైగా జలోదరం వ్యాధితో బాధపడ్తున్నారు ఆమె. పదినెలల క్రిందట ఆమె ఇక్కడకు వచ్చారు. అప్పటి నుండి ఇక్కడే ఉన్నారు. అప్పుడప్పుడు హెచ్చుతూ, తగ్గుతూ ఆ వ్యాధి ఆమెని ఆశానిరాశాల మధ్య ఊయల ఊగిస్తున్న వారం రోజుల క్రిందట నుండి హెచ్చు అయిన ఆ వ్యాధి ఈసారి ఆమె మరణాన్ని నిశ్చయంగా తెలిపింది. ఈ రోజు ఆమె మరీ భారంగా ఉన్నారు.

అమ్మను చూడగానే నమస్కారం చెయ్యటానికి చేతులు ఎత్తబోతుండగా అమ్మ ఆమెకు ఆ శ్రమ లేకుండా తన పాదాలు ఆమె చేతులను తాకేంత దగ్గరగా వీలుగా కుర్చీలో కూర్చుని ఆమె చెప్పకుండానే టెంకాయ కర్పూరం తెప్పించి ఆమె చేతిని తను పట్టుకొని పూజ చేయించుకుంటూ ఆమెతో మాట్లాడసాగారు.

ఆమె కోసం దుఃఖిస్తున్న ఆమె కుటుంబ సభ్యుల గురించి "వాళ్ళను ఏంచేసి వెళ్తావు ? వాళ్ళు ఎట్లా ఏడుస్తున్నారో చూడు" అన్నారు. ఆమె తమాషాగా నవ్వారు 'నీ సన్నిధిలో ఉన్నవాళ్ళను గురించి నువ్వు అట్లా అడగటమేమిటి, అన్నట్లుగా. ఆ సమాధానమే ఇచ్చి "వాళ్ళ అవసరాల కోసం నేను ఉండడంలేదు. కాబట్టి వాళ్ళ కోసం వాళ్ళు ఏడుస్తున్నారు. నన్ను ఇక ఇక్కడ ఎందుకు ఉంచుతున్నావు ? త్వరగా నీలోకి తీసుకో. నీ పాదాల్లో కలుపుకో" అన్నారు.

"పూర్వంలా చనిపోయాక ఏమౌతాను. ఏవేవో లోకాలున్నాయన్న భయం కలుగుతూందా ?"

"లేదు. నేను నీ దగ్గరకు వస్తున్నాను. ఇప్పటికంటే ఇంకా దగ్గరగా ఉంటాను అనిపిస్తున్నది" వాళ్ళు ఈ విధంగా సంభాషిస్తుండగానే అడపావారి, డాక్టరుగారి కెమేరాలు పనిచెయ్యసాగాయి. తను మరణిస్తున్నాని తెలిసి కూడా ఇంత ప్రశాంతంగా నిర్భీతిగా సమాధానాలు ఇస్తున్న ఆమెను చూసి అడపావారు అన్నారు

"మృత్యుంజయత్వమంటే ఇదేగా" ఒకప్పుడు మృత్యుంజయత్వం అంటే చావును గురించి ఆలోచనా, భయం లేకపోవటమే అని చెప్పిన అమ్మ సూక్తిని తలచుకుంటూ.

ఆ తర్వాత ఆమె కోరిక మీద అప్పుడే ఆమెకు ఎదురగానే అమ్మకు ధనుర్మాసపూజ జరిగింది. ఆ ఏర్పాట్లు చేసేలోగా అమ్మ డాబా పోర్టికోలో కూర్చునీ వాళ్ళ ఆట చూశారు.

పూజా సమయంలో గుంటూరు నుండి వచ్చినవాళ్ళు వాళ్ళ పాపకు అమ్మచే నామకరణం చేయించారు. పేరు 'వాత్సల్య'.

పూజ ముగిసి ఊళ్ళకు వెళ్ళేవాళ్ళు ప్రసాదాలు తీసుకొని అంతా భోజనానికి వెళ్ళేటప్పటికి మూడు అయింది. అమ్మ స్నానం చేసి మళ్ళీ వస్తానని ఇంటికి వచ్చారు.

తిరిగి సంధ్యావందనం జరుగుతుండగా దాదాపు 6-30 కు ఆమె దగ్గరకు వెళ్ళారు. ఈ కొన్ని గంటల్లోనే ఆమెలో వచ్చిన మార్పును గమనించారు. ఆయాసం ఆమె శరీరాన్నంతా కదిలించి వేస్తున్నది. తైలం అయిపోతే ఒత్తి కాంతి తగ్గినట్లుగా ఆమెలోని 'జీవకళ' తగ్గిపోసాగింది. కంటి చూపులో మార్పు కనిపించింది.

వాంతులౌతూ అందులో కఫం అడ్డొచ్చి విఫరీతమైన బాధ అనుభవిస్తున్న ఆమె దగ్గకు కూర్చొని 'కార్బోవేజ్' ఒకడోస్ వేయించి ఆమె కాస్త తేరుకున్నాక ఆమెచే పూజ చేయించుకున్నారు. ఆవు నెయ్యితో దీపారాధన చెయ్యాలని ఎన్నాళ్ళనుండో అనుకుంటున్నదట ఆమె. అమ్మ ఆమాట ఆమె కర్పూరనీరాజనం ఇస్తున్నప్పుడు అడిగారు "ఎటూ ఇంకా కాసేపట్లో చేస్తారు. ఇప్పుడే చేస్తావా"? ఆమె తలూపింది అంగీకారంగా. వెంటనే అమ్మ ఆవునెయ్యితో దీపారాధన చేయించారు. అమ్మ వారిస్తున్నా వినిపించుకోకుండా అతి కష్టం మీద చేతులెత్తి ఆ దీపారాధనకు నమస్కరించింది ఆమె.

ఇదంతా చూస్తూ దూరంగా నిలబడిన డాక్టరు జ్యోత్స్నను, వెంకాయమ్మగారి సోదరుడు పొత్తూరి వెంకటేశ్వరరావుగారిని "భయం ఏముంది ? ఎందుకు బాధపడటం ? దగ్గరకు రండి" అంటూ వాళ్ళని దగ్గరికి పిలిచి కూర్చోపెట్టు కున్నారు. "చూడరా, మొదట్లో నన్ను పెళ్ళి చేసుకున్నదని కూతురితో ఎంత

విముఖంగా ఉండేది? మిగతా పిల్లల గురించి వాళ్ల నాన్న గురించి ఎంత దిగులుపడేది ? ఇప్పుడు ఎంత స్థిమిత పడిందో చూడు – ఆమె నవ్వుతూ వెళ్తుంటే మధ్య మనం ఎందుకు బాధపడటం" అన్నారు. ఆమె పరిస్థితి చూచి బాధపడ్తున్న వెంకటేశ్వరరావుగారితో. అందరిచూపులు ఒక్కసారిగా ఆమె మీద కేంద్రీకరించ బడ్డాయి. ఒక్క నిమిషంసేపు ఆవ్యాధితో అంత బాధపడ్తున్నా ఆమె వదనంలో ఎక్కడా అబాధ తాలూకూ చిహ్నం లేదు. స్థిరపడిన ఆమె మనస్సు ఉన్నది చాలా ప్రశాంతంగా.

బామ్మ, హనుమాయమ్మవాళ్ళ అంత్యదశలు గురించి మాకు చెప్పుకొస్తూ వెంకాయమ్మగారి గురకచూసి ఆందోళన పడ్తున్నవారి సంతృప్తికోసం మధ్య మధ్య ఆమెను పలకరించసాగారు "నేనెవరో నీకు తెలుస్తున్నానా, రాధ నామం వినపడుతున్నదా, నీ ఎదురుగా ఉన్నది ఎవరో చెప్పు" అంటూ. మాట్లాడటానికి శక్తి లేక శిరస్సుతో కళ్ళతోనే సమాధానాలు ఇచ్చింది ఆమె. "ఈ జబ్బుకు తెలివి తప్పాల్సిన అవసరం లే" దన్నారు అమ్మ.

అమ్మ మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్య మధ్య కుర్చీలో వెనక్కివాలి కళ్లు మూసుకోసాగారు. అమ్మ కూడా అస్వస్థతగా ఉన్నారు. కఫంతో కూడిన దగ్గు, జ్వరం ఆయాసం వీటితో బాధపడ్తున్నారు. ఆ శోకమయవాతావరణంలో అమ్మ మాటలే కాస్త తెరిపిగా ఉండేవి. ఆ ధ్వని వినపడనప్పుడు ఆ క్షణాలు ఎంతో బరువుగా నెమ్మదిగా జరుగుతున్నట్టు ఎవరికి వాళ్ళకి అనిపించసాగింది. నామం చేస్తున్న రాధన్నయ్యతప్ప మిగతా అంతా జరుగుతున్నదంతా నిశ్శబ్దంగా చూస్తూ కూర్చున్నారు. ఇంతలో శోకావేగాన్ని ఆపుకోలేక బావురుమన్నారు సుబ్బారావుగారు (ఆమె భర్త). అమ్మ వారిని దగ్గరకు తీసుకుంటూ – ఈ భయంకర గంభీర వాతావరణము, తమ్ముడు పోతుకూచి జ్ఞాపకాలు, గుండెలను కలచివేస్తుండగా స్రవిస్తున్న కన్నీటిని అమ్మ చూడకుండా దాచుకోవటానికి అవస్థపడ్తున్న జ్యోత్స్నని చూచి అమ్మ ఆ వాతావరణాన్ని మార్చటానికి వెంకాయమ్మగారి వ్యాధిగురించి, ప్రస్తుత స్థితిని గురించి మీ వైద్యశాస్త్రం ఏం చెప్తుందంటూ జ్యోత్స్నను ప్రశ్నించసాగారు.

ఆ సంభాషణ మధ్యలో జ్యోత్స్న అమ్మను అడిగింది, "ప్రాణం ఎట్లా పోతుందమ్మా ? ఆ క్షణంలో ఏమౌతుంది ?" "ఏమౌతుంది ? వాయువు

వాయువులో కలుస్తుంది. అది ఒక్కసారిగా శరీరంలో నుండి పోయినట్లుండదు. ఎక్కడికక్కడ అంతా అణిగినట్లు అనిపిస్తుంది. ఆ క్రియ దగ్గరుండి చూస్తున్నా అర్థంకాదు. అంతే. పువ్వు వికసిస్తున్నప్పుడు నువ్వు రెండు కళ్ళు గ్రుచ్చి చూసినా అది ఎట్లా వికసిస్తుందో నీకు అర్థం కాదు. వికసించక ముందు, వికసించిన తర్వాతే చూడగలవు. ఇదీ అంతే" అంటూ వెన్న కరగటం కూడా ఉదాహరణగా చెప్పారు. జ్యోత్స్న అడిగింది "ప్రాణం కళ్ళలో నుండి, నోట్లో నుండి పోతుందంటారు నిజమేనా అమ్మా?" అమ్మ "అదేంలేద"న్నారు.

ఇట్లాగే సంభాషిస్తూ అమ్మ టైమ్ పదిదాటిందా అని అడిగారు. దాటింది అని సమాధానం రాగానే "ఇంకా రెండు గంటలు" అని స్వగతంగా అనుకుంటూ లేచి శ్రీరామమూర్తిగారిని పిలిచి పెట్రోమాక్సులైట్లు వెలిగించండి అంటూ ఆమె అంత్యక్రియలకు కావాల్సిన ఏర్పాట్లు చెయ్యసాగారు. ఇదంతా చూసి రామకృష్ణ అన్నయ్య అన్నాడు, "ఇంకా ఆమె బ్రతికే ఉన్నదిగా అమ్మా" అని.

అమ్మ నవ్వి "ఇంకా ఏమున్నది అక్కడ ? తేదీ మారటం కోసమేగా ఆ ఊపిరి" అన్నారు. ఆమెను డాబా వెనుకగా ఉన్న పశువులపాకలో పడుకో పెట్టబోయేముందు అమ్మ సుబ్బారావుగారిని అడిగారు, "ప్రాణం పోయేముందు ఆమె మంచం మీద ఉంచవచ్చు. నాకేం లేదు ఆమె మంచమ్మీద పోయినా, రాత్రికైనా దహనం చేస్తాను. అన్నీ నా చేతిమీదుగా జరగాలనుకున్నది".

సుబ్బారావుగారు అందులో తన ప్రమేయం ఏమీలేదని అమ్మ ఎట్లా చేసినా తనకిష్టమే నని వాళ్ళ మామగారి గురించి సందేహం వెలిబుచ్చారు.

"సరే వారు వచ్చాక కానిద్దాము. ముందు ఆమెను పాకలో పడుకోబెట్టాలి" అని ఆమె దగ్గరకు వచ్చారు.

"ఇప్పటినుండి అక్కడ కూర్చుంటే మంచు కురుస్తోంది, చలిగా ఉన్నది" అన్నాడు రామకృష్ణ అన్నయ్య "ఎవరికి చలి ? నాకు లేదు. ఆమెకు లేదు. మీకేగా? పట్టాలు అడ్డుకట్టుకోండి – రేపు జనం పట్టేట్టుగా ఉండొద్దా" అన్నారు అమ్మ.

ఆమెను పట్టుకోవటానికి అన్నయ్యలు నలుగురు ముందుకు వచ్చారు. అమ్మ తల దగ్గర ఎత్తబోతుండగా సుబ్బారావుగారు నేనూ పట్టుకుంటాను అన్నారు.

"నేను కన్నదాన్ని, నువ్వు కట్టుకున్నవాడివి నాకేం లేదు పద" అంటూ వారికి కాళ్ళు ఇచ్చి తను తలయెత్తి సత్యం (ఆమె జ్యేష్టపుత్రుడు) చేతికిచ్చారు.

సావిట్లో దక్షిణంవైపు తలపెట్టి పడుకోబెట్టారు. ఆవు నేతి దీపారాధన తలవైపు పెట్టారు. అమ్మ తను ఆమె దగ్గరగా కూర్చొని దక్షిణపాదాన్ని ఆమె గుండెల మీద పెట్టారు. ఆ తర్వాత లేచి తులసినీళ్ళు గొంతులో పోశారు. గుటకలు వేసింది.

రాధన్నయ్య, గోపాలన్నయ్య, క్రిష్ణవేణక్కయ్య వాళ్ళని బాగా నామం చెయ్యమని చెప్పి అంతిమ దశలో ఉన్న తల్లిని చూస్తూ దిగులుగా కూర్చున్న ఆమె నలుగురి సంతానాన్ని దగ్గరగా తీసుకొని ఓదారుస్తూ, మాస్టరుగారు, తాతగారు వీళ్ళతో మాట్లాడుతూ అక్కడే అటూ ఇటూ తిరగసాగారు. ఇంతలో కెమేరా తీసుకొని డాక్టరుగారు వచ్చారు. వారిని వెళ్ళి ఆమె చెయ్యి చూడమన్నారు నాడి నడక ఎట్లా వున్నదో అని. ఇంకా ఎందుకంటూ నవ్వారు డాక్టరు గారు.

దేనికదే అంటూ అమ్మ డాక్టరుగారిని ఆమె దగ్గరికి తీసుకెళ్ళి ఆమె నాడి చూసి బరువుగా తీసుకుంటున్న ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాస గురించి మాట్లాడుకో సాగారు. ఆమెకు స్పృహ ఉన్నదా అని అడిగారు డాక్టరు గారు. ప్రక్కనే ఉన్న గ్లాసు నీళ్ళు ముఖాన చిలకరించారు. ముఖం చిట్లించింది ఆమె. "ఈ జబ్బుకు తెలివి తప్పాల్సిన అవసరంలే"దని మరోసారి అంటూ అమ్మా కుమారి ఏడుస్తుంటే దాని దగ్గరకి వెళ్ళారు.

అక్కడ కాసేపు కూర్చున్నారో లేదో ఇంతలో వెంకాయమ్మగారు అంతవరకు మూసిన నేత్రాలు విప్పటంతో గబగబా దగ్గరకు వచ్చారు. ముందుకు ఒంగి ఆమె చెవిదగ్గర నోరుపెట్టి అడిగారు "నన్ను గుర్తుపట్టావా?" అని పట్టాను అన్నట్లుగా ఆమె కళ్ళతోనే సమాధానమిచ్చింది.

అమ్మ "ఇంకా ఎందుకమ్మా - ముయ్యి ముయ్యి" అంటూ నెమ్మదిగా తలమీద తట్టారు. అంతే. నెమ్మదిగా ఆమె కళ్ళు మూసింది 12-25కు.

ఆ తర్వాత అమ్మ స్నానం చేస్తానంటూ అక్కడ నుండి ఇంటికి వచ్చారు.

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకి అమ్మ పాకదగ్గరకి వచ్చారు. పాక

అంతా సందడిగా ఉన్నది. ఆమె మృతదేహం శ్మశానానికి వెళ్ళటానికి కావల్సిన ఏర్పాట్లలో కొందరన్నయ్యలు నిమగ్నమైయుంటే, మరికొందరు నామం చేస్తున్నారు. ఇంకొందరు సుమంగళిగా వెళ్తున్న ఆమెను అలంకరించటానికి గాను పసుపు, కుంకుమ, పూలు సిద్ధం చేస్తున్నారు.

ఆమె తండ్రి సీతారామయ్యగారు, ముఖ్య బంధువులు వచ్చారు. పురోహితుడు రాగానే ఆ క్రతువు ఆరంభమైంది. అమ్మా సత్యం ఇద్దరూ కలసి చేశారు. ఆ దేహానికి స్నానం చేయించటం, దాన్ని అలంకరించటం అన్నీ. అనుకున్నట్లుగా కాక సీతారామయ్యగారు ఏ విధమైన ఆక్షేపణ తెలియపర్చలేదు. పైగా అమ్మ చేతి మీదుగా అమ్మ సన్నిధిలో ఈ విధంగా తన కూతురికి జరగటం అదే మహద్భాగ్యం అన్నారు.

11-17 ని.లకు ఆమె మృతదేహం పాడెమీదకు ఎక్కించి తను బండి ఎక్కి స్మశానానికి బయల్దేరారు అమ్మ. బయల్దేరే ముందు ఎద్దులు బెదరటంతో ఆ బండిని కొందరన్నయ్యలు లాక్కొని వెళ్ళారు.

ఆమె శరీరాన్ని చితిమీద చేర్చగానే సత్యం దానికి ప్రదక్షిణ చేసి కుండ పగలకొడ్తుండగా అమ్మ కర్పూరపు జ్వాలతో ఆమె శిరస్సు అంటించి నేతి దీపారాధనలోని ఒత్తిని ఆమె తలక్రిందుగా పెట్టి మూకుడులోని నెయ్యిని ఆమె మీద పోసి ఆ వెంటనే చకచకా పసుపు, కుంకుమ, పూలు కర్పూరపొడి జల్లి టెంకాయ కొట్టారు. భద్రాద్రి తాతగారు అమ్మదగ్గరగా వచ్చి బియ్యం అడిగారు చివర్లో చల్లాలని. అమ్మ నవ్వి "అవి ఉంటే ఇక్కడకెందుకు వస్తుంది" అన్నారు.

నిన్న ఉదయం బాపట్ల వెళ్ళిన నాన్నగారు, శేషగిరిరావు అన్నయ్యగారు ఈ విషయం తెలిసి శ్మశానానికి వచ్చి మమ్మల్ని అక్కడ కలుసుకున్నారు. అప్పటికే ఆమె శరీరం దహింపబడసాగింది. కాని రవ్వంత అయినా కాలినవాసన మా నాసికాపుటాలను స్పర్శించలేదు.

అది తమాషాగా ఉన్నదని మేము అనుకుంటే అమ్మ చేతిమీదుగా దహింపబడ్డాక ఇంకా వాసనలు ఏమిటి అనుకున్నారు తాతగారు వాళ్ళు. అక్కడ నుండి అందరం కలసి కాలవకు వెళ్ళాము. నీళ్ళలో దిగగానే మానసికతాపం

ఎట్లా ఉన్నా శారీరక తాపం తగ్గింది. కాసేపట్లో అది కూడా మరిపించారు. అమ్మ ఆ నీళ్ళలో చురుకుగా అటూ ఇటూ తిరుగుతూ డాక్టరుగారు ఫోటోలు తియ్యబోతుండగా తప్పించుకుంటూ సరిగ్గా ఆయన క్లిక్ మనిపించే సమయానికి వారిమీద నీళ్లు జల్లుతూ, తన చుట్టూ కూడిన వారందరిమీద నీళ్లుజల్లుతూ నవ్వుతూ అందర్నీ నవ్విస్తూ, అల్లరిచేసేటప్పుటికి మాకు మిగిలింది - పరాశక్తి ఈ రూపంలో అవతరించిన ఈ కాలంలో మేము జన్మించినందుకు ఆమెకు ఇంత చేరువుగా ఉండి ఆమె అల్లరి ఆటలలో పాల్గొన్నామన్న ఆనందం.

సోదరీబృందం శ్రీసూక్తం చదువుతూ ఆపాదమస్తకం అభిషేకించారు అమ్మను, తర్వాత పొలం పనులకు వెళ్తూ ఆ సమయంలో నేర్చుకున్న ఈత విద్యను ప్రదర్శించి, మాకు, అమ్మకు సంతోషం కలిగించారు.

ఒడ్డుకు రాగానే అమ్మ పెట్టిన దధ్యన్నం తిని ఇంటికి వచ్చేటప్పటికి మూడు గంటలు అయింది.

**- మార్చి, 1968**


COURTESY VISWAJANANI TRUST

# అర్కపురి విశేషాలు

**1968 ఫిబ్రవరి 11** ఇక్కడికి తరుచు బాపట్ల నుండి వచ్చే చిట్టెమ్మగారు 'ఆదివారాల నోము' ఉద్యాపన చెప్పుకున్నారు ఈ ఉదయం - గారెలు వాయనము ఇచ్చాక పళ్ళెం నిండా ఉన్న వాటివంక చూస్తూ అమ్మ అన్నారు "ఇవన్నీ నేనే తినాలా?" లలితాంబగారు అన్నారు "నీ ఇష్టమమ్మా." అమ్మ ఆ పళ్ళాన్ని అన్నపూర్ణాలయంలోకి పంపించారు. భోజనాల బంతిమీద అందరికీ పంచమన్నారు అమ్మ.

**ఫిబ్రవరి 12** నాలుగు రోజుల క్రిందట నెల్లూరు నుండి వచ్చిన ఒక సోదరుడు ఈ ఉదయం పూజానంతరం శెలవు తీసుకుంటూ "మనోవృత్తులు నశించటానికి మార్గమేమటమ్మా" అని అమ్మను అడిగాడు. 'మనస్సే' అమ్మ సమాధానం ఇచ్చారు. అన్నయ్యకు అర్థంకాలేదు. అమ్మ వివరించి చెప్పారు.

మధ్యాహ్నం చీరాల నుండి వచ్చిన ఇద్దరు అక్కయ్యలలో ఒకరు తన సంసార జీవితం ఆధ్యాత్మిక సాధనకు అడ్డురాకుండా ఉండే తరణోపాయం ఏమిటీ? అనీ మరొకరు ఏ నామజపం సుగతికి దోహదం కల్పిస్తుందీ అనీ అమ్మను అడిగి సందేహాలను తీర్చుకున్నారు.

**ఫిబ్రవరి 13** ఉదయం - రాజమండ్రి నుండి గతరాత్రి ఇక్కడకు వచ్చిన ఒక వృద్ధుడు అమ్మతో ఏకాంతంగా సంభాషించాలని కోరి అమ్మ ఆ అవకాశం ఇవ్వగానే ఒక పావుగంటపాటు మాట్లాడి చివర్లో డబ్బుకావాలని అడిగారు.

అమ్మ తన దగ్గర డబ్బు ఎందుకుంటుంది అని, డబ్బు అయితే తను ఇవ్వలేనని ఉన్నదాన్లో కలో గంజో పోసి అన్నం మాత్రం పెట్టగలను కనుక ఇక్కడ ఎన్నిరోజులున్నా అభ్యంతరం లేదన్నారు.

14 ఉదయం - ఈ ఆవరణలోనే నూతనంగా కట్టుకోబోతున్న గజేంద్రమ్మ గృహానికి గం. 8-15 ని.లకు శంకుస్థాపన చేశారు.

ఈ మాఘపౌర్ణమికి సామాన్యంగా పుణ్యార్థమై మహాక్షేత్రాలలోని నదులలో స్నానాలు చేస్తారు - ఆ దృష్టితోనే గోవిందరాజుల దత్తాత్రేయులుగారు గుంటూరు నుండి ఈ రోజు ఇక్కడికి వచ్చి అమ్మ స్నానం చేసిన నీళ్ళతో స్నానం చేశారు.

సాయంత్రం వచ్చిన ఆ దంపతులు రాత్రి అమ్మను దర్శనం చేసుకుని

తీర్థప్రసాదాలు తీసుకునేటప్పుడు అమ్మ పలకరించిన తీరు వారిని చాలా ఆశ్చర్య పరచింది. ఆ అన్నయ్య ఏ.సీతారామచంద్రమూర్తి అని మైసూరు రాష్ట్రంలోని ధార్వాడ్ యూనివర్శిటీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేస్తున్నారట.

వారిని అమ్మ 1946లో వేటపాలెంలో ఇంకా అంతకు ముందు బాపట్లలో చూశారట. అమ్మ ఎప్పుడు వారిని ఎక్కడ ఏ సమయంలో చూశారో ఆ గుర్తులన్నీ చెప్తుంటే వారు ఆశ్చర్యపడ్తూ విన్నారు.

15 ఉదయం – సీతారామచంద్రమూర్తి గారు శెలవు తీసుకున్నారు. ఆ సమయంలో వారికి అమ్మతో దాదాపు రెండు గంటల కాలం సంభాషించే అవకాశం కలిగింది. వారు చేసిన ప్రస్తావనంతా నేటి ప్రపంచ రాజకీయాలు వాటి దుస్థితి గురించి. ఈ ప్రసంగంలో ఆ విషయాల గురించి కూలంకషంగా మాట్లాడుతున్న అమ్మను చూసి వారు ఆశ్చర్యపడ్తూ అడిగారు "అమ్మ రోజూ పేపరు చూస్తారా" అని–

చివర్లో వారు అమ్మ వారికిచ్చే సందేశం ఏమిటని అడిగారు. "ఎవరు ఏది చేసినా చేయించేది మరొకటి ఉన్నది. వారు నీకు ఇష్టమైన వారు అనుకో – లేదూ నీకు ఇష్టమైన పేరు పెట్టుకో – ఏదైనా కానీ మనని నడిపించే శక్తి మరొకటి ఉన్నదనుకోవటమే"

18 ఉదయం – బూదరాజు శేషగిరిరావు దంపతులు (బాపట్ల) వాళ్ళ అమ్మాయికి అక్షరాభ్యాసం, అబ్బాయికి ముద్దకుడుములు ఇప్పించటం అమ్మచే చేయించారు.

22 సాయంత్రం – ఔరంగాబాదు నుండి టెలిగ్రాం వచ్చింది. హైమకు స్ఫోటకం పోసిందని. ఈ వార్త అందరినీ ఆందోళన పరిచింది కాని అమ్మ ప్రశాంతంగా అన్నారు "ఇప్పుడు ఆ జబ్బులు వచ్చే తరుణమే కదా అందరికీ వచ్చినట్లే దానికీ వచ్చింది కాదూ ! మన అమ్మాయికి వచ్చిందని బాధపడ్డామంటారా? అక్కడ వైద్యసౌకర్యాలు ఉన్నాయి గదా. ఒక వేళ లేకపోయినా దానికి ఎట్లా ఉన్నదో అట్లా జరుగుతుంది. మనం అనుకున్నట్లు జరగదుగా" అని.

టెలిగ్రాములో రవి కోరినట్టు సత్యాన్నే కాక పెద్ద తోడుగా హైమ పరిచర్య కోసం క్రిష్ణవేణక్కయ్యను పంపించారు.

24 నెల్లూరు జిల్లా నుండి ఆ చుట్టప్రక్కల గ్రామాల నుండి కొంతమంది కలసి 'టూరిస్టు బస్సులో' పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ గతరాత్రి ఇక్కడికి వచ్చి ఈ ఉదయం అమ్మను దర్శించి తీర్థప్రసాదాలు తీసుకున్నారు.

25 సోదరుడు కీ.శే. పోతుకూచి రవీంద్రనాథ్ స్మృత్యర్థంగా ఏకాహం జరిగింది. అర్కపురి ఉజ్జ్వల భవిష్యత్తు గురించి రవి కన్న కలల్లో ఇక్కడ టెలిఫోను సౌకర్య మేర్పడడమొకటి. తమాషాగా దాని ప్రారంభోత్సవం ఈనాడే జరిగింది.

పోస్టాఫీసులో ఒకటి. అమ్మ ఇంటికొకటి ఏర్పాటు చేశారు. అమ్మ ఫోనులో మొదట నాన్నగారితో తర్వాత వసుంధరతో మాట్లాడారు. బాపట్ల కాల్ లో మాతృశ్రీ పబ్లిషర్సుతోనూ హైద్రాబాద్ కాల్ లో అడపా రామకృష్ణారావుగారితోనూ మొదటగా అమ్మ మాట్లాడారు.

అమ్మ ఎవరితో ఎంత సేపు మాట్లాడినా ఆ రెండు మాటలు అందర్నీ అడిగారు "నామాట మీకు వినిపిస్తోందా స్పష్టంగా, మీరు భోజనం చేశారా?"

అమ్మ యింటి ఫోను నెం.జిల్లెళ్ళమూడి P.C.O. Extension No.1.

26. శివరాత్రి పర్వదినం. ఉదయం అమ్మ పూజకు వచ్చేటప్పటికి 11 గంటలయింది. ఆ సమయానికి అక్కడున్నవారందరూ అమ్మ పాదాలను పాలతో అభిషేకించారు. శివసహస్రనామాలు చదువుతుండగా మారేడు దళాలు, బంతి, చామంతి, కనకాంబరాలు, గులాబీపూలతో పూజ చేశారు.

పూజానంతరం 2-30 గంటలకు 'ప్రసూనాంజలి' కావ్యావిష్కరణ జరిగింది. ఆ సందర్భంలో అచ్యుతుని రామకృష్ణశర్మగారు, భద్రాద్రిరామశాస్త్రిగారు ప్రసంగించారు. ఆ కావ్యాన్ని యార్లగడ్డ రాఘవయ్యగారు తమ ద్వితీయపుత్రుడు కీ.శే. వెంకటేశ్వర్లు స్మృత్యర్థంగా ప్రథమ, ద్వితీయ భాగాలు కలిపి ప్రచురించారు.

దాని తర్వాత వారి మనుమడు రహికి అక్షరాభ్యాసం చేశారు అమ్మ. నాగులపాడు, నూతలపాడు నుండి వచ్చినవారు వాళ్ళ అబ్బాయిలకు నామకరణం అన్నప్రాశన అమ్మచే చేయించారు.

గరికపాడు నుండి వచ్చిన అన్నపూర్ణమ్మ అనే సోదరి మాఘగౌరినోము ఉద్యాపన చేసుకున్నది.

28 మధ్యాహ్నం – తెనాలి నుండి వచ్చిన అనంతలక్ష్మిగారితో (ప్రస్తుతం ఆమెను యోగమ్మగారంటారు) మాట్లాడుతూ అమ్మ 30 సంవత్సరాల క్రిందట జరిగిన ఒక సంఘటనను గురించి అడిగారు. అమ్మ చరిత్రలో ఒక భాగమైన ఆ సంఘటనలో ఆమె ఆనాడు ముఖ్యపాత్రే వహించింది. మొదట ఆవిడ గుర్తులేదన్నా అమ్మ కళ్ళకు కట్టినట్లు ఆ సంఘటనను గూర్చి వివరాలు చెప్పాక ఆమె గుర్తు ఉన్నదని ఒప్పుకోక తప్పలేదు.

29 సాయంత్రం – హైద్రాబాదు నుండి వల్లూరి సుబ్బరాజుగారు, పొత్తూరు వెంకటేశ్వర్రావుగారితో పాటు అమెరికా దేశస్థులొకరు వచ్చారు.

భవిష్యత్తులో ఇక్కడికి అసంఖ్యాకంగా విదేశీయులు రావొచ్చు కాని ప్రథమ విదేశీయుడుగా జిల్లెళ్ళమూడి గడ్డమీద అడుగు పెట్టిన అవకాశం లభించిన ఈ యువకుని పేరు జిమ్ హర్సిన్.

దర్శనం ఇచ్చాక అమ్మ వాళ్ళకు గారెలు, బన్‌రొట్టె, పెట్టి కాఫీ ఇచ్చారు.

**– మార్చి, 1968**


COURTESY VISWAJANA

# వినుతి

అమ్మా!

నీ గురించి నాకు ఎరుకపర్చినపుడు
సర్వకళాకోవిదులు కీర్తిస్తున్నారు
పండితులు-పామరులు స్తుతిస్తున్నారు
నీ వొక అజరామర అద్భుత కళానిధివని
ప్రేమపయోధివని....

ఈ 'సృష్టి' నీ కల్పనా కావ్యమట! ఇందులోని 'చిత్రాలు' నీ శిల్పకళా చిత్రరచనా చాతుర్యమట : వాటి 'జీవనరాగం' నీ మధుర కీర్తనమట; రాగద్వేష గుణాదులు సరళీ స్వరాలట.

– అయితే ఇవన్నీ నీ అనుపమ ప్రతిభకు నిర్వచనాలు అనుకోను. మచ్చుతునకలు మాత్రమే అంటాను.

నీ అసమాన ప్రజ్ఞకు గీటురాయి ఆ క్షణం – ఉన్న ఏకత్వంలో భిన్నత్వం సృజియించి ఈ విలాస వినోద పూరిత కేళికి నీవు పూనుకున్న ఆ క్షణం – నీ పూర్ణత్వానికి నిర్వచనమైన ఆ కాలం అద్భుతమైనదే కాదు – అపూర్వమైనది కూడా అంటే.............. మధుర మంజుల మందహాస మొలికిస్తూ కాదనకు మరి – ఇది స్తవం కాదమ్మా వాస్తవం. ఇది కేవలం నిన్ను వినుతించటం కాదు – అంజలిబద్ధనై నీ పాదాల మ్రోల వినతులర్పించడమే.

– ఏప్రియల్, 1968



# అర్కపురి విశేషాలు

**1968, ఏప్రిల్ 1** జనవరిలో మొదటి తేదీకి ఎంత ప్రాధాన్యత ఉన్నదో ఏప్రిల్‌లో మొదటి రోజుకు అంతటి ప్రాముఖ్యతా ఉంటుంది - ఉత్సాహవంతులైన వారివద్ద, సరదా సంతోషాలున్నచోట. అన్ని వేడుకలతో పాటూ ఈ వేడుకా జరిగింది. అయితే చాలా తమాషాగానూ లాభసాటిగానూ ఉన్నది. అన్నపూర్ణా, బాలా ఇద్దరూ కలసి అన్నపూర్ణాలయంలోనే కాక ఆవరణలో విడి కాపురాలుంటున్న ఇళ్ళలో ఆయా అక్కయ్యలకు అమ్మ ఫలానా పిండివంట చేసుకొని త్వరగా రమ్మంటున్నారని చెప్పటం, వాళ్ళు హడావిడిగా ఆ పిండివంటలు చేసి తీసుకురావటం జరిగింది. ఇదంతాచూసి అమ్మ నవ్వుకుంటూ "బాగుంది ఈ పద్ధతి" అంటూ ఆ నివేదనలన్నీ స్పృశించి ఆ ప్రసాదాన్ని అందరికీ పంచారు.

7 ఉదయం అమ్మ వాటర్ సప్లయి స్కీముకు ప్రారంభోత్సవం చేశారు. తర్వాత కేశవశర్మచే సంఘటితమయిన 'పదార్చన' కావ్యావిష్కరణ జరిగింది.

9 అమ్మ జన్మదినోత్సవం అయినా ఎవరిలోనూ మామూలు సంతోషోత్సాహాలు లేవు కానీ ప్రతి సంవత్సరం వలెనే ఉదయంనుండీ రాత్రివరకూ అమ్మకు పూజలు జరిగాయి. అక్షరాభ్యాసాలూ, అన్నప్రాశనలూ, నామకరణాలూ జరిగాయి. మాతృశ్రీ గ్రంథాలయానికి ప్రారంభోత్సవం జరిగింది. జన్మదినోత్సవ అభినందన సంచిక ఆవిష్కరించబడింది. రాత్రికి డా॥ అడపా రామకృష్ణారావు గారిచే కలర్ స్లైడులు ప్రదర్శింపబడ్డాయి.

11 నెల్లూరు నుండి సి.వి. రాజగోపాలంగారు వారి అబ్బాయి చలపతిరావు ఉపనయనం అమ్మ సన్నిధిలో చేయించుకున్నారు.

14 హైమాలయం దగ్గర 7వ తేదీ నుండి జరిగిన అఖండనామం సమాప్తమయింది. ఆ రాత్రినుండీ అక్కడ - రోజూ రెండు పూటలా ఏకాదశ రుద్రాభిషేకమూ, సహస్రనామార్చనా జరుగుతున్నా - ఆ రోజున 108 సహస్రనామ పారాయణలు జరిగాయి. ఉదయం హైమ ఫోటోతో ఊరేగింపు జరిగింది. ఇంటింటివద్దా కొబ్బరికాయలు కొట్టి హారతులు యిచ్చారు. మధ్యాహ్నం పూర్ణాహుతి జరిగింది. వందల కొబ్బరికాయలు పగిలాయి. అమ్మ

వందతులాలపైన కర్పూరం వెలిగించింది. ఆ జ్వాలలో కొబ్బరిచిప్పలూ, వడపప్పూ, పానకమూ, మహానివేదనా... అన్నీ భస్మమై ఆ దృశ్యం ఒక మహా యాగాన్ని స్ఫురింపచేసింది.

21 పసుమర్తి స్వాములవారు శరీరమ్మీదకు వచ్చే ఒకామె హైదరాబాద్ నుండి వచ్చింది. అమ్మను దర్శించి ఆమె “నేను వచ్చినపని తెలుసా?” అని అడిగింది. “నాకు తెలియదమ్మా. నాకు ఏమీ తెలియదు. నువ్వు చెప్తే తెలియాల్సిందే” అన్నారమ్మ. వారిని అమ్మ భోజనం చేయమన్నప్పుడు ఆమె - “మీరు నన్ను పరీక్షచేస్తున్నార”న్నది. “ఎవరినీ పరీక్షచేయనమ్మా. తల్లిని కాబట్టి ఎవరినీ చెయ్యను. అది నన్ను పరీక్ష చేసుకోవటమే” నన్నారు అమ్మ.

21, 22, 23 జిల్లెళ్ళమూడిలోని మూడు కుటుంబాలవారు అమ్మ సన్నిధిలో రోజు కొకరు తమ పిల్లలకు పెళ్ళి చేసుకున్నారు.

26 సాయంకాలం రాష్ట్రమంత్రి వెనిగళ్ళ సత్యనారాయణగారు, బాపట్ల యం.ఎల్.ఏ కోనా ప్రభాకరరావుగారూ యింకా అనేకులూ వచ్చి వెళ్ళారు. సత్యనారాయణగారికి అమ్మ నూతన వస్త్రాలు పెడ్తే - వారు “నేను మీకు తీసుకురావాల్సింది; మీరే నాకు పెట్టారు’ అని నొచ్చుకుంటుంటే అమ్మ అన్నారు “ఎప్పుడైనా నేనే మీకు యివ్వవలసినదాన్ని.” వారు వెళ్ళిన కాసేపటికే కాసు వెంగళరెడ్డిగారూ, వారి కుటుంబమూ, శ్రీమతి రాఘవమ్మా బ్రహ్మానందరెడ్డిగారూ వచ్చి అమ్మను పూజించుకున్నారు.

**- మే, 1968**





# సృష్టిలో వైవిధ్యం

తత్త్వచింతన చేసేవారు అడిగే చిరంతన ప్రశ్నలు రెండింటికి సొంతము వారూ తృప్తి కలిగించే సమాధానాలు ఇవ్వలేదు. వాటిలో మొదటిది ఈ సృష్టి ఎందుకని జరిగింది?" అన్నది. రెండోది "సృష్టిలో కనబడే తారతమ్యాలకు ఏది కారణము?" అని. బహు జన్మలలో నమ్మకమున్న హిందు, బౌద్ధ, జైన మతములవారు 'ఇదివరకటి జన్మలలో మనము చేసిన కర్మల ఫలశేషమే ఈ జన్మలో మనమనుభవించే సుఖదుఃఖాలకు కారణము' అంటారూ 'జన్మలన్నవి వెనుకటి వేవీ లేవూ, భగవంతుని ఇచ్ఛయే సృష్టి వైవిధ్యమునకు కారణము' అని క్రైస్తవ మహమ్మదీయ మతముల వారంటారు.

అమ్మ, భగవంతుడే సర్వసృష్టిగా వచ్చాడంటారూ, వైవిధ్యానికి సృష్టి భావమే కారణమంటారు. చంద్రమౌళి వెంకటకృష్ణగారనే సికింద్రాబాదు అడ్వకేట్ గారు అమ్మ దర్శనము చేసుకున్న సందర్భములో అమ్మను అడిగేరు. భగవంతుడికి అంతా సమానమే అయినప్పుడు సృష్టిలో అంగవైకల్యాలు ఎందుకు ఏర్పడ్డాయీ' అని. అందుకు అమ్మ చెప్పేరు "దేవుడికి అంతా సమానమే, అయితే ఈ ద్వంద్వాలు సృష్టి నడకకు అవసరము కనుక ఇది సహజమే. ఉదాహరణకు ఒక గింజ భూమిలో నాటేక అందులో కలిగే అవస్థ అక్కడి పరిస్థితుల్నిబట్టి ఉంటుంది. ఆ గుమ్మడి పాదు చూడు నాన్నా – అది ఇప్పుడిప్పుడే విస్తరిస్తోంది. ఆ వైపునవున్న పువ్వులూ, కాయలూ బాగావున్నాయిగాని మందిరం మూలలో ఈవలకి పాకిన తీగకి కాయలూ పువ్వులూ నలిగిపోతాయి. కారణమేమిటంటే ఇక్కడ కాయపట్టటానికి తగినంత స్థలం లేదు. ఆ మందిరానికి సగం వరకూనే చుట్టు 'గోడా' దాని పై సగమూ వెదురు తడికలుకట్టి ఉన్నాయి. ఆ రెండు వెదురు తడకలు మధ్యనా పెరిగేకాయ వాటి ఒరిపిడికి, ఇతర కాయల వలె కాక వంకరగా ఎదగటానికే అవకాశం ఉన్నది. ఆ వెదురు తడకలు కట్టటం మన వస్తువుల జాగ్రత్త అవసరాన్ని బట్టి. ఆ గుమ్మడి విత్తనం అక్కడపడి మొలిచినందుకు ఆకాయ అట్లాగ వుండక తప్పదు".

– జూన్, 1968

# నిదర్శనం

వరండాలో పడుకున్న అమ్మ ఒక రాత్రివేళ లేచి 'గబగబా మందిరంలో జ్వరం వచ్చి పడుకున్న శంకరం అన్నయ్య దగ్గరికి వెళ్ళి ప్రక్కలో కూర్చొని తలనిమురుతూ 'నాయనా పిలిచావా' అన్నారు. అన్నయ్య సమాధానానికి బదులు ఆశ్చర్యంగా అమ్మ వంక చూశాడు.

'ఒళ్ళు నొప్పులుగా ఉన్నాయా' అంటూ మేనంతా నిమురుతూ 'దాహంగా ఉన్నదా నాన్నా! మంచినీళ్ళు తెస్తాను' అంటూ లేచి రెండు అడుగులు వెయ్యగానే అక్కడున్నవారు ఒకరు, త్వరగా వెళ్ళి మంచినీళ్ళు తెచ్చారు. అమ్మ ఆ నీళ్ళు త్రాగించి కాసేపు దగ్గర కూర్చొని వచ్చారు.

జ్వరం తగ్గి పథ్యం తీసుకున్న కొద్ది రోజులకు అన్నయ్య ఊరికెళ్ళాడు. అక్కడనుండి వసుంధరకు ఒక ఉత్తరం రాశాడు. అందులో......

"అమ్మకే ఈ ఉత్తరం రాయాలని కూర్చున్నాను. కానీ అమ్మా నీకే రాస్తున్నాను. ఏవేవో అడగాలని అమ్మ దగ్గరికి వెళ్ళగానే ఎట్లా మాట్లాడకుండా కూర్చునేవాడినో ఇప్పుడూ నా పరిస్థితి అదే విధంగా ఉన్నది. కలం ముందుకు సాగనంటూంది. కాని మనస్సు తనలోని మాట చెప్పేవరకు నిలవనీయనంటుంది. అందుకనే నీకు రాస్తున్నానమ్మా. ఆ రోజు రాత్రి 12 గంటలకు 104 జ్వరంతో మంచంమీద మూల్గుతున్నాను. బలవంతంగా కళ్ళు మూసుకుంటే ఏవేవో కలలు, కళ్ళు తెరిస్తే ఏవో భ్రమలు, మనస్సు పరిపరి విధాల పోతూ నేను భయంతో గజగజ వణుకుతున్నాను. ముక్కోటి దేవతలకు మ్రొక్కు కుంటున్నాను. ఉన్నట్టుండి నా మనస్సు అమ్మను గురించి ఆలోచించసాగింది. అమ్మని ప్రతీవారు దేవుడు అంటున్నారు. అందరితో పాటూ నేనూ అంటున్నాను. నేను అంటున్నట్లు ప్రతీవారు అంటున్నారా లేక వారికేదైనా నిదర్శనం కనపడిందా ? ఒకవేళ వాళ్ళకు కనపడిందనుకో, నాకు మాత్రం ఎందుకు కనపడకూడదూ? నేనేమైనా పాపం చేశానా?

అమ్మ దగ్గరికి వచ్చినప్పుడల్లా అమ్మ పాదాలు పట్టుకున్నప్పుడెల్లా నాలో ఏదో ఒక విధమైన మార్పు కనపడేది. అమ్మను ఏవేవో అడగాలి అనుకునే

వాడిని. తీరా దగ్గరికి వెళ్ళితే, ఏమీ అడగలేక పోయేవాడిని. బయటకు రాగానే మళ్ళీ అడగాలి అనిపించటం. రేపు అడుగుదాములే అనుకోవటంతో రోజులు గడుస్తున్నాయి కాని అమ్మను ఏమీ అడగలేక పోయాను. ఒకనాడు అమ్మ నన్ను పిలిచి నా హృదయంలో దాగి ఉన్న మాటలకు చక్కని సమాధానాలు చెప్పింది.

అవన్నీ ఆలోచిస్తూ ఆ జ్వర తీవ్రతను భరించలేక అమ్మా ! ఈ బాధ భరించలేను తల్లీ ! నాకు భయంగా ఉన్నది. నిజంగా నువ్వు దేవుడైతే అందరికి నిదర్శనం ఇస్తున్నావన్నది నిజమైతే తెల్లని చీరతో వచ్చి చిరునవ్వు చిందించి ప్రక్కలో కూర్చొని ఒళ్ళు వత్తాలి. నాకు ఈ రాత్రి హాయిగా నిద్ర పట్టాలి అని వరాలు అడుగుతున్నాను అమ్మను.

ఏదో చల్లని చెయ్యి నా తల నిమురుతున్నట్లు అనిపించి కళ్ళు తెరిచాను. తెల్లని చీరతో అమ్మ చిరునవ్వు చిందిస్తూ నా యెదుట నిలబడింది. నా బాధనంతా వ్యక్తపరచాలనుకున్నాను కాని అశక్తుడనయ్యాను.

అమ్మే 'నాయనా పిలిచావా' అంటూ ఒళ్ళంతా ఒత్తుతూ 'నొప్పులుగా ఉన్నాయా నాన్నా' అంటూ నిమరసాగింది. "దాహం అవుతున్నది అమ్మా" అందామనుకున్నాను. "నీకు దాహంగా ఉన్నదా నాన్నా!" తెస్తాను ఉండు అని లేచి వెళ్ళుతున్నది. అమ్మా అని పిలవగానే వచ్చిందే. తెల్లని చీర ధరించిందే. ఇది కలా, భ్రమా అని కళ్ళు నలుపుకుని మరోసారి చూశాను. కలకాదు. నిజం. అమ్మ మంచినీరు తెచ్చింది. హృదయంలో అమ్మకు అనేక నమస్కారాలు అర్పించాను చేతులు జోడించే శక్తి లేక. అమ్మ నాకు లక్ష్మి లా సాక్షాత్కరించింది.

**- జులై, 1968**



# కులభేదం - గుణభేదం

సుబ్బారావు అన్నయ్య పెళ్ళి ప్రసక్తి వచ్చింది. దానిని గురించి సాయంత్రం (5-2-65) గోపాల్ అన్నయ్యా - సుబ్బారావు అన్నయ్యా మాట్లాడుకున్నారు.

ఆ రాత్రి అమ్మ స్నానానికి స్నానాల గదిలోకి వెళ్ళబోతూండగా ఈ విషయం గోపాల్ అన్నయ్య చెప్తూ "వాడు చివరకు కులపట్టింపు కూడా లేదన్నాడమ్మా ! అమ్మాయి ఎట్లా ఉన్నా గుణవంతురాలైతే చాలు అన్నాడు" అని అన్నయ్య అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు.

వెంటనే అమ్మ నవ్వి అన్నారు "కుల పట్టింపు" లేదనటం మీరు అనుకున్నంత తేలిక కాదురా, వాడు ఏ కులం పిల్లనైనా చేసుకుంటాననటం బాగానే ఉన్నది. కాని మనలో గుణభేదం పోనంతవరకు కులభేదం పోయినా ఒకటే ఉన్నా ఒకటే. గుణభేదం మనలో లేని రోజు నిజంగా కులభేదం పోయినట్టు. ఎవరు ఏది అన్నా రోషపడని రోజు వచ్చేవరకూ అంతే. అంతవరకూ ఈ సంఘమూ-కట్టుబాట్లూ వీటికి కట్టుబడటమూ ఉండవలసిందే. వాడు చేసుకుంటాడే అనుకో, అందరూ అనే మాటలకు రోష పడకుండా ఉంటాడా ? ఉండడు. దాని వలన ఆ అమ్మాయికీ బాధ, వీడికీ బాధే. ఏ కులము అయినా ఫర్వాలేదన్నది ఎంతవరకూ ? మాదిగ వాళ్ళను చేసుకోమంటే చేసుకుంటారా ? ఒకవేళ చేసుకోవటానికే ఒప్పుకుంటారు అనుకో, అది మన మాదిగరాముడి కూతుర్ని చేసుకోమను. అదే ఏ కలక్టరు కూతురో, కవిగారి కూతురో అయితే చేసుకుంటాడు. ఇది ఒక సుబ్బారావు విషయమని కాదు. మాకు కులభేదం లేదు అంటూ పెదవుల చివరతో మాట్లాడేవాళ్ళ గురించి. అసలు మనస్తత్వాల గురించి చెప్తున్నాను.

అయితే కొందరు పెద్ద మనుష్యులకు అవినీతి అనేదాని విషయంలో కులభేదం లేకపోవచ్చు. అది స్త్రీ చేస్తే తప్పు అయింది. పురుషుడికి ఆ అడ్డు లేదు. కొందరు వాడు మొగబిడ్డ తప్పు చేస్తే ఏం అంటారు. ధర్మమన్నది ఇద్దరికీ సమానమేగా ? ఒకే తప్పుకి శిక్ష స్త్రీ యే అనుభవించాలని ఏముంది ?"

**-ఆగష్టు, 1968**

# ఎలుకలు కొరికిన పళ్ళు

నర్సరావుపేట నుండి వచ్చిన సోదరులొకరు ఈ ఉదయం అమ్మకు లలితా అష్టోత్తర శతనామావళి పఠిస్తూ కుంకుమ పూజ చేస్తున్నారు.

అమ్మ తన పాదాల మీద ఉన్న పూజాపుష్పాలను చేతిలోకి తీసుకొని వాటిని మాలకట్టూ ప్రక్కనున్నవారితో ఏవో కబుర్లు చెప్తూ వారిని నవ్విస్తూ తను నవ్వుతున్నారు. ఆ నామావళి పఠించటంలో బిడియంవల్లో, మరుపువల్లో కాని వారు తడబడ్తుంటే అమ్మ అలాగే ప్రక్కవారితో మాట్లాడుతూ ఇటువైపు తిరిగి ప్రాంప్టింగ్'లా వారు తడబడినప్పుడల్లా ఆ నామాలను అందిస్తున్నారు.

అ అన్నయ్య మొదట తను అర్చిస్తున్న దేవతే తనకు నామాలు అందిస్తోంటే తెల్లబోయినా, ఆ తర్వాత నవ్వుకుంటూ పూజ ముగించారు. నివేదనప్పుడు వారు తెచ్చిన మామిడిపళ్ళు సంచిలోనుండి తీశారు. పాపం ఆ పళ్ళన్నీ ఎలుకలు ఎంగిలి చేశాయి. వాటిని చూసి ఆయన కన్నీళ్ళు పెట్టుకున్నారు. నివేదనకు మరింకేమీ లేదు వారి దగ్గర. అమ్మ వెంటనే ఒక పండును తీసుకొని తను తింటూ "ఫర్వాలేదు నాన్నా. ఎలుకలు తింటే ఏం ? ఆ రూపంలో వచ్చి అమ్మే తిన్నది. బాధపడబోకు" అన్నారు. అమ్మ ఆ విధంగా తన నివేదనను స్వీకరించటంతో వారు తృప్తిగా నిశ్వసించారు.

– సెప్టెంబర్, 1968



## హైమా ! నువ్వు నిజానికి నిజంగా ఉంటావు

**ది. 12-12-64 :** సాధారణంగా భోజనం చేసేముందు అమ్మకు నివేదన చెయ్యటం హైమకు అలవాటుగా ఉండేది. ఈ మధ్యాహ్నం నివేదనకాగానే వెళ్ళబోతూ తనవంకే చూస్తూన్న అమ్మను చూసి ఆగి "నా సంగతేమిటో చెప్పవేమిటమ్మా" అన్నది.

"నీ సంగతేమిటి? మళ్ళీ నీ స్నేహితురాలు (తలనొప్పి) ఏమన్నా అంటూందా?"

"అది కాదమ్మా" అంటూ తను నియమంగా జపం చేస్తున్నా లలితా సహస్రనామ పారాయణ చేస్తున్నా తను పొందవల్సినదేదో పొందలేకపోతున్నానని చెప్తూ ఈ అస్థిర చిత్తంతో తనెప్పటికి గమ్యం చేరగలనని బాధపడ్తుంటే అమ్మ నవ్వి అన్నారు -

"ఏమిటో హైమా- నీలా నాకు ఈ గమ్యాలూ ఈ చేరటాలూ వీటి గురించి ఆలోచన ఉండదు. ఏంచెయ్యను? ఇంకా నీకు ఏం సలహా ఇవ్వనూ?"

"అవునమ్మా - అదే నువ్వు అయినప్పుడు నీకు ఆలోచన ఏమిటీ ? మావంతుకానీ అది".

బుంగమూతి పెట్టి నిష్ఠూరంగ హైమ అన్నమాటలకు అమ్మ మళ్ళీ నవ్వుతూ-

"ఏమోనమ్మా, నాకు ఈ ఆడుకోవటంలో అల్లరి చేయటంలోనే ఆనందంగా, హాయిగా ఉంటుంది".

"అందుకేనమ్మా నీ దగ్గర ఇంత చనువు మాకున్నది. హైమ ఎందుకు ఆలోచిస్తుందోకాని ఈ సాధనలూ-గమ్యాన్వేషణలూ అంటూ బాధపడేకంటే ఇట్లా నీ దగ్గర ఆడుకుంటూ నీ అల్లరిలో పాలు పంచుకుంటేనే బావుందనిపిస్తుంది" అన్న భవాని వంక ఒకసారి హైమ చురుగ్గాచూసి అమ్మవైపు తిరిగి అన్నది - "ఒకరికోసం కాదమ్మా. మాటలతో నవ్వుతో ఈ విషయం దాటేయక చెప్పమ్మా-"

"ఇదేమిటి? మొన్న మీ బామ్మ కూడా ఇంతే. అయినా నీకీ ఆలోచన ఇప్పుడెందుకమ్మా?"

అమ్మ ఈ ప్రశ్నకు హైమ అసహనంగా అన్నది "సర్వం నువ్వే కనుక

సర్వం తెలుసు కనుక నువ్వు మామూలుగా ఉండగలవు. అందుకే నువ్వు ఆడుకోవటంలో అల్లరిచెయ్యటంలో ఆనందం పొందగలుగుతావు. మాకాస్థితి లేదుగా. మా వైపునుండి మాకు మార్గమూ-సాధనా-స్థితీ ప్రయత్నమూ ఇవన్నీ ఉన్నాయిగా."

అట్లాగే నవ్వుతూ అమ్మ అన్నారు "నేను మామూలుగా ఉండకపోతే హైమా-నువ్వు ఇట్లా పుట్టేదానివి కాదు. పెరిగేదానివి కాదు."

"మరి నన్నెందుకు కన్నావు?" పడుకున్న అమ్మ లేచి కూర్చొని -

"అది నాయిష్టం. నాకు కావలసినదానికి నేను కన్నాను. ఎందుకు అని నువ్వు అడగవలసిన పనిలేదు. నేను చెప్పాల్సిన పనీ లేదు".

హైమ నవ్వుతుంటే "ఇందులో నేను అబద్ధం చెప్పాల్సిన అవసరం లేదు. నువ్వు నిజానికి నిజంగా ఉంటావు."

"సరే నీ ఇష్టం అమ్మా ఎందుకు కన్నావో.... నా మనస్సు ఎప్పుడూ ఆలోచిస్తూనే ఉంటుంది. అది ఒక విషయం గురించికాదు. అనేకం గురించి".

"నువ్వే కాదు హైమా - అందరూ ఆలోచిస్తుంటారు. మనస్సు ఎట్లాంటిది? కోతి లాంటిది. దాని స్వభావం చంచలం. అది పలువిధాల పరిగెత్తుతూనే ఉంటుంది."

"నిన్నేమీ అడగను కానీ ఈ ఆలోచనలైనా మంచివి వచ్చేట్టు చెయ్యి -"

"అసలు ఆలోచనే మంచిది. అది లేకపోతే ఇదంతాలేదు. చెడు అంటే అది మన ఇష్టాయిష్టాలనుబట్టి ఉంటుంది. ఆలోచనకూడా క్రియ వంటిదే. మనస్సులో అది జరిగితేనేగా మనం పైకి చెయ్యగలిగేది."

"ఏమో బాబూ - నా బుర్రకు అందటం లేదు. వసుంధరక్కయ్య నాకోసం కనిపెట్టుకొని కూర్చుందేమో" అంటూ హైమ వెళ్ళటంతో ఆ సంభాషణ ముగిసిపోయింది.

**-మే, 1968**

15)



# హైమాలయం

"నేను కన్నాను. నేను పెంచాను. నేనే చంపుకున్నాను... ఇందులో ఎవరూ దేనికీ బాధ్యులుకారు. నాకు కావాల్సి నాకు అవసరమై నేనే ఇదంతా చేసుకున్నాను" అన్నారు అమ్మ హైమ మరణాన్ని గూర్చి. అవును – సృష్టిస్థితి లయకారిణి కనుక అమ్మ అనగలిగారు ఆ మాటలు. పాతికేళ్ళ ప్రాయంలోనే ఆ జీవిత చరిత్రకు ముగింపు కూర్చినా ఆ ముగింపు అమ్మ చరిత్రలో పరమాద్భుతమైన, ఆశ్చర్యకరమైన సంఘటనలలో ఒకటైంది. అమ్మ సర్వశక్తి మత్వానికి మరొక నిదర్శనమైనది.

అమ్మ తన గర్భవాసాన జన్మించిన హైమకు ఏదైనా ప్రత్యేకత ప్రసాదించారంటే అందులో ప్రధానంగా చెప్పుకోతగింది తొలి పరిచయంలోనే హైమను చూడగానే అవగతమయ్యేది – శిరీష కుసుమంలోని సుకుమారత్వం, శారీరకంగా మానసికంగా హైమ కలిగిఉండటమే. అందువలనే హైమ ఈ పాతిక సంవత్సరాల జీవితంలో సుఖపడిన భాగం కంటే బాధపడిన భాగమే ఎక్కువని చెప్పాలి. శారీరకంగా అనారోగ్యం ఇవ్వాళ్టిదికాదు. పుట్టినప్పటినుండీ ఉన్నది. అదేం వరమో ఆ అనారోగ్యానికీ వైద్యులకూ ఎప్పుడూ సఖ్యత లేదు. ఎన్ని ఔషధాలు వాడినా దాని దారి దానిదిగా ఉండేది. కాస్తలో 'ప్రకృతి చికిత్స' హైమ శరీరతత్వానికి సరిపడినా అది ఎంతోకాలం సాగలేదు. ఏవో అవాంతరాలు రావటం ఆ వైద్యం ఆగిపోవటం మళ్ళీ యథాప్రకారంగా బాధపడటమే మిగిలింది. కారుణ్యానికి తావైన మనస్సు కావటం వలన తనకేకాదు ఎవరికే చిన్న బాధ కలిగినా భరించలేకపోయేది. ఆ సున్నితత్వమువలనే ఇటీవల కొన్ని సంవత్సరాలుగా ఏదైతే గాఢంగా తను వాంఛించిందో, దేనికోసం అహర్నిశం తపించిందో అది పొందలేక పోయానని దిగులుపడ సాగింది. క్రమంగా ఆ దిగులే అమ్మ చరణధూళిలో ఐక్యం కావాలని కాంక్షింపచేసింది. త్వరగా అతి త్వరగా తన జీవనకుసుమం అమ్మ ధ్యానంలో రాలి పోవాలనుకున్నది. అదే జరిగింది 1968 ఏప్రిల్ 5వ తేదీన.

మరి ఆ లేత మనస్సు వాంఛితంలోని బలం అట్లాంటిది. ఆ తపన లోని తీవ్రత అంతటిది. అందుకనే అమ్మ హైమ కోరికను నెరవేర్చటమే కాదు, ఎన్నటికీ ఎప్పటికీ ఆ దళం వాడకుండానూ ఆ పరిమళం మాసిపోకుండాను ఆ జీవిత

చరమాంకానికి యవనిక దింపారు. ఆ ముగింపులో పాడబడిన మంగళ గీతిక 'హైమను' అందరిచే గుర్తింపచేసింది.

1968 మార్చి 28వ తేదీన ఔరంగాబాదునుండి తిరిగి వచ్చిన హైమను చూస్తూనే అమ్మ ఆ అమ్మాయి ఆరోగ్యాన్ని గురించి అసంతృప్తి ప్రకటించారు. వచ్చిన వ్యాధి మశూచికం, దానికి తగిన పోత పొయ్యలేదు. పోసిన పోత మూడో నాటికే నల్లబడి మాడిపోయింది. రావాల్సిన టెంపరేచరు రాలేదు. కనీసం జబ్బు తగ్గాక ఉండాల్సినంత ఆకలి లేదు.... ఈ లక్షణాలన్నీ చూసి ఆ భయంకర వ్యాధి నుండి హైమ త్వరగా విడుదల అయిందని సంతోషిస్తున్న మాతో అన్నారు "హైమకు త్వరగా తగ్గిందని సంతోషిస్తున్నారు కాని ఆ జబ్బు నడక నడవాల్సిన విధానం అది కాదు. అది అంత మంచి లక్షణం కాదు. నాకు అనుమానంగా ఉన్నది" అని. అట్లాగే హైమ ఆ మర్నాడే విపరీతమైన తలనొప్పితో నడుంనొప్పితో బాధపడింది. తర్వాత రెండు రోజులుగా తేటగా కనిపించినా మళ్ళీ ఏప్రిల్ మొదటితేదీన ఉదయం పది గంటలనుండి వెన్నులో పోటుతో, శరీరమంతా జాలుతో, మంటలతో, నొప్పులతో బాధపడసాగింది. అంతకుక్రితం వరకు హైమ ఎంత తేటగా, ఆరోగ్యంగా ఉండనీ– ఒక గంటపాటూ తలనొప్పేకాదు తీవ్రమైన బాధ ఏదైనా సరే నిలవవుంటే చాలు అంతలోనే వాడిన పువ్వులా ఒడిలిపోయేది. ఈసారి అది మరింతగా కనిపించింది. బలమైన ఆ జబ్బు తాకిడికి బాగా నలిగిపోవటమే కాదు శుష్కింపూ ఆరంభమైనది. ఏప్రిల్ మొదటి తేదీ నుండి ఏ బాధలతో బాధపడ్తూందో 5వ తేదీవరకు అట్లాగే బాధపడ్తూనే ఉన్నది, ఇంకా క్రొత్త క్రొత్త బాధలు తోడై. ఎప్పుడైనా ఒకటి రెండు గంటలు చేస్తున్న వైద్యం వలన ఉపశమనం పొందినట్టు కనిపించినా అది ఆ కాసేపే. హైమ పరిస్థితిని బట్టి వైద్యం కోసం హైమను ఆస్పత్రులకు తీసుకెళ్ళకుండా వైద్యులనే అందులో మెడిసిన్, సర్జరీ - రెండు భాగాలలో ప్రవీణులైన వారినే పిలిపించారు. అందరూ పరీక్షించిచూసి జబ్బు ఇది అంటూ దానికి తగిన ఔషధాలు వాడారు. ముఖ్యంగా డాక్టరు ఎన్.శ్రీధరరావుగారు (చీరాల) ఆ నాలుగు రోజులు ఇక్కడే ఉండి వైద్యానికి కావాల్సిన పరికరాలు, మందులు ఆ పల్లెటూళ్లో దొరకకపోయినా హైమను కదల్చకుండా కావాల్సినవన్నీ ఇక్కడికే తెప్పించి ఎంతో శ్రద్ధగా టైమ్ ప్రకారం మందులు వాడారు. ఇన్‌జక్షన్‌లు ఇచ్చారు

కాని ఏం ప్రయోజనం? ఆ మందులు హైమ జబ్బుని తగ్గించటం ఎట్లా ఉన్నా కనీసం ఉపశమనమయినా కలిగించలేకపోయాయి. ఆ శరీరతత్వానికి అవి పడక అవన్నీ వికటించి విపరీతమైన బాధనే అనుభవించింది హైమ.

ఏప్రిల్ 4 రాత్రి తెల్లవారుతుందని ఎవరూ అనుకోలేదు. పడుకోవటానికి కూర్చోవటానికీ, నిలబడటానికీ ఏమాత్రం ఆస్కారం ఇవ్వలేదు ఆ బాధ. "అమ్మా ఓ అమ్మా" అంటూ శక్తికొద్దీ మూల్గుతూ

"కఫం చుట్టుకొస్తున్నదమ్మా"

"ఈ శరీరం నాదని అనిపించటం లేదమ్మా" అంటూ కుర్చీలో కూర్చోలేక మంచంమీద పడుకోలేక తన పెద్ద కళ్ళను మరింత పెద్దవి చేసి అందరివంకా తేరిపారచూస్తూ మాట్లాడటానికి ఆయాసం, కఫం అడ్డు పడ్తున్నప్పుడు ఆ బాధ నుండి తనకి విముక్తి ప్రసాదించమని ఆకళ్ళతో అమ్మని అభ్యర్ధిస్తూ బాధతో గిజ గిజ లాడుతుంటే అందరమూ నిస్సహాయంగా తన వంక చూడటం కళ్ళనీళ్ళు కార్చటం తప్ప మరేం చెయ్యలేకపోయాము.

కాలం ఎవరికోసం ఆగుతుంది ? వేకువ జామున సుప్రభాతానికి జేగంట మ్రోగింది. తెల్లవారింది. ఫర్వాలేదని మేము కొంత తృప్తిగా నిట్టూరిస్తే – ఇంకా ఎంతకాలము ఈ శిక్ష – అంటూ హైమ దిగులు పడింది.

ఎందుకనో హైమ మొదటినుండి ఎంత బాధగా ఉన్నా స్నానం చేయించమని అడుగుతూనే ఉన్నది. అసలు మొదటితేది స్నానం చెయ్యటానికనే స్నానాల గదికివస్తూ వెన్నులోపోటు తీవ్రంగా ఉండటంతో చెయ్యలేకపోయింది. అప్పటినుండి ఎంత బాధామయ స్థితిలోనూ చల్లటినీళ్ళు స్నానం చేయించమని అభ్యర్ధించేది. అయితే అది స్నానం చేయించే పరిస్థితి కాదు కనుక వేడినీళ్ళతో తుడిపించి దుస్తులు మార్చేవారు. 5వ తేది మధ్యాహ్నం విభూతితో తుడిపించారు. ఆరోజు చీరాల నుండి డాక్టరు బి.రాధాకృష్ణమూర్తి యం.యస్.ను పిలిపించారు. వారు రాగానే క్లోరోమైసిన్ ఇన్‌జక్షన్‌లు ఇచ్చిన భాగాల్లో కారిన రక్తం, ఆ భాగాలలో వాపు చూసి వెంటనే రక్తం ఎక్కించటం అవసరమని గుంటూరు జనరల్ ఆస్పత్రికి తీసుకువెళ్ళాలన్నారు. ఈ ప్రయాణానికి అందరూ సిద్ధపడ్డారు ఒక్క అమ్మ

మినహాయించి. "దాన్ని ఇల్లు కదల్చటం నాకు ఇష్టం లేదు. దానికెట్లా ఉంటే అట్లా జరుగుతుంది. వైద్య లోపమైపోదు. ఉండే యోగ్యత ఉంటే ఎక్కడైనా ఉంటుంది. ఈ చివర సమయంలో దాన్ని తీసుకెళ్ళి ఎవరు మాత్రం చేసేదేమున్నది? ఈ ప్రయాణం నాకు ఇష్టం లేదు. దానికుంటే బ్రతుకుతుంది. లేకపోతే పోతుంది. నాకేం బాధలేదు. ఉండే ఈ రెండు గంటల్లో దాన్ని ఈ ప్రయాణం చేయించి హైరానా పర్చటమేతప్ప జరిగేదేం లేదు."

ఆ సమయంలో అమ్మ మాటల్లో నిశ్చయమైన ధ్వనికానీ రూపంలో ప్రకాశిస్తున్న తీవ్ర నిశ్చలత్వం కానీ మా కెవరికీ కనిపించిలేదని అననుకానీ ఎదురుగా ప్రయత్నం, ఫలితం కనిపిస్తూంటే.... కొడిగట్టిన ఆశాజ్యోతి వెలుగుతూంటే ఎవరము ఏది జరిగితే అదే కానివ్వమని నిర్భీతిగా నిశ్చలంగా కూర్చోగలం ? డాక్టర్లూ, నాన్నగారూ, అన్నయ్యలూ అందరూ ప్రయాణం కావాలన్నారు. రవి, సుబ్బారావు అమ్మకూడా రావాలని పట్టుపట్టారు.

మొదట్లో హైమకూడా అమ్మలేని ప్రయాణానికి తన అనంగీకారం తెలిపింది. కాని అమ్మ రోజూ రాత్రివేళ వస్తానని మాట ఇచ్చాక ఇల్లు కదిలిన అమ్మనూ, చుట్టుముట్టే జనాన్నీ ఊహించుకొని అమ్మ ఎంత ఇబ్బంది పడ్తారో ఆలోచించి అమ్మ రాకపోయినా ప్రయాణానికి అంగీకరించింది. కాని రవి ఒప్పుకోలేదు. ఏమైనా సరే అమ్మ కూడా రావాల్సిందే అని పట్టుపట్టాడు. నాన్నగారి అభీష్టమూ అదే.

"నాకేం ఇష్టంలేదు. ఇందువల్ల ప్రయోజనమూ లేదు. మీరు రమ్మంటున్నారు కనుక వస్తున్నాను. పదండి" అంటూ అమ్మ కారెక్కారు. రామకృష్ణ అన్నయ్య హైమను ఎత్తుకొని తీసుకెళ్ళి కారులో కూర్చోపెట్టాడు. అప్పుడు కూడా హైమ చన్నీటిస్నానం, అందులో అమ్మ చేసిన నీటిస్నానం కోరింది. అప్పటికే ఈ విషయం తెలిసి గ్రామస్తులంతా గుమిగూడారు. అందరివంకా మందిరాల వంకా ఒకసారి చూసింది హైమ.

కారు ముందు గుమ్మడికాయ, టెంకాయలు కొట్టి హారతి ఇవ్వగానే మధ్యాహ్నం 2 గంటలకు రెండుకార్లు బయల్దేరాయి గుంటూరువైపు. అమ్మ అన్నట్లే ఈ ప్రయాణం వలన హైమ చాలా హైరానపడింది. మధ్యలో బాగా

నీడనిచ్చే చెట్లవరస చూసి అక్కడ తననిదింపి పడుకోబెట్టమన్నది. చివరకు స్పృహ పోలేదు కాని పొన్నూరు దాటిన తర్వాత "నాకు ఎవరూ ఏమీ కనపడటం లేదమ్మా" అంటూ అంతదగ్గరగా కూర్చున్న అమ్మ కూడా కనపడటం లేదనన్నది. అమ్మ బులాకీ తీసి ఇప్పుడు కనపడ్తున్నానా అమ్మా? అని అడిగారు. తేజోనిలయమైన అమ్మవంక నిర్నిమేషంగా చూస్తూ "కనపడ్తున్నావమ్మా? అన్నది. ఆతర్వాత కూడా అమ్మను ఒక్కరినే చూడగలిగింది కాని కూడా వచ్చిన వారెవరినీ గొంతు ధ్వనిని బట్టి తప్ప గుర్తించలేకపోయింది.

రెండు గంటల ప్రయాణం తర్వాత గుంటూరు చేరాము. కారు ఆగగానే హైమకు మంచినీళ్ళు యిచ్చారు. లోపలికి తీసుకెళ్ళటానికి ముందుకువచ్చిన రామకృష్ణ అన్నయ్యని చూసి "ఇంకా ఎందుకు అంతా అయిపోయింది.... వెనక్కి వెళ్దాం" అన్నారమ్మ. వెంటనే ఎమర్జెన్సీ వార్డులో హైమను చేర్చారు. ఆక్సిజన్ ఇచ్చారు.

ఇంతలో డాక్టర్ జ్యోత్స్న రావటం, హైమను చూసి రక్తం కోసం పరిగెత్తటం ఈలోగ హైమ శ్వాస ఆగిపోవటం వెంటవెంటనే జరిగిపోయాయి. చివర సమయంలో కూడా "ఎట్లా ఉన్నదమ్మా" అంటూ పలకరించిన నాన్నగారితో "ఇంటికి వెళ్దాం, నాకు చల్లటి నీళ్ళు కావాలి" అని అడిగింది. ఆ కాసేపటికే ఎక్కిళ్ళు రావటం వాటిమధ్యే "వస్తున్నానమ్మా... అమ్మా" అంటూ హైమ కేక వేయటం ఆవెంటనే హైమలో మనకు కనిపించే చైతన్యం పోవటం జరిగింది.

అప్పటికి 4-30 అయింది. మళ్ళీ హైమ మృతదేహాన్ని తీసుకొని అందరం ఇంటికి వచ్చేటప్పటికి మసక చీకట్లు క్రమ్ముకుంటున్నాయి. ఈ వార్త అప్పటికే అందరికి తెలిసిపోయింది. గ్రామస్తులంతా చిన్నా పెద్ద విచక్షణ లేకుండా అందరూ కంటికి మంటికిగా విలపిస్తూ బారులుతీరి నిలబడి ఉన్నారు. కారులో నుండి హైమను దింపి అమ్మ ఇంటి వరండాలో పడుకోబెట్టగానే ఒక్కసారిగా అందరూ గొల్లుమన్నారు. గుండెలవిసిపోయేలా కొందరు శోకోద్వేగంతో ఏడుస్తూ కేకలు పెడ్తూంటే మరికొందరు ఆ మంట భరించలేక క్రిందపడి దొర్లసాగారు. ఇంకా కొందరు హైమను చూసి స్తబ్ధంగా ఉండిపోయారు నిజంగా జరిగిందా అనుకుంటూ, ఏ వైపు చూసినా "హైమా - ఎంతపని చేశావమ్మా" అంటూ గుండెలు బాదుకుంటూ ఏడుస్తున్నవారే. పెద్దగా శోకాలు పెడ్తున్నవారే.

అమ్మ జన్మదినోత్సవమని వేసిన పందిళ్ళు, వాటికి అమర్చిన విద్యుద్దీపాలు, పూజావేదిక - అన్నీ బావురుమంటూ వెలవెలబోతున్నాయి. ఆక్షణాలలో శోకసముద్రంలో పెద్ద తుఫాను చెలరేగి అందులో ఈ అర్కపురి చిక్కుకున్నదా అనిపించింది. ఆవరణంతా హాహాకారాలతో ప్రతిధ్వనిస్తున్నా ఇంతమంది తన కోసం ఈవిధంగా విలపిస్తుంటే - ఏమాత్రం చలనం లేకుండా ఉన్న హైమను చూస్తుంటే అనిపించింది... ఎవరి కే రవ్వంత బాధ కలిగినా ఓర్చుకోలేని ఆ హైమేనా ఈ హైమ అని.

అమ్మ అసలు లేవలేదు. ఒకటిరెండు సార్లు కదిలినా హైమను పిలిచినా చాలాభాగం అదేవిధంగా ఆ మర్నాడు సాయంత్రం మూడున్నర వరకు పడుకున్నారు.

ఈలోగా బంధువులకు, మిత్రులకు, ఇక్కడికివచ్చే సోదరులకు తెలియటం, వాళ్ళురావటం, పుట్టినరోజుకని శ్రీరామనవమికని వచ్చిన జనాభాతో మొత్తంమీద ఆవరణంతా నిండిపోయింది.

మర్నాడు అంటే 6వ తేదీ ఉదయం నాన్నగారు దహనం కోసం ఏర్పాట్లు చేస్తానంటే అమ్మ వద్దు అన్నారు.

"అదెక్కడికి పోయింది ? దాన్నిక్కడే ప్రతిష్ఠ చేస్తా" నన్నారు. అదే తనకూ అందరికీ తృప్తీ అన్నారు. నాన్నగారూ అంగీకరించారు.

ప్రస్తుతం నిర్మాణంలో ఉన్న దేవాలయ ప్రాంగణంలో అమ్మ ఉంటున్న ఇంటికి ఎదురుగా ఆ దేవాలయానికి ప్రక్కగా హైమాలయానికి ఆరడగుల లోతుతో పునాది త్రవ్వారు. మధ్యలో పెద్దపెద్ద నాలుగు నాపరాళ్ళు కలిపి గది ఏర్పరిచి అందులో ఇసుకపోసి దానిపైన జింకచర్మం వేసి హైమ జపం చేసుకునేటప్పుడు పూజా సమయంలో ఉపయోగించే వస్తువులు అందులో వేశారు. దాన్ని బ్రహ్మగ్రంధి అన్నారు అమ్మ.

ఈలోగా అమ్మ హైమకోసం, గర్భశోకంతో అలసిపోయిన తనని చూసి దుఃఖిస్తున్నవారితో -

"ఏమిటమ్మా ఇట్లా నీ సన్నిధిలోనే జరగటమేమిటి" అని అడుగుతున్న వారితో -

"ఏం లేదు, ఇట్లా కావాలని నేనే జరుపుకున్నాను. ఇందులో ఎవరూ దేనికీ బాధ్యులు కారు. నేనే కత్తిని తయారుచేసుకున్నాను. ఆ కత్తితో నేనే పొడుచుకున్నాను. ఇందులో భాగం ఎవరికీ లేదు. అని మృదువుగా సమాధానమిస్తూనే ఆరనిచిచ్చు కడుపులో మండుతుంటే కుమిలిపోయే మామూలు కన్నతల్లిలా దుఃఖిస్తూ.... అక్కడ ఏర్పాట్లు అన్ని జరిగాయి అని చెప్పగానే స్నానం చేసి 6 గంటలకు వెలుపలికి వచ్చారు.

దుఃఖ వివశయై శోకదేవతలా ఉన్న అమ్మను చూడగానే అందరూ చేష్టలుడిగి పోయినట్టు అమ్మ వంకే చూడసాగారు. అశ్రుసిక్తములైన కళ్ళతో ఒకసారి అందరివంకా చూసి అమ్మ హైమ దగ్గరకెళ్ళి ముందు కాళ్ళకు కట్టిన గుడ్డ ముక్కను తీసేశారు. తర్వాత బొట్టుపెట్టి కర్పూరపుపొడి వెంట్రుకలకు రాచి చుట్టూ తిరిగి టెంకాయలు కొట్టారు. ఆ కొట్టటంలో టెంకాయ పెంకు కుడిచేతి వ్రేలుకు గ్రుచ్చుకుపోయి రక్తం కారింది. ఆ రక్తంతో హైమకు బొట్టుపెట్టి ఒక టెంకాయచిప్పలో కర్పూరం వెలిగించి హైమ కళ్ళదగ్గరగా చూపించి అర్ధ నిమీలితములైన ఆ కళ్ళను విడదీసి చూసి రామకృష్ణ అన్నయ్యతో అన్నారు – ఇక తీసుకెళ్ళి కూర్చోబెట్టమని.

వాళ్ళు కూర్చోపెట్టేలోగా వరండా పొడవునా టెంకాయలు కొట్టారు.

హైమను అక్కడే వరండా స్తంభానికి ఆన్చి తూర్పుకు అభిముఖంగా కూర్చోపెట్టారు. అమ్మే స్వయంగా హైమ శరీరం మీద దుస్తులు ఆచ్ఛాదనలేని భాగానికంతటికి నూనెపెట్టి సున్నిపిండితో నలుగుపెట్టి సీకాయతో తలంటిపోశారు. తను ఉపయోగించే సబ్బుతో హైమ పొట్టా, ఒళ్ళూరుద్ది హైమ కోరినట్టుగా తను స్నానం చేసిన నీళ్ళూ ఇంకా తొట్లో చల్లని నీళ్ళూ కలిపి స్నానం చేయించారు.

ఆ తర్వాత శ్రీసూక్తం పఠిస్తుండగా ఆవుపాలతో అమ్మా నాన్నగారే కాక హైమను ఆపాదమస్తకము అందరూ అభిషేకించారు. కేవలం క్షీరాభిషేకమే కాక పంచామృతాలతో అభిషేకం జరిగాక గంగాజలంతో పన్నీరు కలిపిన నీటితో సీకాయతో మళ్ళీ తలరుద్ది నీళ్ళు పోశారు. చివర్లో వేడినీళ్ళు పోస్తున్నప్పుడు అమ్మ ఆదుర్దాగా అన్నారు "దానికి ఊపిరాడొద్దా – వేడిగా వద్దు – చల్లగా తీసుకురండి" అని. అమ్మ హైమ మీద ఉన్న ప్రేమతో ఆ బాధతో అట్లా అన్నారని అనుకున్నాము.

కానీ హైమలో మనం కోరే చైతన్యం ఏర్పడిందని అప్పుడు ఎవరూ గుర్తించలేదు.

వస్తుతః హైమ శరీరము మృదువైనదే అయినా 5వ తేది మాత్రం అట్లా లేదు. చల్లదనంతో కూడి కర్రలా బిగుసుకుపోయి బరువుగా ఉన్నది. కాని ఎప్పుడైతే అమ్మ ప్రతిష్ఠక్రతువు ఆరంభించారో అప్పుడే హైమలో పూర్వపు మృదుత్వం, నులివెచ్చదనం ఏర్పడ్డాయి. ఆ దేహాన్ని వాలిపోకుండా జారిపోకుండా ఒకరికి నలుగురు పట్టుకోవాల్సి వచ్చింది. అభిషేకం చేస్తున్నప్పుడు మృతదేహానికి చేస్తున్నట్టు లేదు. బాగా డస్సిపోయి నీరసంగా ఉన్న పసిపిల్లలకు నీళ్ళు పోస్తున్నట్టు ఉన్నది.

అభిషేకం ముగిసేటప్పటికి 7 గం॥ అయింది. 'తొందరగా కానివ్వండి. ఆలస్యం కానివ్వొద్దు' అంటూ అమ్మ త్వరపడసాగారు.

రుక్మిణక్కయ్య, క్రిష్ణవేణక్కయ్య వాళ్ళు హైమ శరీరం మీద అంతకు క్రితం ఉన్న దుస్తులు విప్పేసి పట్టెడు జరీ అంచుతో బంగారు రంగులో ఉన్న పట్టుపరికిణీ కట్టి నల్లని అంచు ఉన్న నీలిరంగు పట్టురవిక తొడిగారు. ఓణీ హైమదే వెయ్యబోతుంటే అమ్మ వద్దు అని గుంటూరు తను కట్టుకువచ్చిన బంగారు రంగు పట్టుచీర వెయ్యమన్నారు. అట్లాగే వెయ్యబోతుంటే అమ్మ అట్లా కాదంటూ అదే సమయంలో ఎవరో పెట్టిన ఎఱ్ఱపట్టు బట్ట ఒకటి శిరస్సునిండా చుట్టి దానిపైన ఆ చీరను ముసుగ్గా వేసి పూలదండలు వేశారు. తర్వాత జడలో పూలుపెట్టి కళ్ళకు కాటుక, కనుబొమ్మల మధ్య కల్యాణం బొట్టూ పెట్టారు. హైమ బంగారుగాజులు వెయ్యబోతే అవి పట్టనందున తన చేతి గాజులు తీసి ఇచ్చారు. హైమ మెళ్ళో బంగారు గొలుసు వేశారు. శేషు అన్నయ్య ఇచ్చిన ఉంగరం పెట్టి పాదుకలు తొడిగారు. బారచాచిన కాళ్ళను పద్మాసనం వేయించారు.

ఈ అలంకారం పూర్తి అయ్యేటప్పటికి 7-30 అయింది. తపో సమాధిలో ఉపవిష్ఠురాలైన యోగినిలా ఉన్న హైమను ఐదుగురు అన్నయ్యలు కలసి తీసుకొచ్చి తూర్పు దిశకు అభిముఖంగా బ్రహ్మగ్రంధిలో కూర్చోపెట్టారు. ఆ సమయంలో పద్మాసనం సిద్ధాసనంగా మారింది.

అమ్మ కూడా అందులోకి దిగి ఆ గ్రంధి చుట్టు టెంకాయలూ గుమ్మడి కాయలూ కొట్టి పసుపు-కుంకుమ- పూలు జల్లారు. ఇక్కడినుండి అమ్మలో చిత్రమైన మార్పు కనిపించింది. అమ్మలోనే కాదు వాతావరణంలోనూ వచ్చింది.

అమ్మ రూపులో - మాటలో - నవ్వులో చేతలో అన్నిటిలో ప్రత్యేకత కనిపించసాగింది. ఆ మహత్తర కార్యక్రమము అమ్మ నవ్వుతూ నిర్వర్తిస్తుంటే ఆ నవ్వులో మృదుమధుర మంజుల హాసం కనిపించలేదు. వింత కాంతితో దీపించ సాగిందా మందహాసం.

ఆ సమయంలో అమ్మ చేసిన ప్రకటన అమ్మ ఎవరో స్పష్టంగా ఎరుక పరిచింది. ఇదంతా చూస్తూ వింటున్న మాలో సంతోషమూ లేదు, విషాదమూ లేదు. ఈ రెండింటిని దాటి నిర్వచించలేని ఒక వింతైన అనుభూతిలో ఆ రెండు గంటల కాలము ఉండిపోయాము. ఎవరిలోనూ హైమ పోయింది అన్న దుః ఖపు చాయలు కనుపించలేదు.

టెంకాయలు కొట్టగానే ఆ గ్రంధిలోనే నాపరాళ్ళపైన ఓమూల తూర్పుదెసకు ఎదురుగా కూర్చుని హైమ శిరస్సు మీద తన దక్షిణపాదం పెట్టి అక్కయ్య అందిచ్చిన యజ్ఞోపవీతం హైమశిరస్సుకు తన పాదానికి కలిపి వేసి నవ్వుతూ హైమను పట్టుకున్న దత్తు గారితో "నేనూ గుంటూరు వచ్చాను తెలుసా" అని అడుగుతూ వారితో క్రితం రోజు కబుర్లుచెప్తూ ఆ పునాదిలో నిలబడిన అందరి వంకా చూస్తూ "ఇంకా నాలుగురోజులు బ్రతకకపోతే మాత్రం ఏం ? ఇంతకంటే ఏంకావాలి? ఎవరూ బాధపడొద్దు. ఇది నేను కావాలని చేసుకున్నది. అది ఎక్కడికి పోయిందని ? ఎక్కడికీ పోలేదు. ఇక్కడే ఉన్నది" అన్నారు. దత్తుగారు అన్నార్ు "హైమకు వేడి వస్తున్నదమ్మా" అని.

"ఆ ఇందాకటినుండి చన్నీళ్ళు పోశాంకదూ" అని అమ్మ అన్నా హైమ శిరస్సుపైన ఉన్న అమ్మ పాదం బాగా వేడెక్కింది. అమ్మకు అది సహజమనుకున్నా హైమ శిరస్సూ అట్లాగే ఉన్నది.

పొట్లూరి సుబ్బారావుగారు ఈ దృశ్యాన్ని ఫోటో తీస్తుంటే అమ్మ అన్నారు "నేను కూడా దిగనా (గ్రంధిలోకి)?" అని నవ్వి మళ్ళీ తనే అన్నారు "దిగితే ఎట్లా? ఇంకా పనులు లేవూ నాకు? ఉండను. వస్తాను. నా అగ్ని ప్రవేశించింది" అని ఆగి ఆ పునాదిపైగా నిలబడిన సావిత్రీ రమణావాళ్ళ నుద్దేశించి శ్రీసూక్తం చదవమన్నారు. వాళ్ళు చదువుతుంటే వాళ్ళతోపాటూ తనూ మాకు వినిపించనంత నెమ్మదిగా చదివారు.

తర్వాత దత్తుగారితో "అదీ నేనే ఉంటాము. మీరు వదలండి" అన్నారు. వారు వదిలేశారు. అక్కడనుండే ఆ ప్రక్కనే ఉన్న నాన్నగారికి అన్నయ్యగారికి పునాదిలో ఉన్నవారికి పసుపు-కుంకుమ-పూలు ఇచ్చి వెయ్యమన్నారు. అంతా వేశాక అప్పుడు ఆరంభించారు..... ఒక వరస విభూతీ మరొకవరస సైంధవమూ పోస్తూనే "నాకాలు మాడుతున్నది వేడికి. నాడికూడా వస్తుందేమో.... అయినా ఇందులో వింత ఏముంది" అన్నారు.

అచ్యుతుని సుబ్బారావుగారు అడిగారు "సజీవ సమాధా అమ్మా?" అని. అమ్మ సమాధానమివ్వలేదు.

సగం వరకు పొయ్యగానే అమ్మ తనచేతి బంగారుగాజులు తీసి అందులో వేశారు. కొంతమంది వాళ్ళు తెచ్చిన పూలూ పళ్ళూ తీసుకొచ్చి ఇచ్చారు. అవన్నీ అందులో వేశారు.

రామకృష్ణ అన్నయ్య ఈ నాలుగురోజులూ హైమకు వాడిన దిండ్లూ ప్రక్కబట్టలూ తెచ్చిఇచ్చాడు. ఒకటి వీపు వెనకగా రెండోది ముందువైపు వేశారు తలగడలు. సుబ్బారావుగారు విసనకర్ర తీసుకొని విసరబోతుంటే "ఈ నాల్గు రోజులూ నేనే విసిరాను. ఇప్పుడూ విసురుతాను" అంటూ అమ్మ విసిరారు.

ఆ విభూతీ లవణరాశిలో విశిష్టలావణ్య రాశి హైమ శిరస్సు మునిగిపోయాక అమ్మ తనపాదం తీసి అందులో దిగారు. హైమ శిరస్సుమీద కాసేపు కూర్చొని ఆ తర్వాత పమిటచెరుగు కప్పి శిరస్సు మధ్యభాగంలో కుడిచేతి వ్రేలితో రాస్తూ లేచారు.

మళ్ళీ కూర్చొని అచ్యుతుని సుబ్బారావుగారితో హైమ కడగా ఉన్నప్పుడు తను పూజ చెయ్యటం, అదేరోజు వారు రావటం ఆ దృశ్యం చూడటం గుర్తు చేస్తుంటే వారికి కళ్ళనీళ్ళు తిరిగాయి.

ఈసారి ఇంకా కొంతమంది వాళ్ళు తెచ్చిన పూజాద్రవ్యాలు అక్కడే అమ్మకు సమర్పించారు. అవన్నీ అమ్మ అందులోనే వేశారు.

తర్వాత భరద్వాజ, శేషు వంక చూసి అందరివంక తిరిగి "హైమ మనకు దారి అయింది. ఎన్ని శాస్త్రాలు పురాణాలు చదివినా చావు భయం తప్పదు. కాని దానికి అది లేదు. హాయిగా 'అమ్మా వస్తున్నాను' అంటూ వచ్చింది. హైమ

మనకు దారి అనుకొని ఇక ఎడతెరిపిలేకుండా నామం చెయ్యండి. ఇది ఆలయమై తపోసాధకులకు నిలయమౌతుంది.

ఎట్లా వచ్చిందో అట్లా కూర్చుంది. ఎక్కడనుండి వచ్చిందో అక్కడికే వెళ్ళింది. నేను బాధపడ్తున్నానా. ఏడుస్తున్నానా అంటే ఏడుస్తున్నాను, బాధ పడ్తున్నాను. చలిగాలికి కప్పుకున్నట్టు...... ఎండకు విసురుకున్నట్టు ..... ఏడుపు వస్తున్నదీ, ఏడుస్తున్నాను. ఏడుపు ఆపుకోవాలని మాత్రం ప్రయత్నం చెయ్యటం లేదు. ఏది చెయ్యాల్సివచ్చినప్పుడు అది చెయ్యటమే నా విధి.

అమ్మ నవ్వుతూ చేస్తున్నదంటే దుఃఖం లేదని కాదు. ఏడుపంటే కళ్ళ నీళ్ళు కావుగా. శరీరంతో ఉన్నాను కనుక రక్తమాంసాలతో కూడి ఉన్నాను కనుక చలీ–వేడీ అనుభవిస్తున్నాను కనుక మీ మధ్య ఉన్నాను కనుక ఇవి తప్పవు. ఉందామనుకున్నాను. ఉంటున్నాను. లేకపోతే ఇవేవీ లేవు. మీరు నేను కాదని అనుకోవటం లేదు. ఇవన్నీ కావాలనుకునే ఇట్లా ఉండాలనుకునే వచ్చాను. ఇందాక బయటికి వచ్చేముందు బాగా ఏడ్పు వచ్చింది. ఏడ్చాను. ఇప్పుడు రావటం లేదు. ఎప్పుడైతే ఇది నా బాధ్యత అని స్నానం చేసి బయటకు వచ్చానో యిక ఏడుపు రావటంలేదు.

ఈవేళ ఈఊరు వచ్చిన రోజు. 41లో ఏప్రిల్ 6వ తేదీన సుబ్బారావు ఆరునెలల పిల్లవాడు–వాడినెత్తుకొని ఈ ఊరు వచ్చాను. ఇప్పుడు హైమకు 25 ఏళ్లు. పెళ్ళి సందర్భం వచ్చినప్పుడు 25 వెళ్ళాక ఆలోచిద్దాం అన్నాను. ఇందాక వడుగు కూడా చేశాను. దానికేం?

ఇందాక వేడి వచ్చిందనుకుంటిరే–ఇప్పుడు ఇంకొకటి వస్తుంది. అసలు మొన్న ఫస్టు తారీఖునే వెళ్ళిపోవాల్సింది. మరి కొంతబాధపడ్తామేమోనని ఈ నాలుగు రోజులు జబ్బూ, డాక్టర్లూ – ఈ తతంగమంతా మన తృప్తికోసం చేసివెళ్ళింది"

అని రామకృష్ణ అన్నయ్యను మంచినీళ్ళు అడిగారు. అన్నయ్య తెచ్చి ఇవ్వగానే త్రాగి కాసేపు కళ్ళుమూసుకొని కూర్చున్నారు. మళ్ళీ వెంటనే తెరుస్తూ "లేనిపోనిది కాసేపు కూర్చుంటే కళ్ళుమూసుకొని శక్తి ఇస్తున్నదంటారు" అన్నారు. పొట్లూరి సుబ్బారావుగారు అన్నారు నవ్వుతూ "నేను అదే అనబోతున్నాను" అని. ఆ

తర్వాత అమ్మ లేచి టెంకాయకొట్టి ఆ నీళ్ళు హైమ శిరస్సుమీద పోసి విభూతిపోసి మంచినీటి గ్లాసును బోర్లించారు. అదే సమయంలో లైట్లు ఆరిపోయాయి. ఐదునిమిషాల వ్యవధిలో మళ్ళీ వెలిగాయి. వెలగగానే ముందు రామకృష్ణ అన్నయ్యకూ, ఆ తర్వాత భరద్వాజ, శేషు, రుక్మిణక్కయ్య వాళ్ళకు చూపించారు. హైమ శిరస్సున రక్తం స్రవించింది.

తర్వాత అమ్మ తను కొన్నిరోజులుగా కప్పుకుంటున్న తెల్లపట్టుచీరను ఆ గ్రంధిపైన కప్పి – "డాక్టర్‌జీ – నా పని అయిపోయింది" అంటూ నాన్నగారిని పిలిచి ఇద్దరూ కలిసి కర్పూరం వెలిగించారు.

అంధసోదరులు – రాధన్నయ్య రాఘవన్నయ్యలను దగ్గరకు పిలిచి వారిచే హైమను కూర్చోపెట్టిన తావును తాకించి ఉప్పు పోయించారు. ఆ తర్వాత ఆదిపూడి నరసింహారావు మేష్టరుగారిని పిలిచి వారు ఏ లక్ష్యంతో ఏ ఉద్దేశ్యంతో ఈ ఊరు వచ్చారో అది కొనసాగించమన్నారు. అఖండనామం ఆరంభించండి – అనిచెప్పి అందరిచేత ఉప్పూ విభూతీ వేయించండి అని అక్కడున్నవారితో చెప్పి 8–55కు లోపలికి వచ్చారు.

ఇది హైమ జీవితంలోని విషాదకర చరమఘట్టమేకాదు, హైమాలయ శంకుస్థాపన మహోత్సవంకూడ.

**– మే, 1968**



# అర్కపురి విశేషాలు

## 1968 మార్చి

**మార్చి 2:** మధ్యాహ్నం సత్తెనపల్లినుండి వచ్చిన సోదరులొకరు అమ్మను అభ్యర్థించారు-అమ్మ ఆగమనంతో వారి ఊరినీ, వారినీ పావనం చెయ్యాలనీ, "ఇందులో అమ్మని అర్థించేదేమున్నది నాన్నా! నాకు అవసరమని తోస్తే నేనే వస్తాను" అన్న అమ్మ సమాధానం వారికి తృప్తినివ్వలేదు కాబోలు- మళ్ళీ మళ్ళీ అడిగారు. ఈ ప్రయాణాల ప్రయోజనాలు ఫలితాలు ఎట్లా ఉంటాయో చెప్తూ చివరకు అమ్మ అన్నారు "మీ పిలుపు చాలలేదని మీ మర్యాదలు నాకు చాలవని అందుకోసంగా నేను రాలేకపోతున్నానని అనుకోవద్దు. అసలు అమ్మని పిలవటం ఏమిటి ?

మీకు అమ్మ తెలుసు గనుక రాగలుగుతున్నారు. కనుక ఇక్కడికి వస్తున్నారు. నేను వెతుక్కునేది అమ్మ అంటే ఏమిటో తెలియనివాడ్ని, నా దగ్గరికి రాలేని వాళ్ళని, లేవలేని వాళ్ళని, ముసలీ ముతకా, బీదా బిక్కిని చూడాలని నాకు ఉంటుంది.

"ఇల్లు పావనం చెయ్యటం అంటే నేను ఇట్లావచ్చి చెయ్యటమే పావనము కాదుగా. మీకా దృష్టే ఉంటే ఇంతదూరం రారుగా. ఆ పాదం ఎప్పుడూ ఉన్నది. మీకు గోడలు అడ్డం కాని నాకు కావుగా" అన్నారు అమ్మ.

**మార్చి 5 :** తండ్రి ఆబ్దికం పెట్టుతున్న నరసింహమూర్తిగారితో ప్రసంగవశాన అమ్మ అన్నారు -

"ఇది చనిపోయిన వాళ్ళ కర్మకాదు, బ్రతికున్నవాళ్ళ కర్మే. ఆ పేరుతో ఈ రూపంగా సర్వభూతాలను తృప్తిపరుస్తారు కదా! అదే విడిగా ఈ పని చెయ్యమంటే చెయ్యలేరు. ఇదీ ఒక విధమైన ఆరాధన - పితృ దేవతారాధన".

**మార్చి 6 :** నర్సరావుపేటనుండి వచ్చిన ఆ కుటుంబం ఉదయం అమ్మకు పూజ చేస్తూ వెండికన్ను నొకటి అమ్మ చేతికి యిచ్చారు. అమ్మ దాన్ని చూస్తుండగా దాని కథను చెప్పారు వాళ్ళు. వాళ్ళ పదేళ్ళ అమ్మాయి ఆడుకుంటూ ఉండగా గాజుపెంకు ఒకటి కంట్లో - అదీ నల్లగుడ్డుమీద గీసుకుపోయి గ్రుచ్చుకున్నది. ఆపరేషన్ చేయించారు. ఆ సందర్భంలో అమ్మకు మ్రొక్కుకున్నారట. ఆపరేషన్

జయప్రదం అయింది. ఇప్పుడు ఆ అమ్మాయి కళ్ళు పూర్వం ఏవిధంగా ఉన్నాయో ఆవిధంగా ఉన్నాయి.

**మార్చి 10 :** సాయంత్రం - ఇక్కడికి గుంటూరునుండి తరచుగా వచ్చే సోదరులు కొంతమంది అమ్మనామ సప్తాహం గుంటూరులో జరిపించాలని ఆ కార్యక్రమంలో ఒకరోజు అమ్మను గుంటూరు తీసుకెళ్ళాలనీ ఆ అనుమతి తీసుకోవటానికి వచ్చారు.

విషయం విన్నాక అమ్మ వారి రెండో కోరిక మన్నించలేదు.

“నాకు అవసరమైనప్పుడు నేనే వస్తాను. మీ పిలుపులతో పనిలేదు” అన్న అమ్మ ప్రత్యుత్తరం వారిని సమాధానపర్చలేదు. ఎంత ప్రాధేయపూర్వకంగా అర్థించినా అమ్మనుండి వారికి ఆ సమాధానమే లభ్యమైంది.

అందులో చివరకు ఒక అన్నయ్య పౌరుషంగా అన్నారు “పోనీయవమ్మా, మా నామంలో బలం ఉంటే నీకై నువ్వే వస్తావు. ఎవరికోసం రావూ?” అమ్మ నవ్వి “బావుందీమాట. అంత విశ్వాసం నీలో ఉంటే మన మధ్య ఈ సంభాషణ జరిగేది కాదు. నువ్వు అన్నది నిజమే. నీ నామంలో బలం ఉంటే నాకే చైతన్యం కలిగి నేనే వస్తాను. మీరు తీసుకు వెళ్ళితే కార్లు అవసరం కానీ నేను రావాలనుకున్నప్పుడు ఇవన్నీ అక్కర్లేదు - వీటితో పనిలేదు. ఆ వేళకి ఏం జరగాలని ఉన్నదో అదే జరుగుతుంది. మీ ప్రయత్నాలు మీరు చెయ్యండి” అన్నారు.

**మార్చి 11 :** ఈ రోజులో చాలా భాగం డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు ‘అమ్మా-అమ్మ వాక్యా’లను గూర్చివారు వ్రాసిన ప్రాసంగిక వ్యాఖ్యానాన్ని అమ్మకు చదివి వినిపించటంతో గడిచిపోయింది.

**మార్చి 19 :** రాఘవరావు మామయ్యగారి ఆహ్వానంమీద మేనల్లుడి వివాహ సందర్భంగా అమ్మా, నాన్నగారు మరో ముగ్గురు అన్నయ్యలు కలసి మన్నవ వెళ్ళారు గతరాత్రి పదకొండు గంటలకు.

ప్రయాణానికిముందు ఒక అక్కయ్య, ఇక్కడ ఇంతమంది బిడ్డలను వదలి అమ్మ ఇంత నిరాడంబరంగా ప్రయాణం చెయ్యటం ఏమిటని ఆశ్చర్యంగా ప్రశ్నిస్తే అమ్మ అన్నారు “అమ్మగా కాదుగా అమ్మా! ఆడపడుచుగా ప్రయాణం కదూ!

దీనిపద్ధతి ఇంతే" అని. ఈ ప్రయాణకాలం కొన్ని గంటలే అని తెలిసినా ఈ కొన్ని గంటలకాలం అమ్మను చూడకుండా ఉండలేక ఆవరణలో వారు ఎంత బాధపడ్డారో, విడిచి వెళ్ళలేకా అమ్మా - బాధపడ్డారు.

ఈ ఉదయం 7-30కు అమ్మ తిరిగి వచ్చాక కానీ వారికి క్రితం రాత్రి చీకట్లు కరిగిపోయి అప్పుడుగానీ సూర్యోదయం కాలేదు. ఈ స్వల్పకాల వ్యవధి లోనే అమ్మ కేవలం మామయ్యగారింటికే కాక తనని ఆహ్వానించిన వారింటికీ, లేమిచేత పిలవటానికి బిడియపడిన వారింటికీ, లేకలేక తనని చూడాలని ఆవేదన పడుతున్నవారి దగ్గరికీ వెళ్ళారు.

**మార్చి 29 :** ఉగాది ఉదయం అనంత సీతాచలంగారు కుటుంబ సమేతంగా అమ్మకూ నాన్నగారికీ నూతన వస్త్రాలు ఇచ్చి పూజ చేస్తారు. అదేవిధంగా ఈ ఉదయమూ పూజ ముగిశాక అమ్మ అందరికీ ఉగాది పచ్చడి పెట్టారు.

ఆ తర్వాత ఒక్కొక్కరుగా అప్పటికి వచ్చిన నూతనాగతులు, ఆవరణలోనివారు అందరూ పూజ చేశారు. గుండారంనుండి వచ్చిన సోదరు లొకరు వారి అబ్బాయికి అమ్మచే అక్షరాభ్యాసం చేయించారు.

పూజ జరుగుతుండగానే భద్రాద్రితాతగారు కీలక సంవత్సర శుభా శుభ ఫలితాలు పంచాంగం చదివి చెప్పారు. పూజానంతరం గజేంద్రమ్మ నూతనంగా కట్టుకున్న గృహానికి గృహప్రవేశం చేశారు. 11-30 లకు.

రాత్రి మాతృశ్రీ పబ్లికేషన్సువారు పూజచేసి వారు క్రొత్తగా ఆరంభించబోతున్న ఎకౌంట్ పుస్తకాలు అమ్మచే వ్రాయించారు.

**-ఏప్రిల్, 1968**



## మార్వాహెంఫిల్ - 1968 ఆగస్టు

అర్కపురికి పాశ్చాత్యుల ఆగమనం ఆరంభమైన ఈ తరుణంలో తొలిసారిగా యీ గడ్డమీద అడుగుపెట్టిన అవకాశం పురుషులలో జిమ్‌హర్సిన్‌కు లభ్యమైతే మహిళలలో మార్వాహెంఫిల్‌కు ఆ అదృష్టం ప్రాప్తమైనది.

ఆధ్యాత్మిక జిజ్ఞాస మిక్కుటంగా కలిగిన ఈ సోదరి అందుకు నిలయమని ప్రసిద్ధి పొందిన హిందూ దేశానికి బయల్దేరిన సమయంలో ఒక భారతీయ సోదరుడి ద్వారా అమ్మను గూర్చి తెలిసి తొలిగా అమ్మను సందర్శించటానికే నిశ్చయించుకొని సరాసరి గత నెల 25వ తేదీన సాయంత్రం ఆరుగంటల వేళప్పుడు ఇక్కడకు వచ్చారు.

ఆ రాత్రి ఆమె, నెల్లూరునుండి వారితోకూడా వచ్చినవారితో కలసి అమ్మకు పూజచేశారు. తర్వాత మార్వా దాదాపు ఒక గంటసేపు అమ్మతో సంభాషించారు.

ఆ తర్వాత గడిచిన రోజులలో మార్వా-అమ్మల మధ్య సంభాషణ జరగలేదని - మార్వాకు అనువాదకుల అవసరం లేదని అనను. కాని మార్వాకు ఈ సంభాషణలు - మాటలుకంటే అమ్మ స్పర్శ, దయతో నిండిన ఆ కన్నులు, ఆ చల్లని ఒడి, ఆ లాలింపు చాలు అన్నట్టుగా ఉండేది అని ఆ సమయంలో ఆమె పొందే తృప్తినిబట్టి అనిపించేది. అమ్మకు మార్వా కన్నీళ్ళకు అర్థం తెలుసు. ఇంకా నాకు ఇది కావాలి అని మార్వా నోటితో చెప్పాల్సిన అవసరం ఏముందీ?

అంతటితో ఆగలేదు మార్వా అదృష్టం. ఆమె ఏదైతే కోరుకున్నదో పొందాలనుకుంటున్నదో దానికోసం ప్రత్యేకించి మాత్రం ఎక్కడికీ వెళ్ళనవసరం లేదన్నారు అమ్మ.

మూడవతేది సాయంత్రం అమ్మ మార్వా ప్రసక్తి వచ్చి అన్నారు "ఏదైనా తత్వాన్నిబట్టి ఉంటుంది. మన ఊరు దాటి పొరుగూరు వెళ్తే మనకు కావలసిన సౌకర్యాలు లేకపోతే ఆ ఒక్కపూటకే సర్దుకోలేక ఎంతో ఇబ్బంది పడ్డాము, అని అనుకుంటాము. అట్లాంటిది మార్వాకు ఎవరు చెప్పారు ఇవన్నీ. నాదగ్గరకు చెప్పులు వేసుకుని రాకూడదని, చీర కట్టుకొని రావాలని. రావటం గౌను వేసుకువచ్చినా ఇక్కడికి రాగానే చీర కట్టుకున్నది. బొట్టు పెట్టుకుంటుంది.

పూలు పెట్టుకుంటుంది. అసలు ఆ తత్వమే ఎక్కడికక్కడ పరిస్థితులకు అనుగుణ్యంగా నడుచుకుపోయే తత్వం" అని. నిజమే - అమ్మ అన్నదాన్లో అతిశయోక్తి ఏమీ లేదు. కట్టూ బొట్టూ ఒకటే కాదు ఆహార పానీయాలు కూడా మన పద్ధతి ననుసరించే తీసుకోసాగారు. అప్పటికీ అమ్మ ఆమెకు ఏది ప్రీతికరమైన ఆహారమో చెప్తే అదే చేయిస్తానని చెప్పారు. కాని మార్వా అంగీకరించలేదు. తనకు ఈ ఆహారమే ఎంతో రుచికరంగానూ, ప్రీతిగానూ ఉన్నది అన్నారు.

**- సెప్టెంబర్, 1968**

## ఏ నామమైనా చేయవచ్చు - ఏ పూజైనా చేయవచ్చు

అంతే కాదు. ఈ నెలలో జరిగిన పండగలలో - శ్రావణ మంగళవారం నోములలో - వరలక్ష్మీ వ్రతంనాడు - శుక్రవారపు పూజలలో - ఆగస్టు 15వ తేదీ ఉత్సవంలో - గోకులాష్టమి, వినాయకచవితి మొదలైన పర్వదినాలలో ఆ యా పండగలందు ఆ యా దైవంగా ఆరాధింపబడే అమ్మను అర్చించే బృందంతో తానూ ఒకరై పాల్గొన్నారు.

12. 8. 1968న ఒంగోలు దగ్గరున్న పల్లెటూరు నుండి చాలామంది జనం వచ్చారు. పూజ అయ్యాక వాళ్ళలో ఒకరు అమ్మను అడిగారు. ఇక్కడ భజన చెయ్యొచ్చా అని. అమ్మ చెయ్యమన్నారు. రామనామం చెయ్యొచ్చా అని అడిగింది మళ్ళీ ఆమె. "ఏ నామమైనా ఒకటే ఇక్కడ ఎట్లాగైనా చేసుకోవచ్చమ్మా" అన్నారు అమ్మ.

28వ తేదీ మధ్యాహ్నం ఉన్నట్టుండి అమ్మ అడిగారు ఇవ్వాళ ఏం తేదీ అని. 28 అని చెప్పారెవరో. 68లో 8వ నెలలో 28వ తేది, మూడు ఎనిమిదిలు 24 అని అమ్మ గుణించుకుంటూ ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ ఉండిపోయారు.

ఆ సాయంత్రం మేడమీదకు వెళ్ళి కూర్చున్నప్పుడు దీని గురించే సంభాషణ జరిగింది. భరద్వాజ అడిగాడు ఇవ్వాళ విశేషం ఏమిటని ?

"తొందరెందుకు అదే తెలుస్తుంది. అయినా అది దాచినా దాగేదేం కాదు. దాచాల్సిన అవసరమూ లేదు" అన్నారే కాని అసలు సంగతి చెప్పనే లేదు.

అక్కడ నుండి క్రిందకు రాగానే తను స్నానం చేసి వచ్చేలోగా హైమాలయం దగ్గర పూజకు ఏర్పాట్లు చెయ్యమన్నారు.

అట్లాగే ఏర్పాట్లు చేశారు. అమ్మ అక్కడికి రాగానే వెంటనే పూజ ప్రారంభించలేదు. సరిగా ఎనిమిది కాగానే మొదలు పెట్టారు. తిరుమల అక్కయ్యని ఖడ్గమాల, భరద్వాజను భీష్మ స్తవం చదవమని తను కుంకుమ, తులసి దళాలు హైమ శిరోపరిభాగాన వేసి టెంకాయకొట్టి హారతి ఇవ్వగానే ఆ తర్వాత ఒక్కొక్కరు పూజ చేశారు. వేఱొక సోదరుడు భరద్వాజ అడిగిన ప్రశ్నే అడిగారు అమ్మని. "చెప్పేదేం లేదు చేస్తున్నది చూడండి" అన్నారు అమ్మ.

24వ తేదీన వెల్లటూరు దగ్గరున్న ఒక పల్లెటూరు నుండి ఇద్దరు సోదరులు వచ్చారు. ఆ రాత్రి వారు అమ్మను చాలా ప్రశ్నలు అడిగారు.

అందులో ఒకరు "మిమ్మల్ని అంతా అమ్మా! అని పిలుస్తున్నారు మీరు ఎవరికి అమ్మ ? కేవలం మానవ కోటికేనా సమస్త ప్రాణులకును కూడా అమ్మేనా? అమ్మా అని మిమ్మల్ని గుర్తించలేని వారుంటారు; అప్పుడు వారికి ఈ గుర్తించిన వారికీ ఒకే ఫలితం ఉంటుందా?" అని ప్రశ్నిస్తే మరొకరు "ధ్యానంలో కూర్చుంటే తనకు ఈ లౌకిక విషయవాసనలు అడ్డుతగిలి స్థిమితం లేకుండా చేస్తున్నాయని, తను పొందవలసింది పొందలేక పోతున్నానని అందుకు మార్గమేమిటని" బాధ పడ్తూ అడిగారు.

"నా దృష్టిలో మీరు ఒక్కరే కాదు ఏది కూడా పిల్లలు కానిది అనిపించదు. ఎవరు గుర్తించినా గుర్తించకపోయినా నాకు అందరూ పిల్లలే. మీరు నన్ను అమ్మా అని పిలిచినా పిలవకపోయినా నేను అందరికీ అమ్మను అనుకుంటున్నప్పుడు ఫలితం అందరికీ ఒకటి కాకుండా ఎట్లా ఉంటుంది ?"

"స్థిమితం కలగకపోవటం అంటూ ఏమీలేదు నాన్నా. ఇది వేరు ఇది కాదు మనం పొందేది, అనుకోవటమే ఇంత బాధకు కారణం. లౌకికం పరమార్థం అంటూ ఇన్ని లేవు. నీ స్థిమితాన్ని పోగొట్టే విషయాన్నీ అదే అనుకో. అదే నీకు కావాల్సింది ఇస్తుంది." వాళ్ళకు ప్రత్యుత్తర మిచ్చారు అమ్మ.

**–సెప్టెంబర్, 1968**

# నువ్వే కావాలి - అరుణ

దీనికి వారం రోజుల క్రితం అంటే 16వ తేది ఉదయం నెల్లూరు నుండి తరచుగా ఇక్కడకు వచ్చే సోదరులొకరు సతీ సమేతంగా వాళ్ళ కడసారి అమ్మాయి ఐదేళ్ళ అరుణతో ఇక్కడకు వచ్చారు.

ఆ సాయంత్రం అమ్మ గదిలోనే కూర్చుని ఏవో కబుర్లు చెప్తున్నారు. తల్లితోకూడా వచ్చి అరుణ కూర్చొని వినసాగింది. దాదాపు ఒక గంట గడిచాక అమ్మ అరుణని ప్రశ్నించారు - ఏమిటి అట్లా చూస్తున్నావు అని. అప్పటివరకు ఎవరూ ఆ అమ్మాయిని గమనించలేదు. గంటనుండి ఆ అమ్మాయి అట్లాగే కన్నార్పకుండా అమ్మ వంక చూస్తున్నదట. అమ్మ ఆ ప్రశ్న అడిగేటప్పటికి అందరి దృష్టి అరుణవైపు తిరిగింది. "కళ్ళు నొప్పులు పుట్టటం లేదూ ? ఏం చూస్తున్నావు - నా బొట్టా, నా చీరా, నా సొమ్ములా, నా గాజులా?" అని అడిగారు అమ్మ.

అవి ఏవీ కాదు అన్నది అరుణ.

"మరేం చూస్తున్నావు ఇవికాని అమ్మనా" అన్నారు అమ్మ.

"అవును".

"ఎందుకు చూడటం నువ్వు ? ఏది అడిగితే అది ఇస్తాను. ఏం కావాలి?" అని పసిపిల్లలు ఇష్టపడే వస్తువులను వారు ప్రీతికరంగా తినే పదార్థాలను ఇంకా రకరకాలుగా ఎన్ని ఆశలు పెట్టినా చివరకు కొడ్తాను, తిడ్తాను అన్నా ఆ అమ్మాయి ఒకే సమాధానం ఇచ్చింది.

"అవన్నీ నాకు అక్కర్లేదు. నువ్వుకావాలి. నిన్నే చూస్తాను. చూడాలనిపిస్తుంది, చూస్తాను" అని.

'గట్టి పిల్లే' అంటూ నవ్వుకున్నారు అమ్మ.

నిజమే మరి, ఏ సాధనలు చేసిందని, ఏ జపతపాలు చేసిందని ఆ పసి వయస్సులోనే అమ్మను సరాసరి గుర్తించే భాగ్యం అరుణకు లభించింది ?

**-సెప్టెంబర్, 1968**

# అమ్మ (ముక్కెర) బులాకీ

అమ్మ ఎప్పుడు ఎవరికి ఏ రూపంలో దర్శనమిస్తారో మరి.....

అమ్మ నాసికన అలంకరింపబడే అడ్డబాసను తన అంత్య దశలో బామ్మ ఎప్పుడూ అమ్మను అది పెట్టుకొని తనకు కనిపించమని కోరేది -

ఒకసారి అమ్మ బులాకీ పెట్టుకోకుండానే పూజకు వచ్చారు. కాని ఆ రోజు మద్రాసు నుండి వచ్చినవారిలో ఒక సోదరికి అమ్మ అడ్డబాస ధరించినట్టు కనిపించింది.

మరొకసారి ఒక సంవత్సరం శ్రావణమాసంలో బాపట్ల నుండి వచ్చిన తల్లి కూతుళ్ళిద్దరు పరిచయస్తులెవరో అమ్మను గురించి చెప్తుంటే విని వచ్చారట. అంతేకాక కాంతిమతి (కూతురు) పి.హెచ్.డి కి విశాఖపట్టణం వెళ్తుందట. స్వప్నంలో తనకు దర్శనమిచ్చిన అమ్మను ప్రత్యక్షంగానే చూద్దామని వచ్చింది.

అమ్మ అప్పుడే స్నానం చేసి హాల్లోకి వచ్చారు. అమ్మను చూస్తూనే కాంతిమతి సందిగ్ధావస్థలో పడ్డది. తనకు కలలో కనిపించిన మూర్తికీ ఈ మూర్తికీ భేదం లేకపోయినా ఆ అమ్మ నాసికన ఉన్న బులాకీ ఈ అమ్మ నాసికన లేదు.

ఇంతలో అమ్మ - ఇప్పుడే వస్తాను - అంటూ లోపలికి వెళ్ళి బులాకీ పెట్టుకొని వచ్చారు. కాంతిమతి సందేహం తీరిపోయింది. ఆ ఆనందంలో పొంగిన దుఃఖాన్ని ఆపుకోలేక అమ్మ ఒడిలో తలదాచుకున్నది.

మరి ఆ అడ్డబాసే చరమదశలో ఉన్న హైమకు అడ్డుపడింది అమ్మ కనిపించకుండా. నాకు ఎవరూ ఏమీ కనిపించటం లేదమ్మా - అని హైమ అన్నప్పుడు అమ్మ హైమకు మరింత దగ్గరగా జరిగి మీదకు ఒంగి నేను కనపడ్తున్నానా అని అడిగారు. లేదమ్మా - అన్నది హైమ.

వెంటనే అమ్మ తన ముక్కున ఉన్న బులాకీ తీసి - ఇప్పుడు కనపడ్తున్నానా అని అడిగారు. తేజోనిలయమైన అమ్మ వంక నిర్నిమేషంగా చూస్తూ కనపడ్తున్నావమ్మా - అన్నది హైమ. -అక్టోబర్, 1968

# మార్వా నుండి మనం నేర్చుకోవాలి

సరిగా రెండు మాసాలుపాటు మా మధ్య ఉండి తన సౌమ్య ప్రవర్తనతో, మంచితనం, మెత్తదనం నిండి ఉన్న మాటతో తన చేతతో అందరిని ఆకర్షించి, ఆకట్టుకున్న సోదరి మార్వా 1968 సెప్టెంబర్, 29వ తేదీన తిరిగి తన దేశానికి ప్రయాణమైనది.

డిసెంబర్ చివర వరకూ ఇక్కడ ఉండాలనుకున్న తను అనివార్యకారణాల వల్ల ఇంత ముందుగా ప్రయాణం నిశ్చయమైనప్పటినుండి అమ్మను వదిలిపెట్టి వెళ్ళలేక బాధపడ్తూ ఉన్నా తీరా ఆ రోజే వచ్చేటప్పటికి మార్వా తనలో పొంగి పొరలే దుఃఖానికి ఇక ఆనకట్టలు వెయ్యలేకపోయింది.

ఆ రోజు – వెళ్ళేముందు అమ్మకు మార్వా పూజ చేసింది. పూజా సమయంలో ఓవైపు నామం చేస్తూ, బీజాక్షరాలు పఠిస్తూ మరోవైపు కన్నీటితో అభిషేకించసాగింది. మరి మార్వా హృదయాన్ని ప్రతిబింబింప చేస్తున్న ఆ కన్నీటి లోని ఆవేదనాగ్ని తీవ్రత ఎంతటిదో? మార్వా వెళ్ళేవరకు అమ్మ నయనాలు అశ్రుధారలను వర్షిస్తూనే ఉన్నాయి.

అమ్మ ఆమె కోరినట్టు కుంకుమ ఒకటేకాదు తను రోజూ ఉపయోగించుకునే .... వస్తువులు ముఖం కడుగుకునే సబ్బు దగ్గరనుండి పాదుకల వరకు అన్నీ ఇచ్చారు. అవన్నీ పూజలో పెట్టాను అన్నారు మార్వా. ఆ సమయంలో మార్వా ధ్యానించే 'అమ్మ' మంత్రాన్ని ఏవో కఠిన నియమాలతో ఆచరించబోయి అది కుదరక బాధపడకుండా సులభమైన పద్ధతిలో ఆ మంత్రాన్ని జపించే విధానాన్ని చెప్పారు. అది విన్నట్టుగా అమ్మ చెప్పినా వెళ్ళేటప్పుడు మార్వా తనదేశపు అలంకరణలో బయల్దేరలేదు. పెట్టినబొట్టు చెరపకుండా, వేసిన గాజులు తియ్యకుండా అమ్మ ఇచ్చిన చీరే కట్టుకుని ఆరని కన్నీటితో పుట్టింటి నుండి మెట్టినింటికి వెళ్తున్న నూతన వధువులా వెళ్ళారు.

ఆమె వచ్చినప్పుడు ఏవిధంగా వర్షం కురుస్తూ దారి అంతా బురదమయంగా ఉన్నదో వెళ్ళేరోజూ అంతే. అయినా ఏమాత్రం విసుగు కనపర్చకుండా వెళ్తున్న మార్వాను చూసి అమ్మ అన్నారు "మార్వా నుండి మనం నేర్చుకోవాల్సింది చాలా ఉన్న"దని.

**–అక్టోబర్, 1968**

## అమ్మ కట్టిన తోరం

1968 సెప్టెంబర్ 4వ తేదీన అమ్మ కట్టిన తోరం గత మాసం 28వ తేదీ ప్రత్యేకత ఏమిటో తెలిసింది. ఆనాడు భరద్వాజ దాని గురించి ప్రశ్నించినప్పుడు "దాచినా దాగేదేం కాదు. దాచాల్సిన అవసరమూ లేదు. తొందరెందుకూ? అదే తెలుస్తుందిగా" అన్నారు అమ్మ. ఆ విశేషం – హైమాలయంలో కొలువైన దేవీ మాహాత్మ్యం ఇక నుండి ప్రపంచానికి తెలియబడుతుంది.

5వ తేదీన జరిగిన అనంత పద్మనాభస్వామి వ్రతంనాడు ఆవరణలోని అన్నయ్యలూ, నూతనంగా వచ్చిన సోదరులూ అంతా కలసి అమ్మను అనంతుడిగా అర్చించి వాయినం ఇచ్చి అమ్మచే తోరాలు కట్టించుకున్నారు.

అమ్మ ప్రతి సంవత్సరంలా ముంజేతికి కాక అందరికి కుడిచేతి భుజానికి తోరం కట్టుంటే యార్లగడ్డ రాఘవయ్యగారు అడిగారు "ఇక్కడ ఎప్పుడూ కట్టలేదమ్మా". అమ్మ అన్నారు "ఈ తోరం రెక్కపుచ్చుకు వచ్చే తోరం".

ఆ సాయంకాలం రాజుపాలెం రామచంద్రరావుగారు ఒక సంఘటన చెప్పారు. అంతక్రితం ఒకనెలా పదిహేను రోజుల నుండి అన్నం తినటానికి గాని కుడిచేతి బొటనవ్రేలు స్వాధీనం లేక చాలా అవస్థ పడుతున్నారట. ఆవ్వాళ అమ్మ తోరం కట్టిన ఐదు నిమిషాలలో అది తగ్గిపోయి స్వాధీనంలోకి వచ్చిందట.

**–అక్టోబర్, 1968**

## అమ్మతో పంక్తి భోజనం

1968 సెప్టెంబర్, 8వ తేదీ బ్రహ్మాండం రవి పుట్టినరోజు పండగ జరిగింది. వేకువ జామునే అమ్మకు పూజ చేసాడు రవి, చాలా నిరాడంబరంగా. అదే రవి పుట్టిన వేళ అన్నారు అమ్మ. ఆ తర్వాత ప్రతి సంవత్సరంలాగే ఆవరణలోని వారందరికి ఉదయం కాఫీ టిఫిన్ అమ్మచే ప్రసాదంగా ఇవ్వబడటం, మధ్యాహ్నం అన్నపూర్ణాలయంలోకి బంతి భోజనానికి అమ్మ రావటం జరిగింది.

ఆ మర్నాడే ఉండ్రాళ్ళతద్దె. అమ్మకు అస్వస్థతగా ఉన్న కారణాన వేకువజామున భోజనాల కార్యక్రమంలో రెండు గంటలు పట్టే కాలం ప్రసాదంగా అమ్మ దధ్యోదనాన్ని పెట్టటంతో అరగంటలో సరిపోయింది. **–అక్టోబర్, 1968**

## రూపం పరిమితం - శక్తి అనంతం

1968 సెప్టెంబర్, 11వ తేదీ మధ్యాహ్నం భరద్వాజ - తనూ మార్వా చర్చించుకుంటున్న ఒక విషయాన్ని గూర్చి అమ్మను అడిగారు.

"అంతా తానైన భగవంతుడికి పరిమితమైన రూపం ఎట్లా వస్తుంది? వస్తే అది భగవంతుడు ఎట్లా అవుతాడు?" ఇది మార్వా సందేహం. దీనిని గూర్చి అమ్మ, భరద్వాజ, మార్వా ఒక గంటపాటు చర్చించారు.

అమ్మ చెప్పిన దాన్లో..... "శక్తి అనంతం; రూపం పరిమితం" అన్నది అట్లాంటి ప్రశ్నకే. అనంతంగా ఉన్న శక్తి మనకు అర్థం కాదు కనుక దాన్ని అంతటా చూడలేము కనుక అన్నిచోట్లా కొలవలేము కనుక ఆ శక్తి మనకు అర్థమయ్యేట్టుగా కావాలి అంటే రూపం అవసరమైనది. విగ్రహారాధన అట్లాంటిదే. అవతార పురుషులు అనుకుంటున్న రాముడు కృష్ణుడి శరీరాలు కనిపించకపోవచ్చు కాని వాళ్ళ శక్తి ఎప్పుడూ ఉన్నా, ఆ శక్తి ఎప్పుడూ ఉన్నా, అర్థం కావాలంటే చరిత్ర కావాలి. చరిత్రకు ఆధారం రూపమే కదా. అసలు దేనికీ రూపం అంటూ లేకపోవటం లేదు. ఆకాశానికీ రూపం ఉన్నది. గాలికీ రూపం ఉన్నది. ఆ రూపం స్పర్శగా ఉన్నది. కంటికి - కనిపించటం రూపమైతే చెవికి - వినిపించటం రూపం. అంటే గ్రహించటానికి వీలైనదంతా రూపమే."

**-అక్టోబర్, 1968**

## ప్రేమలో పూర్ణత్వం

1968 సెప్టెంబర్, 16వ తేదీ ఏదో ప్రసంగవశంలో తల్లి ప్రేమను గురించీ ఆ ప్రేమలో ఉన్న పూర్ణత్వాన్ని గురించీ అమ్మ అన్నారు:

"ఎంత చెడ్డదయినా తల్లి తన బిడ్డను ప్రేమిస్తుంది. మనకు అర్థం గాక పోవచ్చు కాని ఏ పరిస్థితిలోనూ తల్లిప్రేమలో మార్పు ఉండదు. ఉంటే తల్లి కాదు. భగవంతుడికి కూడా భగవంతుడిగా కంటే బిడ్డగా సేవ చెయ్యటంలో ఉన్న తృప్తీ ఆనందమూ భగవంతుడిగా కొలవటంలో ఉండదు. ఒక విధంగా విగ్రహారాధన అంతేగా".

"భగవంతుడికే కాదు తన బిడ్డకైనా పూర్తిగా అట్లా చెయ్యగలిగితే అదీ అక్కడికే చెందుతుంది. ఎక్కడో ఉన్నాడనుకొని ఆ కనపడనివాడి కోసం తాపత్రయంపడే కంటే ఎదురుగా ఉన్నవాడిని అట్లా చూడగలిగితే చాలు".

**-అక్టోబర్, 1968**

## ప్రమాదం జరగటమూ - తప్పించుకోవడమూ ఒకటే

1968, సెప్టెంబర్ 22వ తేదీ నాడు గుంటూరు నుండి ఇక్కడకు తరుచుగా వచ్చే సోదరులు కొంతమంది ఆ సాయంత్రం తిరిగివెళ్తూ ఇక్కడే మొదటి వరవద్దగర వెంట్రుకవానిలో ప్రాణాపాయం నుండి తప్పించుకున్నారు. తప్పించుకున్నవాళ్ళకేకాదు విన్న మాకూ పెద్ద ప్రమాదం నుండి బయటపడినంత సంతోషం కలిగింది.

కాని దాని గురించి అమ్మ అన్నారు -

"ప్రత్యేకించి నాకు ఏం అనిపించలేదు. మొన్న సుబ్బారావు చావు ఎట్లాంటిదో ఝాన్సీ బ్రతకటం ఎట్లాంటిదో ఈ ప్రమాదం తప్పటమూ అట్లాంటిదే" నని.

మా బృందంలో ఝాన్సీ అనే అమ్మాయికి మూడు నెలల క్రితం పెద్ద ప్రమాదం జరిగింది. దాని నుండి ఝాన్సీ బ్రతకటానికి ఆస్కారం ఏమాత్రమూ లేకపోయినా బ్రతికింది.

అట్లాగే కటికి సుబ్బారావు ఈనెల 14వ తేదీన ప్రమాదవశాన కాలవలో పడి మరణించాడు. ఆ సమయంలో ఆ దరిదాపులో బాగా ఈత చాతైనవాళ్ళు ఎవరైనా ఒక్కరున్నా సుబ్బారావు బ్రతికేవాడు.

ఆ భౌతిక శరీరాన్ని వెతకటానికి ఆ రోజే ఇక్కడనుండి కొంతమంది అన్నయ్యలు వెళ్ళారు. వెళ్ళితిరిగివస్తున్న ఒక అన్నయ్యతో సుబ్బారావు తండ్రి కోటేశ్వరరావు అమ్మకు కబురుచేశాడు. సుబ్బారావు మృతదేహం ఒకవేళ కనిపిస్తే జిల్లెళ్ళమూడి తీసుకురమ్మంటారా? వద్దా? అని.

అమ్మ అన్నారు "నాకు ఎట్లా అయినా ఇష్టమే. ఎక్కడ అయినా ఒకటే. మట్టి అయినా గంగ అయినా ఒకటే. కాసేపు చూసినా ఎక్కడ అయినా కనపడకుండా చేసేదేగా. ఇక్కడకు తీసుకురాకూడదని ఏం లేదు. అక్కడనుండి ఇన్నిగంటలు నీళ్ళల్లో ఉన్న ఆ దేహాన్ని తీసుకురావాలంటే చాలా కష్టం. మీ ఇష్టం. మీరంతా ఆలోచించుకుని మీకు ఎట్లా తోస్తే అట్లా చెయ్యండి".

మృతదేహమైనా కనిపించక పోవటంతో మామూలుగా మరణించిన తరువాత జరిగే క్రతువేం జరగలేదు. చనిపోయిన 7వ రోజు అంటే, 20 వ తేదీ వాడి స్మృత్యర్థంగా ఊరబంతి జరిగింది. ఆ ఉదయం సుబ్బారావు తల్లిదండ్రులకు అమ్మ బట్టలు పెట్టారు. అవి కట్టుకొని అమ్మకు పూజ చేసి పూజానంతరం అమ్మ తిరిగి ఇచ్చిన మహానైవేద్యం, పూలు, ఆకులూ - అన్నీ వాగులో కలిపి వచ్చాడు కోటేశ్వర్రావు అన్నయ్య. **-అక్టోబర్, 1968**

# శరన్నవరాత్రులు

1968 సెప్టెంబర్,23వ తేదీ నుండి శరన్నవరాత్రులు ఆరంభమయ్యాయి. ఏటేటా జరిగినట్టే ఈ తొమ్మిది రోజులూ ఒక్కొక్కరోజు ఒక్కొక్క దేవ్యవతారంగా అమ్మ అర్చించబడ్డారు. ఈ పండగ సందడిలోనే వివిధ గ్రామాల నుండి వచ్చిన జనాభాలో కొంతమంది వాళ్ళ అబ్బాయిలకూ, అమ్మాయిలకూ నామకరణాలూ, అన్నప్రాశనలూ, అక్షరాభ్యాసాలూ చేయించారు. ఇంకా కొంతమంది పుట్టు వెంట్రుకలు తీయించారు.

మూలా నక్షత్రానికి మూడు రోజులు ముందు వాడ్రేవులోని లలితానంద ఆశ్రమం నుండి ఆ స్వామి శిష్యులు కొంతమంది వచ్చారు. అమ్మను స్వామి వారు మూలానక్షత్రం నుండి అక్కడ ఆరంభమౌతున్న పూజలకు రమ్మనమని ఆహ్వానించారని, ఆ మాట వాళ్ళు అమ్మకు చెప్పగానే అమ్మ అడిగారు "మీరు అక్కడ కలశం పెట్టి పూజ చేయిస్తున్నారంటే ఆ అమ్మ ఉన్నదనా లేదనా?" ఒకరు సమాధానం ఇచ్చారు. "ఉన్నదనే చేస్తున్నాము. ఈ అమ్మకే చేస్తున్నాము". "ఈ అమ్మే అంతటా ఉన్నదనుకున్నప్పుడు ఒకచోటికి ప్రత్యేకించి రావడం ఏముంది ? స్వామికి ఇక్కడా అక్కడా అని ఏముంటుంది ? దగ్గరా, దూరం లేదు. అవన్నీ మనకు. అయినప్పుడు - స్వామి నన్ను రమ్మనమని చెప్పటం ఏమిటీ? - అది అసంభవం."

అమ్మ ప్రత్యుత్తరం విని వాళ్ళు మరేం మాట్లాడ లేదు. అప్పుడే సెలవు తీసుకుని వెళ్ళారు.

**-అక్టోబర్, 1968**



# అపర్ణ

అపర్ణ భాస్కరావన్నయ్య రెండో అమ్మాయి. నిండా ఆరు సంవత్సరాలు లేవు. కాని ఆ అమ్మాయి ప్రవర్తన అత్యాశ్చర్యకరం. అమ్మ యెడ ఆ అమ్మాయికి భక్తా, విశ్వాసమా, అభిమానమా నేను చెప్పలేను. 'వాటిని మాటల్లో చెప్పటమేముందీ' అని అమ్మే అన్నారు.

ఆ అమ్మాయి అమ్మ దగ్గర కూర్చుందంటే తను అక్కడ కూర్చున్నంతసేపూ అమ్మను తప్ప మరెవరినీ చూడదు. ఎన్ని గంటలయినా సరే, ఎవరు మాట్లాడుతున్నాసరే, అమ్మ మీదే ఆ అమ్మాయి దృష్టి. ఎవరేనా పలకరించినా సమాధానం ఇవ్వదు. అమ్మ అడిగితే, రెండు మూడు సార్లకి తూచి చెప్పినట్టు నెమ్మదిగా సమాధానం ఇస్తుంది.

అపర్ణ వాళ్ళ తమ్ముడు రవితో పోట్లాడుతుంది. బిస్కట్లూ పిప్పరమెంట్లూ గురించి కాదు. 'అమ్మ మా అమ్మ' అని రవి అంటే 'అందరమ్మ' అంటుంది అపర్ణ. ఇద్దరు 'అమ్మా అమ్మా' అంటూ పోటీలు పడి నామం చేస్తుంటారు.

అపర్ణ అమ్మ వంక అలాగ చూస్తూ కూర్చుంటే అమ్మే ఒక్కొక్కప్పుడు కళ్ళు నొప్పిపెడతాయి అని చెప్పి బయటికి పంపిస్తూంటారు. సింగుపాలెంలో ఉన్నప్పుడు 'మనమందరమూ జిల్లెళ్ళమూడి వెళ్ళిపోడం ఎప్పుడమ్మా?' అని తల్లిని అడుగుతుందట.

అమ్మ అన్నారు అన్నయ్యతో "ఇవేళ దీని సంభాషణ రికార్డు చేస్తే బాగుండును".

శేషగిరిరావు అన్నగారు చేద్దామంటూ అపర్ణని హాలులోకి రమ్మన్నారు. అపర్ణ బయటికి వెళుతూన్నది కాబోలు వెనక్కి తిరిగి అమ్మకి ఎదురుగా నిలబడింది.

**అమ్మ :** సింగుపాలెం వెళతావా అమ్మా ? అని రెండు మూడు మాట్లు అడిగేక 'వెళ్ళను' అన్నది.

**అమ్మ :** ఎందుకు వచ్చావమ్మా ఈ ఊరు ? మాట్లాడలేదు అపర్ణ

**అమ్మ :** ఏమ్మా, ఎందుకు వచ్చావు ? చెప్పమ్మా! (అని కాస్సేపాగి) చెప్పమ్మా, అపర్ణా ! ఎందుకు వచ్చావు ?

అపర్ణ ఇప్పుడు పెదవి విప్పి 'నీకోసం' అంది

**అమ్మ :** నా కోసమా? ఎందుకమ్మా, నేనెవరిని ?

అలాగ రెండు మూడు మారులు అడిగిన తర్వాత – 'అమ్మవు' అన్నది .

**అమ్మ :** ఎవరికి అమ్మను?... చెప్పమ్మా – ఎవరికి అమ్మను ? చెప్పు. తర్వాత చూద్దువుగాని చెప్పమ్మా – ఎవరికి అమ్మను ? ...

చెప్పవా? అయితే సింగుపాలెం వెళ్ళు. అని ఆ అమ్మాయిని పక్కకి కదిల్చేసరిగి – 'అందరికి' అన్నది.

**అమ్మ :** ఎవరన్నారు ? .... త్వరగా చెప్పమ్మా !

**అపర్ణ :** నేనే అన్నా. (నువ్వే అన్నావా ? – అని అందరము నవ్వేము.)

**అమ్మ :** (అపర్ణని దగ్గిరకి పిలిచి) సింగుపాలెం వెళ్తావా ?

**అపర్ణ :** పోను.

**అమ్మ :** ఎందుకు పోవు ? ఇక్కడ ఏముందీ? అక్కడ మీ అమ్మ ఉన్నది. ఇక్కడ మీ అమ్మ ఏది ?

**అపర్ణ :** నువ్వుండావుగా ?

**అమ్మ :** నేను ఉంటే చాలా ?

**అపర్ణ :** చాలు.

**అమ్మ :** చాలా ? ఎప్పుడూ అమ్మ లేకపోయినా ఉంటావా ? భాస్కరరావు కూడా ఉండడు. మీ నాన్నా అందరూ వెళ్తారు. ఉంటావా ?

అపర్ణ 'ఉంటా' నన్నది. ఈ మాట ఎంత నెమ్మదిగా అన్నదో! పెదవుల కదలికను బట్టి తెలుసుకోగలిగేము.

**అమ్మ :** గట్టిగా చెప్పు. మరి నేను సింగుపాలెం వెళ్తున్నా. నువ్వు ఇక్కడ ఉంటావా? నాతో వస్తావా ? ఎంతసేపటికి చెప్పకపోతే, "నువ్వు ఈ వూరుకోసం వచ్చావా ? అమ్మ కోసం వచ్చావా ? నేను సింగుపాలెం వెళ్తున్నా. నువ్వు ఇక్కడుంటావా ? నాతో వస్తావా ?

**అపర్ణ :** నీతో వస్తా.

**అమ్మ :** మరి నేను ఎక్కడుంటే అక్కడుంటావా ?

**అపర్ణ :** ఉంటా

**అమ్మ :** నేను కొండలమీదకు పోతాను. అక్కడికి ఎవరూ కూడా రారు. భాస్కరరావు కూడా రాడు. వస్తావా ?

వస్తానన్నట్టు తల వూపింది.

"దీనికి తిరుగు కనపడటం లేదు" అని అమ్మ నవ్వారు. అన్నయ్యగారు అన్నారు "ఈ నిగ్రహ దృష్టి ఇక్కడికి సంవత్సరాల తరబడి వస్తున్నా మాకు లేదు. ఈ పిల్లవచ్చి ఆరు నెలలు కాలేదు. దానికి లభించింది".

**–డిసెంబరు, 1968**





# నిషేధాలూ - ఆచారాలూ

'అమ్మా! అన్నం తింటున్న సమయంలో ఎవరన్నా భిక్షకు వచ్చినా లేవకూడదూ అంటారు. అదేదో పాపం అంటారు నిజమేనా?'

"నాకు తెలియదు నాన్నా! ఎందుకు పెట్టారో మరి. అన్నం తింటున్న సమయంలో లేవకూడదు అన్నారంటే కొన్ని మనసులుంటాయి కదూ, అవతలివాడు తినలేదంటే తన అన్నము అయినా ఇచ్చి తనకోసం మిగుల్చుకోలేని వాళ్ళు. వాళ్ళకోసం పెట్టారేమో. వాళ్ళు అన్నం తినకుండా మరొకరికి పెడతారేమోనని, ఏది ఉన్నా లేకపోయినా ఒక మాదిరిగా అన్నమూ, గుడ్డా లేకపోతే జరగదుగా? అందుకోసం అవి కరువైనవాళ్ళు అడుక్కోక తప్పదు. ధర్మం చెయ్యడము మంచిదే అంటూ ఆ వెంటనే అన్నారుగా, తనకు మించిన ధర్మం పనికిరాదని".

ఒక వస్తువును గడపదాటివచ్చి ఇమ్మంటారు – లేకపోతే పాపం అంటారు ఎందుకమ్మా?

"అట్లా అనటం ఇవ్వటంలో వస్తువు చేజారి పగిలిపోకుండా ఉండటానికే. అయితే మాటలతో చెప్తే ఆచరించగలమా? లేదు. అందుకే ఆ భయం ఏర్పరిచారు. ఆ భీతితోనైనా ఆచరణలో పెట్టగలరేమోనని.

పచ్చడి రుబ్బినప్పుడు రోలు కడక్కుండా మళ్ళీ పచ్చడి రుబ్బేవరకు అట్లాగే ఉంచే ఆడవాళ్ళ కోసం – అట్లా పచ్చడి నూరగానే రోలు కడగకపోతే మరణకాలమంధు మంటలు పుడ్తాయని ఒక భయం కలిగించేసరికి ఆ రోలు శుభ్రంగా కడుగుతారుకదా అని.

ప్రతీ శుక్రవారమూ ఇళ్ళు బూజు దులుపుకుని శుభ్రం చేసుకోకపోతే లక్ష్మి ఆ ఇంట్లో నిలవదని, ఎందుకు అన్నారు ? ఆ విధంగానైనా వారానికి ఒకసారి తాము ఉన్న ఇంటిని శుభ్రపరుస్తారని. ఇట్లాగే ప్రతీ చిన్న పనికి భయానికి ఏర్పరిచారంటే – అవి ఆచరించటానికి బద్ధకించే వ్యక్తులుంటారని.

చిన్నప్పటి నుండి ఆడపిల్లలకు ప్రతీ నోము ఎందుకు పట్టిస్తారు – పువ్వుతాంబూలము అనీ, పండుతాంబూలము అనీ, చిట్టుబొట్టు అనీ? పువ్వులో, పండులో, గంధంలో, అక్షతలలో, ప్రతీదాన్లో దైవాన్ని చూడమని. ఈ నోము

చేస్తే ఈ ఫలమూ, ఆ నోము చేస్తే ఆ ఫలమూ అని ఎందుకు పెట్టారంటే ఆ ఆశతోనైనా చేస్తారు కదా అని. బిడ్డల కోసమని కాకపోయినా ఆ రూపేణానైనా దానం చెయ్యగల్గుతున్నారు గదా, అందుకని దేన్నీ తేలికగా తీసేయకూడదు.

అన్నీ ఆచరించేవాడికి ఏదీ అవసరం లేదు కానీ ఏదీ ఆచరించలేని మనకు ఇవన్నీ అవసరమే. అంతా పెద్దవాళ్ళ చాదస్తం అని ఆచారాలను పరిహసిస్తాము కాని ఈ ఆచారాలూ - నిషేధాలూ ఏర్పరచింది ఆరోగ్యం కోసమేగా. అసలు ఏముందో తెలియదుకాని ఇవన్నీ ఉన్నాయిగా. అందుకోసమై ఆచరించక తప్పదు.

-జనవరి, **1969**






# కాంతి ఖండం ఎంత అందమో !

సామాన్యంగా అమ్మ ముఖం కడుక్కుంటున్న సమయంలో కానీ, స్నానం చేసే సమయంలో కానీ అక్కడ అవసరమైన ఆ ఒకరిద్దరు వ్యక్తులు తప్ప మరెవరూ ఉండరు.

ఒక్కొక్కసారి ఒక్కొక్క సందర్భాన్ని బట్టి నలుగురైదుగురు ఉండటము కూడా జరుగుతుంది. ఈ రోజు అట్లాగే భరద్వాజతో మాట్లాడుతూ ముఖం కడుక్కోవటానికి లేచారు. కూడా వెళ్ళాడు భరద్వాజ. ఆ సంభాషణ అంతటితో ముగింపబడటం ఇష్టం లేక. కేవలం భరద్వాజే కాకుండా ఆ సమయంలో అక్కడే ఉన్న మరో ఇద్దరు అన్నయ్యలు కూడా వెళ్ళారు.

ఆ సంభాషణ పూర్తి అయ్యేటప్పటికి అమ్మ ముఖం కడుక్కోవటం కూడా పూర్తి అయింది. రామకృష్ణ అన్నయ్య మంచినీళ్ళు ఇవ్వగానే పమిటచాటున ఉన్న మంగళసూత్రాలు తీసి వాటిమీద ఆ నీళ్ళు మూడుసార్లు పోసి ఆ తీర్థం త్రాగి ముఖం తుడుచుకొని మంగళ సూత్రాలకు బొట్టు పెట్టి ఆ తర్వాత తను పెట్టుకుని అక్కడే కూర్చున్నారు.

నేటి ఈ ముఖ ప్రక్షాళన కార్యక్రమం ముగిసేటప్పటికి సమయం ఎనిమిది అవుతూంది. బాగా ఎండెక్కింది గాబోలు సూర్యకిరణాల వెలుగు, దగ్గరగా చేరవేసిన తలుపుల మధ్య ఖాళీ ప్రదేశంలో నుండి గదిలోకి ప్రసరిస్తోంది.

ఆ వైపే చూస్తూ అమ్మ భరద్వాజతో అన్నారు –

“ఆ వెలుగు ఒక ఖండమై ఆవరణ ఏర్పరుచుకుని ఉండేటప్పటికి ఎంత అందంగా ఉన్నదో చూడు – అదే కిరణం బయట ఉన్నది. ఇంత వెలుగూ ఉన్నది. కాని గుర్తించలేము. అంతా బ్రహ్మమయం అనుకుని దాన్ని ఒక చోట చూసినప్పుడు ఉన్న దానిలా ఉన్నది. అంతటా ఉన్నశక్తి ఒక రూపం ధరించి పరిమితంగా ఉండి మహిమలు చూపినప్పుడు చూసి ఆనందపడినట్టుగా ఉన్నది”.

‘అవును’ అంటూ నవ్వాడు భరద్వాజ. లక్ష్మీనారాయణ అన్నయ్య అన్నాడు, తను కూడా నవ్వుతూ ‘ఎంత బాగా చెప్పావమ్మా! కాని అది నా కంటికి దీపంలా ఉన్నది’. అమ్మ నవ్వి “నువ్వు పెట్టుకోవాలనుకున్నా నీతో ఇప్పుడు తగాదా పెట్టుకోలేనురా, నీకు దీపంలా ఉండొచ్చు. ఇంకొకరికి మైనపువత్తి వెలుగులా ఉండొచ్చు. ఎవరికి ఎట్లా కనిపించినా ఉన్నదొకటే” అంటూ అక్కడనుండి లేచారు.

–జనవరి, 1969

# ప్రోషిత భర్తృకతో - అమ్మ

ఏదో ప్రసంగంలో గోపాల్ అన్నయ్య అమ్మను అడిగాడు -

'ఫారిన్ వెళ్తావా అమ్మా?'

అమ్మ నవ్వి "అవసరమైతే వెళ్ళక తప్పేదేమున్నది? ఆస్ట్రేలియా, అమెరికా, ఇంగ్లాండు అన్ని దేశాలకీ వెళ్తాను–" అన్నారు.

'అమ్మ ఒకచోటు కనేమిటి? కెనడా కూడా వెళ్తారు' అన్నారు అక్కడే ఉన్న రావుగారి భార్య.

రావుగారి కుటుంబానికి జిల్లెళ్ళమూడి చిరపరిచితమే. వారి అబ్బాయి కెనడా వెళ్ళాడు. కొంతకాలం తర్వాత ఆ దేశస్థురాలిని వివాహం చేసుకుంటానని వివాహితుడైన అతను తెలియచేశాడు.

రావుగారి భార్యతో ఆమె కోడలు కూడా వచ్చింది. అమ్మ ఆ అమ్మాయిని అడిగారు -

"అబ్బాయి ఉత్తరాలు ఏమన్నా రాస్తున్నాడా అమ్మా ?"

వెళ్ళిన మొదట్లో రాశేవారని ఆ అమ్మాయి సమాధానం ఇచ్చింది.

అమ్మ అడిగారు "ఇప్పుడేం చేస్తున్నావు?"

ఆ అమ్మాయి "B.Sc. అయిపోయింది. M.Sc. కు వాల్తేరు వెళ్లాలనుకుంటున్నాను. ఇంట్లో కూర్చొని చేసేదేమున్నది? ఆపిన చదువు కంటిన్యూ చెయ్యాలని ఉన్నది" అన్నది.

"మంచిదేనమ్మా" అన్నారు అమ్మ.

వాళ్ళు సెలవు తీసుకొని వెళ్ళేముందు అమ్మ పాదాలకు నమస్కరిస్తుండగా ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. రావు గారి భార్య వాళ్ళ అబ్బాయి పరిస్థితి గురించి మరోసారి చెప్తూ కోడలిని ఆశీర్వదించమని (కాపురం కుదుటబడాలని) కోరారు. అమ్మ అదెప్పుడూ (ఆశీర్వచనం) ఉన్నదమ్మా అని ఆ అమ్మాయితో అన్నారు "ఏ పరిస్థితిలో తొణకకుండా ధైర్యంగా ఉండమ్మా, ఎట్లా జరగాలో అట్లా సమయం వస్తే అదే జరుగుతుంది. నీ డిగ్రీలన్నీ విజ్ఞానంగా

మారాలి. నీ భర్త నీ దగ్గర లేడని ఆలోచించవద్దమ్మా. భర్త అంటే శరీరం కాదుగా. మన కళ్ళ ఎదుట ఉంటే భర్త, లేకపోతే లేడని కాదుగా. శరీరం ఎక్కడున్నా నీ భర్త నీ దగ్గరున్నాడు. శరీరమే ముఖ్యం కాదు అనుకున్నప్పుడు నీ భర్తను నీ దగ్గరనుండి ఎవరూ తీసుకోలేరు. ఆ నమ్మకం నీకు ఉన్నప్పుడు అదే నిన్ను రక్షిస్తుంది. నీ మెళ్ళో ఉన్న ఆ రెండు మంగళసూత్రాలూ అతని రెండు పాదాలు. వాటిని పూజించు"

'అలాగేనమ్మా' అంటూ ఆ అమ్మాయి మరోసారి నమస్కరించింది.

"ధైర్యంగా ఉండమ్మా, నీ భర్త నీ దగ్గరే ఉన్నాడు" అంటూ ఆమె శిరస్సు లాలనగా నిమిరారు అమ్మ. **-ఫిబ్రవరి, 1969**



# విచిత్ర మౌనము

తేది 24-10-64 ఉదయం బాపట్ల నుండి వచ్చిన ఆగంతకులు లోగడ వచ్చినవారేనట. అందులో ఇరవై రోజుల నుండి మాట పోయిందని పరిచయం చేయబడిన అతను 1956లో వచ్చాడు. అతని పేరు కిష్టయ్యట. ఏదైనా జబ్బు ఏమోనని ఇంట్లోవాళ్ళు, బంధువులు డాక్టర్లకు చూపించుదామని అంటే వద్దంటాడట. అతను మాట్లాడటం అంతా సంజ్ఞలు, కాగితం ద్వారానట. అతనికూడా మరొకతను, ఒక స్త్రీ వచ్చారు. ఇదంతా ఈ రెండో అతను చెప్పాడు. విని అమ్మ కూడా నాకేం తెలియదు డాక్టర్లకే చూపించమన్నారు.

ఆ అన్నయ్య నవ్వి "సర్వము మీకు తెలుసు. డాక్టర్ల దగ్గరికి వద్దంటాడు. మీ వంటి పెద్దవాళ్ళ దగ్గరికి వెళ్దామంటే వస్తానన్నాడు. అంధుకని ఒకవేళ ఈ సంబంధమైన జబ్బు ఏమోనని (ఈ సంబంధమంటే ఉన్నట్టుండి మాట పోవటం జరిగింది కనుక అది దైవసహాయమువలనే వస్తుందని నమ్మకం) వచ్చాము" అన్నారు.

అమ్మ : ఈ సంబంధమైన వారికే చూపండి నాకేమీ తెలియదు.

అన్నయ్య: కాదమ్మా మీరు చెప్పాలి.

అమ్మ : నాకేం తెలుసు నాయనా ?

అన్నయ్య : మీరు చెప్పాలి అమ్మా, ఎంతో ఆశతో వచ్చాము.

"నా ఉద్దేశం చెప్పమంటారా" అంటూ వారిని అతనికి జబ్బు ఎప్పుడు ఎట్లా ప్రారంభమైనదో ఆ వివరాలు అడిగి - "నాకు ఒకటే అనిపిస్తుంది మీరు చెప్పిన వివరాలు బట్టి... అతను కావాలని మాట్లాడటం లేదు. అంతే. అతనికి జబ్బు ఏం లేదు" అని కిష్టయ్యను అమ్మ అడిగారు -

"నీకు ఏమన్నా బాధగా ఉంటుందా ?"

**కిష్టయ్య :** (సౌజ్ఞతో) లేదు.

**అమ్మ :** నువ్వు కొన్నాళ్ళపాటు ప్రాణాయామము అని ఇంకా ఏమిటేమిటో చేస్తుండేవాడివి కదూ ?

అని కొన్ని క్షణాలు అతని వంక చూసి "శ్వాస కూడా స్పష్టంగా వస్తున్నది.

ఆ లోపం ఉంటే రాదు. ఇదంతా నటన - మాట్లాడటం ఇష్టం లేక ఎప్పుడూ ఏదో ఒక సాధన... కొన్నాళ్ళు ప్రాణాయామము చెయ్యటం, కొన్నాళ్ళు నిరాహారంగా ఉండటం - ఇవన్నీ చేస్తుంటాడుగా? అందులో మౌనంగా ఉండటము ఇదొక సాధన. (అని నవ్వి) బాగుంది ఈ పద్ధతి. నిన్ను ఎవరూ దేనికి పలకరించరు. నాకు కూడా నేర్పు. ఇరవై నాలుగు గంటలు మాట్లాడటం నాకూ విసుగ్గా ఉన్నది. నాకు కూడా నేర్పుతావా నాన్నా" అన్నారు.

అమ్మ మాటలకు అతను నవ్వసాగాడు. అది పెద్దగా కాదు శబ్దం లేకుండా.

అమ్మ : శబ్దం కాకుండా నవ్వటం నేర్చుకున్నావే. బాగా సాధన చేశావన్న మాట. 56లో ఇక్కడకు వస్తుండే వాడివి. మొదట ఈ ఊళ్ళో మిషను సాహెబు దగ్గరికి వచ్చేవాడివి అవునా ?

అవునన్నట్టు తలూపాడు.

అమ్మ : ఈ మాట రాకపోవటం వలన మ్రింగటానికి గానీ వినటానికి గానీ ఇంకా ఏమైనా ఇతర బాధలున్నాయా ?

అన్నయ్య: ఏం బాధగా ఉండదు. (సంజ్ఞ ద్వారా)

అమ్మ : ఇలాంటి జబ్బులు ఇప్పుడు ఏమన్నా వస్తున్నాయేమో నాకు తెలియదు కాని నాన్నా, అన్నీ బాగుండి చివరకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా బాగుండి వాక్కు లేకపోవటం అంటే నాకు అతను కావాలని చేస్తున్నాడనిపిస్తోంది. మనం మరొకవిధంగా అనుకోవటానికి అతను పుట్టుకతోనే మూగవాడు కాదు. మధ్యలో ఒకవేళ మూగతనం వచ్చినా ఆ లోపాలు స్పష్టంగా తెలుస్తాయి. అసలు అది నిజంగా మూగతనమే అయితే డాక్టర్లకు చూపించ వద్దు అనడు. డాక్టర్లకు చూపించకపోయినా కనీసం శబ్దం చెయ్యటానికైనా ప్రయత్నిస్తాడు. ఏ విధంగానైనా తన భావం అవతలవాడు అర్థం చేసుకోవటానికి అవస్థ పడతాడు. ఇక్కడ అది కూడా కనిపించటం లేదు. అది సాధ్యపడకపోతేగా? కాని ఇక్కడ మౌనవ్రతం పట్టినప్పుడు ఎవరైనా ఏదైనా ప్రశ్నిస్తే కాగితంమీద వ్రాసినట్టుగా ఉన్నది.

నవ్వు చూడండి–ఎంత శబ్దం లేకుండా నవ్వుతున్నాడో : అంటే కావాలనే చేస్తున్నాడనిపిస్తుంది నాకు. ఏమిటీ అని అడిగారు కనుక నా ఉద్దేశం మాత్రం చెప్తున్నాను. నాకు తోస్తున్నది అదే. ఒకవేళ ఇదొక క్రొత్తరకమైన జబ్బో ఏమో నాకు తెలియదు. డాక్టర్లకి చూపించండి. లేకపోతే అబ్బాయి ఇష్టపడినట్లే పెద్ద వాళ్ళ దగ్గరికి వెళ్ళాలంటున్నాడు కనుక అట్లాగే అటువంటి వారి దగ్గరికి తీసుకు వెళ్ళండి.

పోనీ ఇదొక సాధన అయితే నాకు సాధనలు గురించి ఏం తెలుసు నాన్నా ? ఏం తెలియదు. ఎంతసేపూ ఈ సంసార తాపత్రయమే. పిల్లలు సరిగా అన్నాలు తిన్నారో లేదో అనీ... ఇంకా ఏవో గొడవలు. మీరు అది వద్దు–విముక్తి పొందాలని ఏవేవో సాధనలు చేస్తుంటారు. ఈ ప్రయత్నాలు ఎందుకో అసలు ఎందుకు సాధనలు అవసరమో కూడా తెలియదు నాకు... అని (ఆ స్త్రీ అతని సోదరి అట) ఆమెతో "మీరు అనవసరంగా బాధ పడ్తున్నారు. ఇదివరకు జరిగిన చేసిన తతంగాలలో ఇదొకటి. అప్పుడు వాటికి ఎలా చూస్తూ ఊరుకున్నారో ఇప్పుడూ అంతే. నిజంగా జబ్బు అయితే మాట రావటానికి మార్గాలు వెతుకుతాడు. నయం అయినా కాకపోయినా మందులు వాడుతాడు" అన్నారు.

అది ఋజువు పర్చినట్టుగా కిష్టయ్య ఈ సంభాషణ జరిగినంతసేపు నవ్వుతూనే ఉన్నాడు. ముఖ్యంగా అమ్మ అతనిది నటన అని అంటున్నప్పుడల్లా –

అమ్మ : (కిష్టయ్యతో) ఇది సైను ప్రకారము మంచి పద్ధతే. అనవసర ప్రసంగాలూ, వ్యర్థపుటాలోచనలు ఏవీ ఉండవు. మాట్లాడవు కనుక నిన్ను ఎవరూ మాట్లాడించరు. నువ్వు ఎప్పుడూ ఏవేవో సాధనలు చేస్తుంటావుకదా నీకు అభ్యంతరం ఏముంది ?

ఒకసారి వాళ్ళతో 'నేను ఇది కావాలని చేస్తున్నదే' అని చెప్పి ఇక ఆపైన మాట్లాడకు. వాళ్ళు చూడు నీకోసం ఎంతబాధ పడ్తున్నారో. ఎక్కడికీ వద్దు ముందు అమ్మ దగ్గరికి వెళ్తాను అని వచ్చావు ఇక్కడికి. నా బిడ్డల మనస్తత్వం గురించి నాకు తెలియదా : నిన్ను చూస్తే నాకు అనిపించింది

ఇది. మొదటిమాట అమ్మ దగ్గరే చెప్పాలని ఉన్నదంటావా చెప్పు. ఆ తర్వాత మాట్లాడకు. లేదంటావా నీ ఇష్టం.

ఈ మధ్య చాలామంది మెహర్‌బాబా విషయం విన్న తర్వాత ఈ పద్ధతి అంటే మౌనవ్రతం అవలంభిస్తున్నారు. మంచిదే నాయనా. అంటూ ప్రక్కవాళ్ళతో –

"చూడండీ గుటకవేస్తే ఎంత చక్కని శబ్దము అయ్యిందో" అన్నారు.

ఇదివరలో అతను ఆధ్యాత్మిక పుస్తకాలేవో చదివేవాడట.

"ఇప్పుడు కూడా చదువుతున్నావా" అని అడిగారు.

కిష్టయ్య : లేదు. (సంజ్ఞ)

అమ్మ : అవన్నీ ఎందుకనుకున్నావా ?

సమాధానం యివ్వలేదు.

అమ్మ : ఇంకా ఎవరి దగ్గరకన్నా వెళ్తావా ?

"రెడ్డిపాలెం కాంతయ్య బాబుగారి దగ్గరకు వెళ్ళాలని ఉన్నట్టు చెప్పాడు' అని రెండో అన్నయ్య చెప్పాడు.

అమ్మ : వెళ్ళిరా – ఈ మాట పోకముందు వెళ్ళేవా ?

కిష్టయ్య: వెళ్ళలేదు (సంజ్ఞ)

అమ్మ : సరే వెళ్ళు – కాని ఇప్పటిలాగే ఎవరన్నా రావాలా ?

కిష్టయ్య: రావాలి.

అమ్మ : ఎందుకూ ? రైలుఛార్జీ దండగ : మాటలు రానివాడివి కాదు. అవసరానికి మాట్లాడటంలో తప్పేంలేదు. నువ్వు వెళ్ళాలనుకున్న పెద్దవాళ్ళ అందరి దగ్గరికీ వెళ్ళొచ్చి పూర్తిగా మౌనంగా ఉండు.

"బస్సులు దొరుకుతాయో లేదో అమ్మా – ఇక వెళ్తాము" అన్నారు వారు.

ఆవిడ అన్నదీ "ఉన్న విషయం చెప్పారు కనుక వీడి గురించి కాస్త ఆందోళన తగ్గిందమ్మా" అంటూ నమస్కరించింది.

అమ్మ ప్రసాదం ఇచ్చారు.

**–ఏప్రిల్, 1969**

# పూజలో దీక్ష

తంగిరాల శాస్త్రి అన్నయ్యకు కలిగిన సందేహం ఇది. పూజ చేస్తున్నప్పుడు పూలు ఏదో యాంత్రికంగా పెడ్తున్నట్టు ఉన్నది కాని ఆ ఫీలింగ్ ఏదో రావటం లేదు. ఎందుచేత ?

అమ్మ చెప్పారు "ఇప్పుడు నన్ను చూడగానే ప్రేమతో కళ్ళవెంబడి నీళ్ళు వస్తాయి. అది ఫీలింగ్ కాదంటావా ? నువ్వు అందామన్న పదం అది కాకపోవచ్చు. కానీ అది నీకు వస్తున్నట్టే. ఎక్కడికన్నా గుళ్ళోకి వెళ్ళావు అనుకో నాన్నా, ఆ ఉద్దేశం లేకుండా బజార్లో పోతున్నావుకదూ, పోయేటప్పుడు గుళ్ళోకి రమ్మని నిన్ను ఎవరన్నా పిలిచారా? ఇంకో ఇంటికైతే వెళ్తావా? ఎవరన్నా పిలవనిదే వెళ్తావా ? అకస్మాత్తుగా ఆ గుళ్ళోకి వెళ్ళాలనేది నమస్కారం చెయ్యాలనేది ఫీలింగే. ఇలాంటివన్నీ నీకు తెలియకుండానే నీకు వస్తున్నాయి. పూలతో పూజ చేస్తుంటావు అనుకో, నీ మనస్సులో తమాషాగా ఈ పువ్వు మీద ఆ పువ్వు పెడ్తే బాగుందనిపిస్తుంది. నువ్వు అంతకుముందు ఇలా అనుకోలేదు – పేర్చుకురావటం ప్రారంభించాక ఈ పువ్వు ప్రక్కన ఆ పువ్వు లేకపోతే పెద్ద పువ్వు ప్రక్కన చిన్నపువ్వు పేరుద్దాము – అనే ఉద్దేశాలు వాటంతట అవే బయల్దేరుతుంటాయి. పూజకు కూర్చున్నప్పుడు ఇలా పేరుద్దాము అనుకోవు కానీ పేర్చటం ప్రారంభించాక రకరకాల భావాలు వచ్చి పేర్పు దానంతట అది సాగిపోతుంది. అది చూసుకొని నువ్వు ఆనందపడ్తావు. పెడ్తుంటేనే కళ్ళనీళ్ళు వస్తాయి. అప్పటిదంతా ఫీలింగ్ కాదని ఎట్లా అనగలవు? ఇదంతా పూజలో మామూలు అయింది కాని ఏదైనా ఇంకోస్థితి వస్తే అది నిజంగా ఫీలింగ్ అయినట్టు నీకు అనిపిస్తుంది. ఇవన్నీ నీకు తెలియనివి కావు. కొన్ని సహజమనిపిస్తాయి. గుళ్ళోకి పోవటం సహజం కనుక అది ప్రత్యేకత ఏముందీ అది ఫీలింగ్ ఎట్లా అవుతుందీ అని నువ్వు అనొచ్చు.

పూజకు కూర్చున్న తర్వాత చేస్తూ ఉంటే ఉండే ఆనందం, చేస్తున్నాను అని మరిచే ఆనందం రెండు ఉన్నాయికదా, ఇందులో అన్నీ మరుపువచ్చి చెయ్యటం ఆగిపోయి అమ్మ ఒక్కతే కనిపిస్తుంటే హాయిగా ఉంటుందని నీ ఉద్దేశం కావొచ్చు.

అమ్మ ఒక్కతే కనిపించే హాయి ఏమిటి ? అనుకుంటావేమో. మామూలు విషయం చెప్తాను. ఏదో అవసర విషయంలో ఆఫీసులోనే ఒక పొరపాటు

వచ్చింది. లేదూ - ఇంట్లోనే ఏదో తప్పు జరిగింది. ఆ విషయమే నీ మనస్సులో ఎక్కువగా పనిచేస్తున్నప్పుడు తతిమ్మావన్నీ నీ ఎదుట ఏం జరుగుతున్నా తెలియవు, వినపడవు, కనపడవు, అదే కనపడ్తుంది.

ఈ లాంటి తీవ్రమైనదశ మానవుడికి ఎప్పుడూ వస్తూనే ఉన్నది కాని దైవం అందుకోవటం లేదు. కనుక ఫీలింగ్ లేదు అనుకుంటున్నావు. ఆ స్థితి ఈ పూజలో కూడా వచ్చినప్పుడు కానీ అది సరైన పూజ కాదనీ నీ ఉద్దేశం పేర్చినవి పూలు కావొచ్చు కానీ ఆ పూలు కావు గుర్తు ఉండవల్సినవి. మనస్సు ఆ రూపమందు లగ్నమైపోవాలి. అంతేనా ?

**శాస్త్రి :** అదెట్లా వస్తుందని ?

**అమ్మ :** వస్తుంది. ఇవన్నీ లేవూ, వీటితోపాటే అవన్నీనూ. ఎప్పుడు వస్తుందంటే వస్తుందది. ఎట్లా వస్తుందంటే ఈ స్థితులూ ఇవీ ఎట్లా ఏర్పడ్డాయో - ఇది భయంతో ఏర్పడింది, బాధతో ఏర్పడిందిలా - అట్లాంటి పరిస్థితులలోనే అది కూడా వచ్చేస్తుంది. నువ్వు అన్న స్థితి భక్తి కావొచ్చు. ఇందాక నేను చెప్పింది బాధ కావొచ్చు.

ఇదంతా వింటున్న గోపాల్ అన్నయ్య “భయం మాట చెప్పావు. భక్తిమాట చెప్పావు. ఇప్పుడు భగవంతుడిని పూర్ణంగా ద్వేషించినా అంతేనా ?” అని అడిగాడు.

**అమ్మ :** అలా ద్వేషించే స్థితి రావాలిగా ? మనకు ప్రేమ ఎంత మిక్కుటమైతే ద్వేషించగలం ? భక్తి కంటే ఇది సులువుకాదు. నీకు భగవంతుడి యందు ద్వేషించటానికి తగినంత ప్రేమ కలిగితేనేగా ? ప్రేమ లేని చోట అసలు కోపం కూడా రాదే.

ప్రేమించే స్థితికన్నా ద్వేషించే స్థితి సాధ్యం అనుకుంటున్నావేమో కాని అది నువ్వు ఊహించినంత తేలికైన స్థితి కాదు.

అమ్మ దర్శనార్థమై నూతనాగంతకులు రావటంతో ఆ ప్రసంగం అంతటితో ముగిసింది.

**-మే, 1969**

# మమకారం

విజయవాడ నుండి వచ్చిన ఆ ముగ్గురు సోదరులు క్రొత్తవారేమీ కాదు. నాలుగైదుసార్లు వచ్చారు. వాళ్ళు కూడా తెచ్చిన పళ్ళూ - పూలూ అమ్మకు సమర్పించి కూర్చున్నారు. కొన్ని క్షణాల అనంతరం అందులో ఒక సోదరుడు "అమ్మా! ఎప్పుడన్నా నేను మీకు గుర్తు వచ్చానా?" అన్నారు.

**అమ్మ :** (చిరునవ్వుతో) ఇవ్వాల్టికి మూడు రోజులనాడు - చాలా కాలమైనదే మీరు వచ్చి అనుకున్నాను.

**అన్నయ్య:** (తృప్తిగా నిట్టూర్చి) మాకు నువ్వు మామూలుగా గుర్తుండవమ్మా. ఏదైనా బాధ కలిగినప్పుడు తప్పక గుర్తు వస్తావు.

**అమ్మ :** ఎట్లా అయితేనేం నాయనా, గుర్తుండటానికి, ఆ రూపంలోనైనా జ్ఞాపకం ఉంటానుగా.

**అన్నయ్య:** అందరూ అంటే కొందరు నీలో దైవత్వం చూడగలుగుతున్నారు. మరి నాకు చేతకావటం లేదమ్మా -

**అమ్మ :** దైవత్వమంటే ?

**అన్నయ్య:** అమ్మను అమ్మగా కాక ఏదో ఒక దైవరూపంలో చూడటం

**అమ్మ :** నువ్వనుకునేది కాకపోతేగా? నువ్వేం బాధపడబోకు నాన్నా! అమ్మను అమ్మగా చూసినా చాలు. ఈ మధ్య జగ్గయ్యపేట నుండి ఒకావిడ వచ్చింది. ఇక్కడ రెండు రోజులున్నది - వెళ్ళిన తర్వాత మొన్న ఉత్తరం రాసింది - ఈ ఆవరణనూ ఇక్కడి పద్ధతులనూ విమర్శిస్తూ. ఆ ఉత్తరం చూచి కోపం వచ్చింది వీళ్ళకు. కాని ఆమె విమర్శిస్తూ రాసినా - ఈ రూపంలో నన్ను చూడగలిగింది కదా - అంతే.

అమ్మ పటానికే పూజించినా అది శుక్రవారం పూజిస్తే లక్ష్మి అనీ మరోవారం అర్చిస్తే మరో దైవం పేరూ పెట్టుకుంటారు. ఇక్కడ పూజ నాకే చేస్తున్నా - అమ్మ అని చేస్తున్నారా? లేదు. పార్వతి అనీ రాజేశ్వరనీ ఏదో వాళ్ళ ఇష్టదైవ రూపాల్లో చూస్తుంటారు.

ఒక అబ్బాయి ఉన్నాడు నాన్నా. అతనికి అమ్మను దేవుడితో పోల్చటం కూడా ఇష్టం ఉండదు. ఒప్పుకోడు. రాముడూ - కృష్ణుడూ

అవతారమూర్తులే అయినా అమ్మ పదానికి ఇచ్చిన నిర్వచనం అమ్మకే సరిపోతుందంటాడు.

ఇట్లా ఎవరి ఇష్టదేవతలను వాళ్ళు చూసుకుంటే ఇంకొకరు కేవలం అమ్మగానే చూస్తారు.

ఇందులో ఏముందీ? – అంతా దైవం అయినప్పుడు నువ్వు అనుకునే అమ్మ దైవం కాకుండా పోతుందా ?

**మరొక అన్నయ్య :** ఏమిటోనమ్మా, ఎంత ప్రయత్నించినా నాకు దైవం మీద విశ్వాసం కుదరటంలేదమ్మా. నాలో దైవభక్తి లేదమ్మా ఇంతవరకు. ఇక అమ్మమీదే కలగాలి.

**అమ్మ :** నీకు కలిగినా, కలగకపోయినా నాకు నీ మీద (పుత్ర) వాత్సల్యం ఉంటుంది.

**అన్నయ్య:** అంతకంటే ఏంకావాలి నాకు ?

**అమ్మ :** నాకు మిమ్మల్ని దగ్గరకు తీసుకోవాలనీ, ఒళ్ళో పడుకోబెట్టుకోవాలనీ, పళ్ళు పెట్టాలనీ, అన్నం పెట్టాలనీ తప్ప మరింకేమీ అనిపించదు నాన్నా. నేను అనుకుంటాను, మమకారం అనిపిస్తుంది ? మమకారమంటే మిమ్మల్ని దగ్గరకు తియ్యటం మీరు కావాలనుకోవటం దీన్ని మమకారమనూ, అనురాగమనూ, అయితే నీ విరాగమేమిటి ? అనే వాళ్ళతో నా పోట్లాట ఏమిటో తెలుసా? సర్వత్రా అనురాగమే విరాగమని.

**అన్నయ్య:** మరి మమకారం అంటే స్వార్థంతో కూడినది కదా –

**అమ్మ :** ఏది కాదు స్వార్థం ? తనకు కావాలనుకోవటమే స్వార్థం. ఇప్పుడు ఇదంతా నా స్వార్థం కదూ ?

**–జులై, 1969**



# నిజంగానే అందరూ చిక్కిపోయారు

గంభీర మౌనముద్ర దాల్చిన వేళలోనో, ఏ పూజా సమయంలోనో అమ్మను చూసినవారుకానీ నూతనాగతులు కానీ సామాన్యంగా ఈ ప్రశ్న వేస్తుంటారు "అమ్మ మాట్లాడుతారా"? అని. అవును మాట్లాడుతారు – అనే సమాధానం కంటే ఇంకా ఎక్కువగా ఏం చెప్పినా అవతలవారికి అంత సంతృప్తిగా ఉండదు. నిజమే మరి – ప్రత్యక్షంలో పొందే అనుభూతి పరోక్షంలో ఎలా లభ్యమౌతుంది ? ఆ మరొకరు ఎంతగా వివరించి చెప్పినా అనుభవంలో పొందే సంతృప్తీ, ఆనందాలు ఏవిధంగా అనుభూతమౌతాయి ?

అవును, అమ్మ మాట్లాడుతారు. ఆయా సందర్భాలనుబట్టి, ఆ యా వ్యక్తుల తత్వాలనిబట్టి అనేక రీతులుగా అమ్మ మాట్లాడుతారు. అందులో చమత్కార భరితమైన, సరసపూరితమైన సంభాషణా నైపుణ్యం కూడా ఒక ప్రత్యేకత.



తనకు అన్నం తినిపిస్తున్న అమ్మతో అన్నారు కృష్ణమూర్తి గారు "నేను పసివాడిని అయితే ఎంత బాగుండును అమ్మా! ఎప్పుడూ ఇట్లాగే తినొచ్చు" అని.

అమ్మ – ఇప్పుడు పసివాడివి కాక పెద్దవాడివా ?



నాల్రోజుల క్రిందట వచ్చివెళ్ళిన ఒక అన్నయ్య మళ్ళీ ఈ రోజు వచ్చి అమ్మను చూశారు. వారు వెళ్ళాక అమ్మ అన్నారు "ఈరెండు రోజులలోనే బాగా చిక్కిపోయాడే" అని. అంటే సన్నబడ్డారని.

వెంటనే హైమ నవ్వుతూ అన్నది "అవునమ్మా నిజంగానే చిక్కిపోయారు" అంటే తన అభిప్రాయం అమ్మకు చిక్కారని.

అమ్మ కూడా నవ్వుతూ "అంతేగా, మళ్ళీ చూడాలనిపించటం చిక్కిపోవటమేగా" అన్నారు.



# అమ్మతో సంభాషణలు

"ఎంత మంచిదానివో కదమ్మా నువ్వు. కానీ నీ బిడ్డలను ఇట్లా ఏడిపించటం న్యాయం కాదమ్మా"

అమ్మ - మంచేగా నాయనా! ఏడిపించేది.



వాకిట్లో రోలు మీద కూర్చొని సంధ్య కళ్ళాపి జల్లి ముగ్గులు పెడుతున్న మా బృందాన్ని చూస్తున్న అమ్మను చూసి హరిదాసుగారు అన్నారు.

"ఆడవాళ్ళు రోటి మీద కూర్చోకూడదు".

అమ్మ- నేను ఆడదాన్నా, నేను ఆడదాన్ని కాదు. ఈడ దాన్నే.



ఒకరు- ఆయన సామాన్యులు కారు. పీఠాధిపతులతో సమానం.

అమ్మ- భోజనం చేసేటప్పుడు అందరమూ పీఠాధిపతులమే.



'నాన్నగారు అంటున్నారమా?'

"నన్ను గురించా"

'ఊఁఆ శరీరంలో ఏముందీ? భావబలం తప్ప బలం లేదు అంటున్నారు.

"బావబలం తప్ప ఏ బలమూ లేదు".

(నాన్నగారూ - అమ్మా, మేనత్త మేనమామ బిడ్డలు)



నేటి రాజకీయాలను గురించి ప్రస్తావన జరుగుతోంది. ఒక సందర్భంలో అమ్మ అన్నారు "ఈనాడు డెమోక్రసీ ఎక్కడున్నది? మాటల్లో తప్ప, ప్రతివాడూ మనస్సులో కోరేది డిక్టేటర్‌షిప్‌నే".



**ఒకరు :** నా ఉత్తరం చేరిందా అమ్మా ?

**అమ్మ :** ఊఁ

**అతను :** దానికి సమాధానం రాయలేదేమమ్మా.

**అమ్మ :** రాసేదేమున్నది. నాదగ్గర ఉంటుంది ఉత్తరం. ఉండటమే సమాధానం.



సాంబయ్యతో అన్నారు అమ్మ "ఉదయం నువ్వు చేసిన ఇన్‌జక్షన్ నొప్పి ఇంకా తగ్గలేదు. రోజల్లా గుర్తుకు వచ్చావు".

సాంబయ్య - అయితే అదృష్టమే.

అమ్మ- అవును. అదృష్టమే మరి. ఈ జబ్బులు రావటం, నీ మందులు నేను వాడటం.



ఇటీవలే వాళ్ళబ్బాయి పెళ్ళి చేసిన ఒక అన్నయ్య, కొడుకూ - కోడలితో వచ్చారు.

ఆ అన్నయ్య అడిగారు - కోడలు బాగుందా అమ్మా ?

అమ్మ - నాకు అంతా బాగుంటారు నాయనా! కోడలు ఎట్లా ఉన్నది అని అడిగావు కాని మా అబ్బాయి ఎట్లా ఉన్నాడని అడగలేదే ? బాగుండటం అంటే రూపం కాదు, అబ్బాయికి భార్యగా, నీకు కోడలిగా ఉన్నరోజే బాగుండటం.



ఏదో విషయంలో అమ్మ స్వగతంగా "చలిమంట కాదు చితుకుల మంటే వేసుకున్నాను" అంటే గోపాల్‌ను అడిగాడు కేశవ్ విన్నావా ఆ మాట.

గోపాల్- మనకా సబ్జక్టు వద్దు.

అమ్మ- బడ్జటేగా, వాడి సబ్జక్టు అంతా బడ్జటేగా.



అమ్మ ఏవో కబుర్లు చెప్తుంటే అవి చూసి త్వరత్వరగా రాస్తున్న భవానీని "ఇప్పుడు నేను అన్నమాట వినపడిందా" అన్నారు.

ఆ అమ్మాయి రోషంగా అన్నది :

"నేనేం నీ కోడలిని (ఒక సోదరిని అమ్మ ముద్దుగా పిలిచే పిలుపు) కాదమ్మా వినబడకపోవటానికి.

**అమ్మ-** నా కోడలివి కాదు. కానీ నా కూడలివి.



రాఘవయ్యగారు- రాధ మొత్తానికి అవధూతే....

**అమ్మ-** వాడికి కోపమొస్తే మన పాలిట యమదూతలాగా ఉంటాడు.



రాఘవయ్యగారు - నీతో మాట్లాడటం అసాధ్యమమ్మా.

**అమ్మ** - అయితే నీకు సాధ్యమవుతున్నదన్నమాట.

✦✦✦

నాన్నగారు - ఆడదానికి కర్మాధికారం లేదు.

అమ్మ- (నవ్వుతూ) జ్ఞానాధికారం తప్ప కర్మాధికారం లేదేమో !

✦✦✦

జిల్లెళ్ళమూడికి విద్యుత్తు సౌకర్యం కలిగిన తర్వాత వచ్చిన ఒక అన్నయ్య అడిగారు 'ఈ లైట్లు ఎప్పుడు వచ్చాయి?'

**గోపాల్:** మార్చిలో.

**అమ్మ:** (నెమ్మదిగా) అవును. ఆ దీపాలు మార్చి ఈ దీపాలు వచ్చాయి మార్చిలో.

✦✦✦

'మేము ఏ క్లాసు అమ్మా?' (దశాబ్దం పైగా అమ్మ సన్నిధికి వస్తూన్న ఒకరి ప్రశ్న)

**అమ్మ:** క్రమంగా బడికి రావటం నేర్చుకొండి. తరవాత బడిలో వేయటం అనే ప్రశ్న.

✦✦✦

ఒక సోదరి అమ్మతో వసుంధర గురించి "పెళ్ళి అయ్యాక వసుంధర బావుందమ్మా. చూడగానే గుర్తుపట్టలేదు' అంటే అమ్మ అన్నారు :

"వసుంధర తత్వమే అంతకదా! ఒకచోట ఎర్రగా ఉంటే ఇంకో చోట నల్లగా ఉంటూ మరొకచోట ఇసుకగా ఉంటుంది కదా? అందుకే మారుతూ ఉంటుంది".

**-అక్టోబరు, 1969**



# సృష్టికి నాశనం లేదు - సృష్టికి మించిన మహిమ లేదు

సృష్టిని గురించి ఆయా సందర్భాలలో అమ్మ ఇచ్చిన నిర్వచనాలని గూర్చి ఈ లేఖలో చదువుదాము.



తనను కూడా రానివ్వని కారు ప్రయాణం వింతలు చెపుతూంటే గోపాల్ అన్నాడు అమ్మతో - "పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణసంకటం".

**అమ్మ** : సృష్టంతా అదే.



సుబ్బారావు అన్నయ్య తెచ్చిన వైకుంఠపాళి పటాన్ని చూస్తూ అమ్మ అన్నారు మంచి - చెడు ఈ ద్వంద్వాలు లేకపోతే ఏముంది ? చెడు లేక పోతే మంచి లేదు. "మంచి లేకపోతే చెడులేదు. ఈ మంచీ - చెడు నా దృష్టిలో లేవు. నా దృష్టిలో హెచ్చూ-తగ్గూ మాత్రమే. ఒకటే అయితే ద్వంద్వం లోని ఆనందం ఏం తెలుస్తుంది? ఈ పటంలో ఈ నిచ్చెనలకు ఇంత విలువ ఎందుకంటే ప్రక్కన పాములు ఉన్నాయి కనుక"



"అంతా మనదే అనే భావం వుంటుంది. కానీ మనదేదీ లేదు. అంతా మనదనే భావం లేకపోతే సృష్టి లేదు.

**ఒకరు :** భగవంతుడు సృష్టి ఎందుకు చేశాడు ?

**అమ్మ :** సృష్టే భగవంతుడు కనుక.

**ఒకరు :** సృష్టికి నాశనం లేదా ?

**అమ్మ :** నా దృష్టిలో లేదు. సృష్టికి రూపాంతరం తప్ప నాశనం లేదు.



**ఒకరు :** చివరకు ఇదంతా ఏమౌతుందమ్మా ?

**అమ్మ :** దేనికి చివర ? ఎక్కడికి చివర ? సృష్టికి ఆద్యంతాలు లేవు.

"సృష్టి అంటే ఏర్పడటం"

"భిన్నత్వం లేనిది సృష్టే లేదు"

"సృష్టి అనాది - నాది, ఎవరిదో కాదు నాదే"

"సృష్టితోనే సృష్టి అయింది"
"సృష్టి కంటే విశేషం లేదు"



**ఒకరు :** సృష్టి ఎందుకు ఏర్పడింది ?
**అమ్మ :** నిప్పు ఎందుకు కాలుతుంది, నాన్నా ?
**ఒకరు :** దాని స్వభావం అది.
**అమ్మ :** ఇదీ అంతే నాన్నా.



**ఒకరు :** సృష్టి ఏమిటంటారు?
**అమ్మ :** సృష్టి ఏమిటనేది ఏముందీ? సృష్టి సృష్టే. అనుక్షణం జరుగుతూనే ఉన్నది.



"సమానమైన నడకే ఉంటే అది హెచ్చు-తగ్గులు ఎట్లా అవుతుంది. సృష్టిలోనే ఉన్నది. అసలు వ్యష్టిత్వం లేకపోతే సృష్టి ఏముంది? అంతా సమంగా ఉంటే వాడు అట్లాపడి ఉండవల్సిందే. గారెలు చెయ్యాల్సి వచ్చినప్పుడు మినపప్పులో పప్పు అంత ఉప్పు పోస్తే రుచి ఏముంది? దానికి తగినంత పాళ్ళు వేస్తేనే రుచి".



"సృష్టిలో ఏదీ పనికిరాని వస్తువు లేదు. అన్నీ మనకోసమే ఏర్పడ్డాయి. 'ఇది చెత్త, పనికిరాదు' అనుకున్నది కూడా ఒకప్పుడు అవసరమౌతుంది. ఒకప్పుడు ఒకరికి ఒకటి అవసరమైతే, ఇంకొక సమయంలో మరొకటి అవసరమౌతుంది. అన్నీ పనికి వచ్చేవే".



ఆ అక్కయ్య అన్నది "ఇంతకీ వాడి ఆరోగ్యం చెడిపోవటానికి కారణం ఆ పాడు తాగుడేనమ్మా?"

**అమ్మ :** వాడి ఆరోగ్యం చెడటానికి కేవలం నేను త్రాగుడే కారణం అనను. ప్రపంచంలో ఏ వస్తువూ చెడ్డది కాదు. అన్నీ అవసరమయ్యే ఏర్పడ్డాయి. అయితే ఆ వస్తువులు సమయాన్ని బట్టి పరిమితిగా ఉపయోగించే వేళలున్నాయి. విషం ఉన్నదనుకో అమ్మా. ప్రాణంపోయే ఒకానొక

పరిస్థితిలో ఒక చుక్క అది విషయమైనా అమృతంలా పనిచేస్తుంది. అదే ఎక్కువైతే విషమే అవుతుంది. ఉప్పు రుచి కోసము ఉపయోగించేదని మోతాదుకు మించి వేసుకోము కదా! ఏదైనా అంతే – అన్నీ అవసరమైనవే. సృష్టిలో అక్కర్లేనిది ఏదీ లేదు.



"ఇక్కడ మహిమలేమున్నాయి నాన్నా, ప్రపంచమే మహిమగదా. అంతకంటే మహిమ ఏముంది ? అందులోని భాగాలే కదా ఈ మహిమలన్నీ, సృష్టే మహిమ. అది అనుక్షణం జరుగుతూనే ఉన్నది. అందులోవేగా అన్ని భాగాలు".

**–నవంబరు, 1969**

COURTESY VISWAJANANI TRUST

# అమ్మ జ్ఞాపకశక్తి

అమ్మ జ్ఞాపకశక్తిని గూర్చి ప్రతివారు "అద్భుతమైన జ్ఞాపకశక్తి" అంటారు. అవును మరి – ఎన్ని సంవత్సరాలైనా గడవనీ. అది పెద్ద సంఘటన కానీ, చిన్న విషయమయినా కానీ ఆ సమయంలో అక్కడ ఉన్న వాతావరణ స్థితితో సహా ఏ సంగతైనా చెప్తుంటే, మనలో బలంగా ముద్రితమయిన జ్ఞాపకాలైనా ఆ విధంగా గుర్తుండని మనకు ఆ విధంగా అనిపించటంలో ఆశ్చర్యం ఏంలేదు. ఈ మాటే అమ్మతో అంటే నవ్వి అంటారు – "నాకు గుర్తు ఉండటంలో విశేషం లేదు. నాకు ఎప్పుడో జరిగినట్టు ఉండదు. జరుగుతున్నట్టే ఉంటుంది. నేను చెప్పటంలో విశేషం ఏం లేదు".

అంటే అమ్మకు వర్తమానం తప్ప భూత – భవిష్యత్‌లు లేవు అన్నమాట. అదెప్పుడు సాధ్యపడుతుంది? కాలమే తానైనప్పుడు.



"ఇక్కడకు నువ్వు రావటం ఇదే మొదటిసారి కాని నేను నిన్ను చూశాను. పొన్నూరు నేను వచ్చినప్పుడు చూశాను" అన్నారు అమ్మ; అదే తొలిసారిగా ఇక్కడకు వచ్చిన ఒక అన్నయ్యతో.

'అవును' అన్నాడు ఆ అన్నయ్య.

**అమ్మ :** పందిట్లో అంటే దానికి ఎదురుగా ఉన్న ఇంటిప్రక్క పాక ఉన్నది. అక్కడ ఉన్న అరుగు మీద కూర్చున్నట్టు గుర్తు, పూరింటికి ఇవతల ప్రక్కన నువ్వూ ఇంకా ఇద్దరు ముగ్గురు కలిసి కూర్చున్నారు.

అన్నయ్య ఆశ్చర్యచకితుడయ్యాడు. అన్నివేలమంది ఉన్న పందిట్లో ఎక్కడో దూరంగా కూర్చున్న తనను చూసినదంటే ఆ గుర్తుకు.



ఆ వృద్ధురాలు మరోసారి నమస్కారం చేసి తృప్తి నిండిన స్వరంతో అన్నది "నాకు తృప్తిగా ఉన్నదమ్మా. నేను తెచ్చిన ఈ బుజ్జిచీర కట్టుకుంటావనుకోలేదు. ఎన్ని సంవత్సరాలైందో తల్లీ నిన్ను చూసి."

**అమ్మ :** ఇరవై సంవత్సరాల క్రింద చూశావమ్మా. నేను మీ ఇంటికి వచ్చినప్పుడు.

**ఆమె :** మీరు పెద్దబ్బాయిని తీసుకుని నిద్రకు వచ్చారప్పుడు.

**అమ్మ :** అవును. అప్పుడు మీరు చేసిన బజ్జీలు, పరమాన్నం గుర్తున్నాయి.



**గోపాల్ :** నీకు ఏ ఉంగరానికి ఏ రాయి ఉంటుందో, ఎటువంటిదో – అవి కూడా గుర్తు ఉంటాయా అమ్మా?

**అమ్మ :** మీరు ఉండటంలా, అట్లాగే. పైకి రాళ్ళు ఒకటిగా కనిపిస్తాయి. కాని కట్టుబడిలో రాయి కోతలో పరీక్షగా చూస్తే మార్పు కనపడుతుంది.



"నువ్వు 63 ఆగస్టు 19న కదూ వచ్చింది."

భరద్వాజ అవును అన్నాడు.



**గోపాల్ :** అమ్మా, మొన్న ఎవరో అంటున్నారమ్మా. ఈమె పొగాకు బేరన్‌లో పనిచేసినామేనని.

**అమ్మ :** అవును. వాళ్ళతో చేయించటమేకాక చేసేదాన్ని. ఆకు అల్లేదాన్ని. బేరన్‌లో బొగ్గువేసే దాన్ని. ఏ ఆకుపైన వేస్తే బాగా రంగు వస్తుందో చూస్తుండే దానిని.

(నాన్నగారు పొగాకు వ్యాపారం చేసే రోజులనాటి సంగతి)

**అమ్మ :** ఎవరూ అన్నదీ ? తత్వాలు పాడుకుంటూ వుంటాడే – ఆయనేనా ?



సంతమాగులూరు నుండి వచ్చిన ఆ సోదరుడిని చూచి అమ్మ అన్నారు "ఇదివరకు వీళ్ళ అన్నయ్య వచ్చినట్లున్నాడు" అని.

రామకృష్ణ అన్నయ్య అడిగాడు. ఆ అన్నయ్య అవును అన్నాడు.

"పోలికలున్నై" అన్నారు అమ్మ.



హైద్రాబాదు నుండి వచ్చిన ఒక అన్నయ్య అమ్మకు ఒక ఉత్తరం యాపిల్ పళ్ళూ ఇస్తూ – వేణుగోపాలరావుగారు ఇచ్చారు. నమస్కారాలు చెప్పమన్నారు – అని చెప్పారు. అమ్మ ఆ ఉత్తరం చూడకుండానే "58లో వచ్చాడు అనుకుంటా" అన్నారు.

'అవును' అన్నాడు ఆ అన్నయ్య.

మొదటిసారి గోపాలరావుగారు రావటం, ఆ రోజు వారు వేసుకున్న దుస్తులూ, అమ్మతో వారు సంభాషించిన విషయమూ, ఆనాటి వాతావరణంతో సహా చెప్తుంటే ఆ సోదరుడు ఆశ్చర్య చకితుడయ్యాడు.



26-3-66 నాడు రాత్రి 7 గంటలకు జమ్ములపాలెం నుండి కొంత మంది అక్కయ్యలు వచ్చారు. అందులో ఒకావిడ అడిగింది -

'నేను గుర్తున్నానమ్మా?'

"నీ పేరు కమలమ్మ కదూ?"

కమలమ్మ ఆశ్చర్యపోయింది. 1939లో చీరాలలో బేర్ హాస్పిటల్లో ఉన్నప్పుడు అక్కడ రెండు రోజుల పరిచయమున్న వ్యక్తి ఆమె.



20-6-63 నాడు దుగ్గిరాల నుండి ఇక్కడకు మొదటిసారి వచ్చిన ఒకావిడ ఫలపుష్పాదులు సమర్పిస్తూ...

'నేను జ్ఞాపకం ఉన్నానా?' - అని అడిగింది.

"మీరు పిచ్చమ్మగారు కదూ?"

అమ్మ ఆమెను 1948లో చూశారట వేటపాలెంలో.



"నువ్వొకసారి వచ్చావు కదూ?"

'అవునమ్మా-'

"క్రితంసారి మీ అమ్మా, నాన్నా, భార్యతో కలసికదూ వచ్చింది? అప్పుడా అమ్మాయి జబ్బు మనిషిగా కనిపించింది. ఇప్పుడెట్లా ఉన్నది ?"



27-2-64 న రామకృష్ణారావు గారితో -

"నాన్నా - నువ్వు మొదటిసారి వచ్చినప్పుడు నీలిరంగు చొక్కా వేసుకుని మందిరంలో బల్లమీద కూర్చున్నావు కదూ?"



నరసింహమూర్తి గారితో

"మొదటిసారి నిన్ను చూడటం చింతకాయలు తొక్కుతున్నప్పుడు రోటి దగ్గరే".



4-8-64 నాడు -

**నాన్నగారు :** మరీ.... నేను హైమ నెత్తుకునీ, నువ్వు రవి నెత్తుకునీ, సుబ్బారావు నుంచునీ తీయించుకున్న ఫొటో ఉండాలిగదూ ?

**అమ్మ :** అవును – 47 ఆగస్టు 15న తీయించుకున్నాం.



"నాగపూర్‌లో ఉంటున్నావా?"

'అవును – అనంతపూర్ నుండి వస్తున్నాను'

"వాళ్ళ నిక్కడుంచి నువ్వు ఒక్కడివే అక్కడుంటున్నావా?"

'నాకింకా పెళ్ళి కాలేదు'.

"నాకు తెలుసు నాన్నా – నీకు పెళ్ళికాలేదని. మొదటిసారి వచ్చినప్పుడే చెప్పావు. నాకు బాగా జ్ఞాపకముంది. వాళ్ళు – అంటే తల్లిదండ్రుల గురించి నువ్వు అన్నావు... జ్ఞాపకముందా ? తల్లిదండ్రులకు పెరిగేవరకూ మనం పిల్లలమనీ, మనం పెరిగేక వాళ్ళు మనకు పిల్లలనీ... అంత జాగ్రత్తగా వాళ్ళను చూడాలనీ... అన్నావు. అది గుర్తు పెట్టుకునే ఇప్పుడు వాళ్ళను గురించి నేను అడిగింది–"



వర్ధనమ్మ బామ్మగారు నివేదన కలిపి పెట్టుతూ వుంటే అమ్మ తిన్నారు.

**కామేశ్వరమ్మ అమ్మమ్మ :** అత్తగారు పెడుతున్నదనా ఎక్కువ తింటున్నావు?

**వర్ధనమ్మ బామ్మ :** అత్తగారు కాదమ్మా పెట్టటం – (భక్తురాలు)

**అమ్మ :** అత్తగారు కాకముందే (అంటే నా పెళ్ళికి ముందే) పెట్టావుగా – అదెప్పుడంటే... కిష్టయ్య తాతగారి పాకలో సుబ్బారావుకు అన్నం పెడ్తుండగా వచ్చాను. గోంగూర పచ్చడీ, వెన్నపూస వేసి కలిపెట్టావు. 'మీ అమ్మ నా స్నేహితురాలమ్మా' – అంటూ పెట్టావు.



'వీరు రేడియో ఇంజనీరు'.

"నే నెఱుగుదును" అన్నారు అమ్మ.

వారి తండ్రి 1935లో బాపట్లలో తహశీలుదారుగా పనిచేస్తున్నప్పుడు చిదంబరరావు గారి ఇంట్లో ఉండేవారట. అప్పుడు అమ్మకు 12 పం॥ వయస్సు. ఈ మధ్య 33 సంవత్సరాల కాలం గతించింది. అమ్మ వారిని పోల్చుకోడమే కాక వారి కుటుంబంలోని ప్రతి ఒక్కరి పేరుతో వారి గుణగణాలు వారి బంధువుల విషయాలూ చెప్పారు.

**–డిసెంబరు, 1969**






అమ్మ ను పూజిస్తున్న హైమ, భవానీ కుమారి



దీపావళినాడు అమ్మతో ఆనందంగా భవానీకుమారి

## ఈ గ్రంథాన్ని గూర్చి

ఒక సామాన్య స్త్రీ అసంఖ్యాక జనులచే ఎలా ఆకర్షింపబడింది? ఎలా ఆరాధ్యమూర్తి అయింది? ఆమె ఎవరిని ఆరాధించింది? ఆమె నిత్యకృత్యమేమిటి? వసుధైక కుటుంబిని ఎలా అయింది? విశ్వజననిగా ఎందుకు పిలువబడింది? ఆ సమ్మోహన శక్తిని చూచిన వారికి కొత్తరక్తం పట్టుతుందన్నది నిజమేనా? అక్కడి వారంతా అక్కయ్య అన్నయ్యా అని పిలుచుకోవడంలోని రహస్యమేమిటి? ఆ సోదర సోదరీభావం వారిలో ఎలా చోటు చేసుకున్నది?

కుల మత వర్గ వర్ణవిచక్షణ లేకుండా అంతా కలిసి భోజనం చేస్తారట కదా! అక్కడ శుభాశుభాలు రెండు సమానమేనటగదా! నిషేధాలు, ఆచారాలు పాటించరట గదా! అక్కడ అందరింట్లో ఎవరి స్థానం వారికున్నదిటగదా! అమ్మకు అందరూ బిడ్డలేనట గదా! అందరూ సమానమేనట గదా!

నక్సలైటూ, నరకాసురుడూ బిడ్డలేనంటూ ఎవరిలోనూ లోపా లెంచని తల్లి ఉన్నదిట గదా! అక్కడ కూతురిని, కోడలిని సమానంగా చూచే అనంతమాతృత్వం రూపందాల్చి ఉన్నదిట కదా! అనే ప్రశ్న లన్నింటికీ, అమ్మ దినచర్యలో, అమ్మ మాటలలో మనకు స్పష్టంగా సహజంగా కనిపింపచేస్తుందీ గ్రంథం.

భవానీకుమారి అనే ఒక అన్వేషి, ఒక జీవి దర్శించిన సత్య దర్శనం ప్రతి వాక్యములోను మనకు కనిపిస్తుంది. చదవటం మొదలు పెట్టండి. మీకే తెలుస్తుంది.

– శ్రీ విశ్వజననీ పరిషత్

జిల్లెళ్ళమూడి.